# విషయానుక్రమణిక

## జూలై 1966

# వర్షా విలాసము

శ్రీ పేరాల భరతశర్మ

(వాల్మీకమున కిష్కింధాకాండము 28 వ సర్గమున వర్షఋతు వర్ణన మున్నది. అందలి కొన్ని శ్లోకముల కీ క్రింది పద్యము లనువాదములు.)

సవితృ కిరణాళి సబ్ధిరసమ్ముఁ గ్రోలి
పూర్ణగర్భమ్ము నవమాసములు వహించి
యంబ దాంగన ప్రసవించు నద్భుతముగ
సకల జన సేవ్యమైన రసాయనమ్ము.

మేఘ సోపాన పంక్తిపై మిన్నుఁజేరి
కుటజ సర్జార్జున కదంబ కుట్మలముల
నింపుగా భాస్కరు నలంకరింపవచ్చు
(నంతరస్థు నారాయణు నరయవచ్చు).

సాంధ్యరాగోత్థితము లతి సాంద్ర పాండు
రాంతములునగు స్నిగ్ధాంబు దాంశుకముల
నంబరము వ్రణ బద్ధమైనట్లు దోచె
(విరహిణీ మానస ప్రతిబింబ మట్లు).

మందమారుత నిశ్వాస మంజులమ్ము
సాంధ్యచందన రంజిత సకలగాత్ర
మగుచు నాపాండు జలదమై యంబరమ్ము
కనగ కామాతురమ్మగఁ గానవచ్చె.

అంబుదోదర మందుండి యవతరించి
యబ్జ సుఖ శీతల స్పర్శ మనుభవించి
మొగలి పూరేకులందునఁ బొదలినచ్చు
తరుణ పవనమ్ముఁ దోసిళ్ల ద్రావవచ్చు.

అణగెన్ రజస్సు, వాయువుఁ
దనరెన్ హిమవంత మగుచు; తాపములడగెన్;
జననాథుల యాత్రలుడిగె;
చనుచుండిరి పాంథులింటి చాయల కింకన్.

# భా ర తి

ఆకృతిని తేటిఁ బోలి రసాకులమయి
నేరెడుంబండు కోర్కిమై నారగింప
బడుచునుండె; పవనహతి బడుచునుండెఁ
న్రామ ఫలము విపక్వమై యధికరుచుల.

నిగనిగ లాడెడు పచ్చిక;
వగలు వగల నృత్యములను బఱపెడు బర్హుల్;
తెగకురిసి విడుచు ఘనములు;
పగలు నడిమి జాము వనుల పరగున్ సొగసుల్.

జలముల భారము నిడుకొని
తల రొప్పుచు రోజు చంబుధరముల్ తుంగా
చలశృంగాగ్రమ్ములపై
నలనల్లన యాగియాగి యరుగుచు నుండున్.

ముదమున ఘన సంపర్కము
మదిగోరి బలాక పంక్తి మలగెన్ దివిపై;
చదలున వ్రేలుచు గాలికిఁ
జెదరిన కమలముల మాల చెలగెడు భంగిన్.

షట్పదాళిచే సంగీతశాల లటుల
నీలకంఠాళి నర్తనశాల లటుల
వారణేంద్రాళిచే మదవంతులటుల
వరలె నైకాశ్రయిణులన వనుల గములు.

సురతామర్ద విభిన్నామర తరుణీ కంఠహార మౌక్తిక మాలా
పరిరమ్యమ్ముగ దిశలన్ దరలెన్ వర్షాంబుద నవ ధారా తతులున్.

వర్షమేకధారగఁ బట్టె పటుతరమ్ము
వీచె ఘోషించి వాయువుల్ వేగవేగ
వొడ్డు విరియు నదులు రెచ్చెనొక్కత్రోవ
తెన్ను లేక జలమ్ముల తీవ్రగతుల.

# శ్రీ అరవిందుల నవ్యతంత్రం

శ్రీ వేలూరి శివరామ శా

శ్రీ అరవిందుల పూర్ణయోగం అనే సముద్రంలో తంత్రం, వేదాంతం అనే నదులు మరి పెక్కు నదులతోపాటు సంగమించినై. ఆ సరిత్ సాగర సంగమ స్థలంలో ఒక కొత్త క్షేత్రం తలచూపింది. ఈ నవ్య క్షేత్రాన్ని చూడబోయే ముందు వేదాంతానికిన్నీ తంత్రానికిన్నీ సామ్యం ఎక్కడో వైషమ్యం ఎక్కడో మనకిక్కడ ఉపయోగించేటంత కొలదిగా పరిశీలించి ముందుకు పోదాం.

## వే దాం త ం

'వేదాంతం, వేదాంతం', అని అంటున్నావు; వేదాంత మేదో ముందు పరిష్కరించు' అని అంటే ఆదిలోనే హంసపాదు పెట్టవలసి వస్తుంది. సాంఖ్యులూ యోగులూ అద్వైతులూ విశిష్టాద్వైతులూ యోగ—సాంఖ్యేతరులైన ద్వైతులందరూ 'మాదే వేదాంతమం'టే 'మాదే వేదాంత'మని అంటారు. ఎవరి కుపయోగించేటంత 'వేదాంతం' వేదాంతానికి అర్థమైన ఉపనిషత్తులలో ఉంది కాబట్టి ఎవరితో మనకు తగవు?

భరత ఖండంలో సేతువు దగ్గరనుంచీ శీతాచలం వరకూ ఉన్న పామరులు కూడా జన్మ దుఃఖ మనిన్నీ జన్మ లేకుండా వుంటే పీడ పోతుందనిన్నీ అనుకుంటారు. ఇక వేదాంతుల మాట చెప్పనే అక్కరలేదు. పామరుల ఈ దుఃఖానుశీలనమే అద్వైతాది వేదాంతాలకు పునాదియేమో అని అనిపిస్తుంది. చివరకు చార్వాకు లనబడే నాస్తికుల 'బుట్టెడు బూడిదై పోయే శరీరం మళ్లా వస్తుందో రాదో! ఋణం చేసి నేయి తాగు' అన్న సాహసోక్తిలో గూడా పై యభిప్రాయం తొంగి చూస్తున్నటులు కనబడుతుంది.

వేదాంతాల తుదిమాట బ్రహ్మము. కొన్ని కొన్ని వేదాంతాలకు సగుణ బ్రహ్మ. ఇది సచ్చిదానంద స్వరూపం. 'ఏకమేవాద్వితీయమ్'. వ్యాపకం.

ఈశ్వరుడూ పురుషుడూ అనబడే వారు బ్రహ్మ యొక్క రూపాంతరాలు. ఇతడు స్రష్ట. ఈశ్వరుడే సృష్టి కధీశ్వరుడు. సృష్టికి రెండు కారణా లుండాలి. ఒక బొమ్మను గీయడానికి చిత్రకారుడున్నూ పరికరాలూ ఉండవూ? అలాగే సృష్టికిన్నీ ఉండాలి. ఈశ్వరుడు ప్రధాన కారణం లేక సమవాయి కారణం. ప్రకృతి అప్రధాన కారణం లేక నిమిత్త కారణం. అంటే ప్రకృతితో పదార్థాల సృష్టి. పంచదారతో ఎన్నో రకాల బొమ్మలూ ఏనుగులూ గుఱ్ఱాలూ చిలకలూ మొదలయినవి చేయరూ! ఆలాగే ఈ ప్రపంచంలోని వస్తువుల సృష్టిన్నీ. ఈ ప్రకృతి, పురుషుని భోగం అనగా అనుభవంకోసమే ఇన్ని పదార్థాలుగా మారి ప్రపంచం అయింది. పురుషుడు లేక ఈశ్వరుడు స్థిరుడు. ప్రకృతి స్థిరంగా ఉండక

పోవటమేకాక పరిణామం చెందుతూ వుంటుంది. పురుషుడు నిత్యముక్తుడయినా ఆ పురుష సత్తను ఆవరించి ఉంటుంది ప్రకృతి. అయినా ఈ పురుషుడు లేక ఈశ్వరుడు ప్రకృతి బద్ధుడు కాడు. శంకరాచార్యులవారున్నూ తదను యాయులున్నూ ఈ ప్రపంచం మాయాసృష్టి అని అన్నారు. అది అఘటన ఘటనా పటీయసి. అది లేనిదాన్ని ఉన్నట్లు చూపుతుంది. తాడు పాములే కనబడదూ! అది మాయ.

జీవుడు తన్ను బ్రహ్మమునుగా తెలిసి కోవడమే ముక్తి. ఇది అద్వైత వేదాంత—ఉప దేశం. ఈ సాధనలో ప్రకృతి కంటె తాను వేరని తెలిసి జ్ఞానయోగం అవలంబించి కైవల్య మోక్షం పొందవచ్చు. భక్తియోగంతో ప్రపన్నుడై సనాతనపురుషసాయుజ్యం పొంద వచ్చు. కర్మయోగంతో సర్వకర్మలు ఈశ్వ రార్పణం చేసి ప్రకృతి నుజ్జగించి నిష్కాముడై పరమ పురుష లాభం పొందవచ్చు. భగవద్గీతలో జ్ఞాన భక్తి కర్మయోగాలు చూచేది.

## తంత్రం

తంత్రంలో 'పరాసంవిత్' అనేది వేదాం తుల బ్రహ్మము వంటి పరవస్తువు. అది సచ్చిదా నంద రూపం. దీనిలో స్థితిగతులు రెండూ వున్నవి. మరి సమానంగా కూడా ఉన్నవి. సృష్టి జరగడానికి ముందు ఈ సచ్చిదానందవస్తువు యొక్క గతి ఉన్నది. దాని పేరే 'ఆద్యాశక్తి', లేక జగన్మాత. సచ్చిదానంద వస్తువులో ఉన్న గతిమయమయిన శక్తే 'ఆద్యాశక్తి'. ఇది కొందరు వేదాంతులు చెప్పే మాయాకాదు; ప్రకృతీకాదు. ఈ శక్తి సచ్చిదానందమయం.

పరసంవిద్రూపుడే పరశివుడు. అతని గతే ఆదిశక్తి. పరశివుడు తనకు వేరుకాని ఆది శక్తి రూపంతో ఈ ప్రపంచం సృజించాడు. ఈ ఆదిశక్తే స్వేచ్ఛా కల్పితమైన మాయా యోగంతో తన్ను తాను మెట్టుమెట్టుగా సంకు చితం చేసికొని ప్రకృతిగా వెలిసింది.

'గచ్ఛతీతి జగత్'. గతిశీలమయినది జగత్తు అని నిరుక్తి. గతితో కూడినది ప్రకృతి. ప్రకృతి కిన్నీ బాహ్యప్రకృతికిన్నీ అంతః ప్రకృతికిన్నీ పైన 'పరా ప్రకృతి' ఒకటి ఉన్నది.

భూమిరాపోఽనలో వాయుః
ఖం మనో బుద్ధి రేవ చ
అహంకార ఇతీయం మే
భిన్నా ప్రకృతి రష్టధా

అపరేయ, మితస్త్వన్యాం
ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతాం మహాబాహో
యే నేదం ధార్యతే జగత్.

(గీ. ౭-౪౫)

"పంచభూతాలూ మనోబుద్ధ్యహంకా రాలూ అనే ఎనిమిదివిధాలుగావున్నటువంటిది నా ప్రకృతి అపరాప్రకృతి. దీనికి వేరుగా జీవభూతమయిన నాప్రకృతి పరాప్రకృతి. ఈ ప్రకృతియే—జీవ భూతమయిన ప్రకృతియే, జగత్తును ధరించేది."

అదీ భగవానుడూ ఒకటి, లేక భగవంతుని అంశం. 'మమైవాంశః'. లేక ఆదిశకి స్వరూపం లేక అంశం. ఈ స్వరూపంతో అది గతిశీలం. ఇలా ఐనా అది సచ్చిదానందవస్తువు యొక్కయే స్పందం శివుడే శక్తిరూపంతో గతిశీలుడైనాడన్న మాట. ఈ మాటే 'సపర్యగాత్' అనే 'ఈశావాస్యం'. సః= 'ఆత్మ'; పరి+అగాత్=పరివేష్టించాడు. లేక ఆచ్ఛాదించాడు. దేనితో? శరీరరూపంలో, జీవరూపంతో సగుణుడై 'అచ్ఛాదించాడు' అని సత్యానందుడు. కాబట్టి గతి మయమైన 'ఆద్యా శక్తి' మాయాకాదు ప్రకృతీకాదు. ఆ శక్తి

శివసచ్చిదానందమయి.తంత్రసాధనకు లక్ష్యం—పరమయిన 'ఆద్యాశకే ' ఈ ఆదిశక్తి లాభం కలిగితేనే పరసంవిల్లాభం లేక సచ్చిదానంద లాభం కలుగుతుంది. ఎంచేతనంటే 'ఆద్యాశక్తి' కిన్నీ పరసంవిత్తుకున్నూ—సచ్చిదానంద రూపు డైన పరమశివుని కిన్నీ ఏమీ తేడ లేదు.

ఈ పరసంవిద్రూపుడైన పరమశివుడు నిష్క్రియుఁడు. ఎపుడూ సమాధిలో ఉంటాడు. కాని శక్తిలాభం కలిగిలే పరమ శివ పదం పొందవచ్చు. వేరే పురుష సాధనతో పనిలేదు. శక్తి లాభ మంటే శక్తి రూపంగా ఉండిపోవడమే. పరమ పురుషార్థం ఇదే. 'అపరప్రకృతి' ఈ పరశక్తి యొక్కయె బహిర్వికాసం. కాబట్టి మన ప్రకృతిని జీవశక్తిగా మార్చుకోవాలి. మరి బహిర్ముఖమైన ప్రకృతి యొక్క స్పందాన్ని, 'ఉన్మనీ'గా చేయాలి. అనగా సహస్రారంలోకి పంపాలి. అలా చేస్తే విశ్వప్రసువయిన ఆది శకి తో జీవ శకి కి యోగస్థాపనం సంభవం అవుతుంది. ఈ అవస్థలో నిజప్రకృతితో జీవ పురుషుడు స్వతహాగానే ముక్తుడై శివావస్థ పొంది ఆదిశక్తితో అయిన చిరంతన మేళనం వల్ల కృతార్థత చెందుతాడు.

ఉన్మనీ గతి నవలంబించి జీవుడు సాజంగానే 'పరాగతి' చేరతాడు. స్థితిలో ఉన్నా గతిలో ఉన్నా ఆ వస్తువంతా సచ్చిదానందమే. సచ్చిదానంద స్థితిని శివుడనిన్నీ గతిని శక్తి అనిన్నీ అంటారు. స్థితిగతులు రెండూ ఇచట వేరుపడక పాలలో పాలు ఏకమైపోయినట్టు ఏకమైపోయినవి. జీవుడు నిజప్రకృతితో ఈ సమ్మేళ నానందంలో మునిగి ఉంటాడు.

టూకీగా వేదాంత సాధనలో పడయ దగినది—ముక్తి. తంత్రసాధనలో పడయ దగినది భుక్తి, మహాభుక్తి. అది శివశక్తి మేళనం వల్ల స్థితిగతుల మేళనంవల్ల కలుగు తుంది. పురుషసాధనలో—పరమశాంతి. శక్తి సాధనలో లీలానందం.

## అరవిందుల నవ్యతంత్రం

అరవిందుల సాధనలో ప్రకృతిపురు షోభయ సాధనలు కలిసినై. ఈసాధనకు ఫలం కేవలముక్తికాని కేవలభుక్తికానీ కాదు. ఇది ఒక కొత్త లక్ష్యానికి బాటవేసింది.ఇది ప్రకృతినే రూపాంతరంగా మార్చివేయడం. పూర్ణ యోగంలో ముక్తిభుక్తులు స్వతస్సిద్ధాలేకాని అపరప్రకృతిని గూడా పరసంవిత్తుయొక్క దివ్యచేతనచే మొదలంటా మార్చివేసి యీ ప్రపంచంలో 'ఈశ్వరశక్తి' యొక్క ఒకానొక ప్రకృతిని వికసింపజేయడం విశేషం. అంటే 'సమాధిలోఉన్న యీ స్థిర పురుషుడు చిచ్ఛక్తి యోగంతో ప్రకృతిని మార్చి ఇహలోకంలో అవతరించడమే కాక ప్రతిజీవునిలోనూ జాగ రూకంగా అవతరిస్తాడు' అని. మరిన్నీ ఈశ్వరుడు 'ఆద్యాశక్తి' యోగంతో ప్రకృతిని ఊర్ధ్వముఖంగా చేయడమేకాక 'ఆద్యాశక్తి'ని అవతరింపజేస్తాడనడం కూడా ఈ తంత్రంలో ఒక కొత్త అంశం. ఇది అరవిందుల లక్ష్యం.

వేదాంతుల సాధనలో ప్రకృతికి తావు లేదు. తంత్రసాధనలో ప్రకృతికే ప్రాధాన్యం. అనగా మూలాధారంలోని కుండలినీశక్తిని సహస్రారంలోనికి నడిపించి పరశివునితో మేళనం చేయడం లేక మేళనం కావడం. అరవిందుల నవ్యతంత్రంలో లెక పూర్ణయోగంలో—మూలా ధారంలోని కుండలినిని మేలు కొలపడం ఆవశ్యకం కాదు. పైగా అనావశ్యకం. ఎంచేతనంటే ఈ పూర్ణయోగంలోని సాధన తంత్రసాధనలోని మొదటి మెట్టుకంటె పై మెట్టు మీాంచి మొదల

Our synthesis takes man as a spirit in mind much more than a spirit in body

and assumes in him the capacity on that level, to spiritualise his being by the power of the soul in mind opening itself directly to a higher spiritual force and being and to perfect by that higher force so possessed and brought into action the whole of his nature.

The Synthesis of Yoga.

## పురుషోత్తమ తత్వం

ఈ పూర్ణయోగంలో పరమసత్యం పురుషోత్తముడు. ఈ పురుషోత్తముడు వేదాంతుల పురుషునికిన్నీ (చూ. కఠ) పైవాడు. ఈ పురుషోత్తమతత్వంలో స్థితిగతులు సవిశేష నిర్విశేషాలు కలిసి ఉన్నవి. శ్రీ రామకృష్ణ పరమహంస ఒక పెడ బొమ్మా, ఒక పెడ బొరుసూ ఉన్న రూపాయతో పోల్చారు పర తత్వాన్ని—

'యో లోకత్రయ మావిశ్య
బిభ ర్త్యవ్యయ ఈశ్వరః'

గీ—౧౫-౧౭

పురుషోత్తముడు కర్త. 'ఆద్యాశక్తి' కర్త్రి. పురుషోత్తముని ఇచ్ఛాశక్తి రూపమయిన 'ఆద్యాశక్తి' పురుషోత్తమునికంటె వేరు కాదు. ఇచట స్థితిగతులు రెండూ ఒక విశేషోద్దేశ్యాన్ని అవలంబించుకొని అమడలవలె ఉన్నవి. 'ఆ విశే షోద్దేశ్య మేమిటయ్యా?' అని అంటే ప్రకృతిని ప్రకృతినీ సచ్చిదానందంతో సంపూర్ణంగా మార్చి వేయడం. ఇట్లా గనుక చేస్తే ఏమి మార్పు కలుగుతుంది? ప్రకృతి ఆద్యాశక్తియొక్కసాక్షాత్ ప్రకాశంగా మారుతుంది. జీవుడు సచ్చిదానందం యొక్క సాక్షాద్రూపంగా మారుతాడు.

తంత్రంలో పురుషుడు ఎప్పుడూ సమా ధిలో ఉంటాడు, శవంలాగా. అరవిందుని పూర్ణయోగంలో పురుషోత్తముడు అప్పసమూ జాగరూకుడు. ఆయనయొక్కయే ఇచ్ఛ శక్తి లోపల నుండి వికసిస్తుంది. 'ఆద్యాశక్తి' శవంవంటి శివుని మీద ఎక్కికూచోదు,-శవాసన కాదు. సర్వదా జాగరూకుడైన శివునితో కలిసియున్న అర్ధనారీశ్వరి, రాజరాజేశ్వరి, రి.

శ్రీ అరవిందుల సాధనలో ప్రకృతిలో ఉన్న జీవుడు పరమపురుషాభిముఖ్యంగా ఆత్మ సమర్పణ చేసికొని ఆ పరమపురుషునియే 'పరా శక్తి' సన్నిధిలో తన ఉనికి నెల్లనిప్పి అప్పజెప్పు కుంటాడు. ఈ సాధనలో జీవప్రకృతి 'పరమా ప్రకృతి' ద్వారా రూపాంతరం పొందుతుంది. పరమపురుషుడే ఈ యోగానికి నియంత, సారథి. అతని యిచ్ఛను సాధించే అతనియొక్కయే శక్తి 'పరా ప్రకృతి.'

ప్రకృతి సంపూర్ణంగా మారిపోయి నప్పుడు సచ్చిదానందం ఏ సమాధిలోనో కాదు, ఏ శివలోకంలోనో కాదు, ఏ కైవల్యంలోనో కాదు, మరి ఇహలోకంలోనే నిండారా అవత రిస్తుంది. అప్పుడు సాధకుని శరీరంలో ప్రకృతి సహజములని అనుకొనబడే చావు పుట్టు మొద లయిన ధర్మాలుండవు. ప్రకృతసాధకుడు చిద్ఘన విగ్రహుడవుతాడు. ఇట్లా మారు రూపు పొందిన జీవునిలో పరిపూర్ణమయిన భగవాసుని నరలీల ఒకా నొక 'ఐశీ శక్తి' యోగంతో సార్థకం అవుతుంది.

ప్రకృతినీప్రకృతినీ మార్పు పొందించడ మనే కొత్త లక్ష్యంద్వారా అరవిందు డొకానొక దివ్యతంత్రానికి స్రష్ట ఐనాడు. (కుంభకోణం యోగి అని చెప్పబడే కంచుమర్తి వెంకాసామి రావుగారు (C. V. V.) ఈ మార్పు పొలిమేరనూ మేరనూ పొనపొన చూచారేమో అని అనిపి స్తుంది,—కొన్ని కొన్ని భేదాలతో) అరవిందుల సాధన తంత్రసాధన యొక్కయే ముందడుగు.

ఇది జరగక తప్పని పరిణామం. ఇది ఇట్లా జరగకపోతే ప్రకృతిసాధనా శక్తిసాధనా సశేషంగా ఉండిపోతై. 'పరాప్రకృతి' పరమస్పందం కేవల సచ్చిదానంద స్వరూప లీలలలో మగ్నమై ఉండడానికేకాక 'అపరా ప్రకృతి'లో అవతరించడానికి ఎన్నడో ఎన్నడో ఏర్పాటై వుంది. ఈ విశ్వాన్నంతా సృష్టించిన 'ఆద్యాశక్తి' అఘటన ఘటనా పటీయసి అయితే ఆ సృష్టిని ఎల్లకాలమూ చావుపుట్టుల రాటంలో పెట్టి తిప్పితిప్పి నలిపి నలిపి మిథ్యాపూర్ణంగా ఉంచుతుందని అనడమున్నా సృష్టి కిదే ఉద్దేశ్యమని అనడమున్నా పాడికాదు. పైగా అపచారం. తంత్రమతంలో సచ్చిదానందం యొక్క శక్తి అఘటన ఘటనా పటీయసి అయితే జగత్తు నంతా పూరాగా మార్పు పొందించే నేర్పుగూడా ఆ శక్తి కెందుకుండదు? పురుషోత్తమునికి కూడా అదే అభిప్రాయమని శ్రీ అరవిందు లంటారు. అరవిందుల యోగంలో 'ఆద్యాశక్తి' చేయబోయే ఈ కొత్త సృష్టే తంత్రాని కొక కొత్త జన్మకూడా ప్రదానం చేసింది.



# పశ్చిమ ఆఫ్రికాలో

# ఏకపక్ష రాజ్యాంగ సంక్షోభం

శ్రీ డబ్ల్యు. ఆర్థర్ లూవిస్

[గతసంచిక తరువాయి]

పశ్చిమదేశాల పార్లమెంటుల్లో ఆయూత ప్రయాతపు పద్ధతి ఎంతటి ప్రశస్తి వహించివున్నదో ఇప్పుడు చెప్పనవసరములేదు. కాని యీ పద్ధతి పశ్చిమఆఫ్రికా దేశాలలో పని చేయదు. ఆ పార్లమెంటుల పద్ధతి ఈ దేశాలకు అనువర్తించదు. ఈ దేశాలలో అది పని చేయనప్పుడు, పనిచేయడం ప్రమాదభూయిష్టం అయినప్పుడు మార్గాంతరం ఏమిటి? ఏకపక్ష రాజ్యాంగమా? లేక మిశ్రమ ప్రభుత్వ నిర్మాణమా? ఏకపక్ష రాజ్యాంగ పద్ధతివల్ల ఈ దేశాలకు నష్టమే నిగా, లాభంలేదు. కాబట్టి ఇక ఈ రాజ్యాలు అనుస రించడానికి తగిన మార్గం ఒక్క మిశ్రమ ప్రభుత్వ నిర్మాణ పద్ధతే అవుతున్నది.

ఇప్పుడు ప్రొపోర్షనల్ ప్రాతినిధ్యపు పద్ధతి అంటూ వున్నదంటే దానిలో వున్న లాభం ఇదే. ఆ పద్ధతి మిశ్రమ ప్రభుత్వాల ఏర్పాటునకు దోహదకారి, ప్రోద్బలకారి కాగలదు. ఇది విధిగా ఇట్లా జరుగు తుందని కాదు. అందుకు మంచి ఆవకాశం వుంది.

అయితే రాజకీయ శాస్త్రవేత్తలకు ఈ ప్రొపోర్షనల్ ప్రాతినిధ్యం అనగానే ఒక భయం. అది నమంటే, ఇందువలన చిల్లర రాజకీయ పక్షాలు అనేకం తలఎత్తి, వివిధ పక్షాల మధ్యను సహకారానికి, మిశ్రమ ప్రభుత్వాల ఏర్పాటునకు ప్రతిబంధకాలు కాగలవని వీరు అంటూ వుంటారు. అందుచేత ఈ పార్టీల సంఖ్య సాధ్యమైనంతవరకు తగ్గి వుండటానికి కొన్ని ప్రక్రియలను గూడా చెబుతూ వుంటారు. ఏ పార్టీకి ఈపద్ధతిలో మొత్తం ఓటులో రెండు శాతం ఓట్లు మాత్రమే పడి నెగ్గిందో, ఆ పార్టీకి అసలు సీట్లనే కేటాయించరాదన్నట్టు మొదలైన పద్ధతులు ఈ ప్రక్రియలలో వుంటూవుంటాయి. అసలు విషయం ఏమంటే, పార్టీలు చిన్నవైనంత మాత్రంచేత అవి సహకరించవని అనలేము. అవి తిరస్కరిస్తే ఆ దేశానికి పట్టిన జాడ్యం ఘోరమైనదని అర్థం. ఎలక్టోరల్ పద్ధతులలో లోపాలు వుండవనికాదు. అవి పూర్తిగా సవ్యంగా వుంటాయనీ కాదు. వానిలో వున్న లోటు పాట్లు వానిలో వున్నాయి. అయితే ఎచ్చట చిన్నపార్టీలు కలిసిరావడానికి తిరస్కరిస్తాయో, అచ్చట రాజకీయ వ్యవస్థకు పట్టిన జాడ్యం ఈ లోటుపాట్ల కన్నా కూడా తీవ్రతరమైంది. అసగా అక్కడ 'జాతి' అన్నది ఇంకా రూపుచెందలేదని అర్థం. అచ్చట జాతి అన్న దానికి స్థితి అన్నదే లేదని కూడా చెప్పవచ్చు. ఆ దేశంలో అంతా ముఠాలు ముఠాలుగా వుండి, ఒకరితో ఒకరు సహకారం నెరపుకుంటూ పనీ చేయగల స్థితి అక్కడ ఏర్పడలేదని కూడా అర్థం చెప్పుకోవచ్చు. అటువంటి చోట ప్రజాస్వామ్యం సాధ్యంకాదు. అప్పుడు ఆ దేశానికి నియంత అవసరం అవుతాడు. రాజకీయ పక్షాలు గనుక ఈ విధంగా దీర్ఘకాలం తమలో తాము సంఘర్షణలకు పూనుకొని, వానిని వదిలించుకోలేని పక్షంలో సైన్యం తాలూకు సేనాపులు ఎవరో బయటపడి అధికారాన్ని కాస్తా తమ హస్తగతం చేసు కుంటారు.

ఇది పెద్ద భయం. ఇచ్చట ఇంకో అల్పపు భయం కూడా వున్నది. కొన్నికొన్ని పార్టీలు మిశ్రమ ప్రభుత్వాల ఏర్పాటుకు కలిసివస్తాయి. కాని అవి నిలకడగా వుండవు. నిత్యము బుద్ధి మారుతూ వుంటాయి. అయితే

## ఏకపక్ష రాజ్యాంగ సంక్షోభం

దీనిని గార్తిగా చెడ్డవిషయం అనలేము. అమెరికా వున్నది. అచ్చట కాంగ్రెస్‌లో పూర్తిగా ఇటువంటి నిలకడలేని సంఘటనలతోనే పనిచేస్తూ వుంటుంది. ఈ పద్ధతి మీద ఆధారంతోనే అచ్చట పనులు జరుగుతూ వుంటాయి. 'ఏ' అనే సభ్యుడు వున్నాడు. ఒక బిల్లు "ప్యాసు" కావడం కోసం అతను "బి" "సి" అన్న సభ్యులతో చేతులు కలుపుతాడు. ఇంకో బిల్లు 'ప్యాసు' కావడం అతనికి ఇష్టం వుండదు. అప్పుడు "డి" "ఇ"లతో చేతులు కలుపుతాడు. "బి", "సి", "డి"లు కలిసి ఒక బిల్లును ఆమో దింప చేయడానికి ప్రయత్నిస్తున్నారు. అది "ఏ"కి ఇష్టంలేదు. అప్పుడు "ఏ" "ఇ"తో కలిసి, ఆ బిల్లు 'ప్యాసు' కాకుండా చూద్దామని యత్నిస్తాడు. ఈ పద్ధతిలో ఒక ఉపయోగం వుంది. వ్యక్తిగతమైన ద్వేష కావేషాలకు ఇచ్చట చోటులేదు. పార్లమెంటేరియన్ లలో మంచి వాతావరణం ఏర్పడ్డానికి కూడా ఈపద్ధతి తోడ్పడుతుంది. ఇందుకు కారణం ఇది. ఇవ్వాళ్ల నువ్వు ఒకరితో కలిసి పనిచేస్తావు. రేపు ఎవరితో కలుస్తావో తెలియదు. వర్గసమాజాలలోని రాజకీయ తాత్వికులకు ఈ పద్ధతి నచ్చదు. అందుకు కారణాలు వున్నాయి. ఇచ్చట వర్గ పోరాటం లేకుండా చేయబడుతున్నది. దానిస్థానే మంతనాలు, రాజీ వచ్చి పని చేస్తున్నాయి. ఇది ఒక కారణం. రెండో కారణం ఇది. ఈ పద్ధతిలో ప్రభుత్వం కన్నా, పార్లమెంటు బలమైనదిగా రూపొందు తున్నది. బలం కలది అవుతున్నది. నిర్ణయాలు చేసే అధికారం ప్రభుత్వం చేతుల్లోంచి జారిపోయి పార్లమెంటు హస్తగతం అవుతున్నది. ఇందుమూలంగా ప్రభుత్వం బలహీనమైనది అవుతున్నది. వర్గసమాజ వేదాంతులకు ఇది ఇట్లా కావడం ఇష్టంకాదు. వారికి ప్రభుత్వం బలంగా వుండాలి. వర్గ సమాజాలు బలం గల ప్రభుత్వాలను వాంఛిస్తాయి. అయితే బహ్వంగ సమాజ సిద్ధాంతులు వున్నారంటే, వారికి యుద్ధానికి బదులు మంతనాలు, రాజీ పద్ధతి నచ్చినట్లుగా ఇంకొక పద్ధతి నచ్చదు. చరిత్రకారులు కూడా కొంత పాపం చేశారు. చరిత్రలో నెపోలియన్ వంటి, చర్చిల్ వంటి ప్రచండులు అంటే మర్యాద మెచ్చుకోలు కుదిరేట్లు చేశారు. కాని బహ్వంగ సమాజాలలో ఇటువంటి ప్రచండ వ్యక్తులు ఏమీ చేయలేరు. ఈ సమాజాలలో పరిస్థితులు అగ్నిలాగా ఎప్పటికి అప్పుడు మండిపోతూ వుంటాయి. ఆడంబరంతో సంబంధంలేని, ప్రచండ లక్షణ లక్షణాన్వితులుగాని ప్రధానమంత్రులు ప్రయో జనకారులైనట్లు ఇచ్చట తదితరులు కాలేరు. ఇచ్చట పరిస్థితులను ఎప్పటికి అప్పుడు గాడి తప్పిపోకుండా చూచుకుంటూ వుండాలి.సమాజానికి సుస్థిరతను చేకూ ర్చాలి. అందువల్ల ఇచ్చట ప్రచండుల వలన లాభం లేదు. వారు ఏమి చేసినా, ఏదో మిగిలిపోతూనే వుంటుంది. ఇచ్చట ఓర్పు అవసరం. క్షమముఖ్యం. సహనం లేకుండా ఏపనీ జరగదు.ఇటువంటి లక్షణాలు పుష్కలంగా గల వ్యక్తులే బహ్వంగ సమాజాలలో పరిస్థితులను ఒక గాడిలో పడవేయగల్గి, సమాజంలో సుస్థిరతను సాధించగల్గుతారు. పశ్చిమఆఫ్రికాలో సియోరాలియోన్ సంగతి చూస్తే ఇది విదితం అవు తుంది. జరిగిన పది సంవత్సరాలలో అచ్చట ఈ ఓర్పు, ఈ క్షమ, యీ సహనములు గల నాయకులు పని చేసి,ఆదేశాన్ని సంఘటిత పరచగల్గారు. వెస్ట్ ఇండీస్‌ను తీసుకు చూస్తే, ఇటువంటి నాయకత్వం లేనందు వల్ల, అచ్చటి నాయకులు ప్రచండ లక్షణం కలవారు కావడం వలన ఎటువంటి విలయం జరిగిపోయింది తెలుస్తుంది. ఏదో సుస్థిరమైన ఫెడరేషన్ అచ్చట ఏర్పడవచ్చు ననుకుంటే, ఆ నాయకులమధ్య సంఘర్షణ మూలంగా ఆ ఆశకాస్తా అడుగంటిపోయింది.

ఇంతకీ ప్రొపోర్షనల్ ప్రాతినిధ్యం పద్ధతిని అనుసరించడం వలన పశ్చిమఆఫ్రికాలో చిలువ చిలువ రాజకీయపక్షాలు తలఎత్తడం జరుగుతుందని నిర్ధారణగా చెప్పలేము. అందుకు కారణం కన్పించదు. 1950 అనంతరం నడచిన చరిత్రను బట్టి చూస్తే, అచ్చట ఇట్లా చిలువ చిలువ పక్షాలు అధికంగా ఏర్పడగలవన డానికి తగినంత సాక్ష్యం లభించడంలేదు. కనుక యీ దేశాలలో ఏ రకమైన ఎలక్టోరల్ పద్ధతిని అనుస రించినా, రెండు, మూడు లేక నాలుగు ప్రబలమైన రాజకీయ పక్షాలు ఏర్పడగలవన్న అభిప్రాయానికి రావడానికి తగు కారణం కన్పిస్తున్నది.

ఇచ్చట చేస్తున్న యీ వాదంయొక్క మూల లక్షణం ఇది. ఏవో కొన్నిపార్టీలు కలిసి మిశ్రమ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడం కాదు ఇచ్చట జరగ వలసింది. అన్ని పెద్దపార్టీలు కలిసి యీ మిశ్రమ ప్రభుత్వాలను ఏర్పాటు చెయ్యాలి. ఇది తప్పక జరగ వలసిన పని. ఇందులో చిన్నపార్టీలు కలిసి రాకపోతే సేగి ఏమీలేదు.అల్పవు పక్షాలు ప్రతిపక్షంలోవుండటం

మంచిది కూడాను. అట్లా జరిగితే, ప్రభుత్వం యొక్క అసామర్థ్యాన్ని గురించి, విధానాలను గురించి, ప్రభుత్వంలో అవినీతి పెరిగితే దానిని గురించి,ఆ ప్రభుత్వంలో వున్న పార్టీల వలన తదితరమైన పార్టీల వలన విమర్శ అన్నది జరుగుతుంది. ఈ విమర్శ కూడా ఒక పద్ధతిలో వుంటుంది. సువ్యవస్థితమైన పద్ధతిలో సాగుతుంది. ఇది జరగడం అవసరము; ముఖ్యమూను. ప్రతిపక్షాలను గనుక మర్యాదగా చూస్తే, అప్పుడు కొన్ని చిన్నపక్షాలు ప్రభుత్వంలో చేరడం కన్నా, బయట వుండటంలోనే తాము ప్రయోజనకరంగా పని చేయగల వీలు వున్నదన్న అభిప్రాయానికి వచ్చినా రాగల అవకాశం వుంది. విధ్వంసనము, విద్రోహము, పరువునష్టము మొదలైన వానిని గురించి సరియైన శాసనములు అంటూ వున్నప్పుడు, ఆ దేశాలలో ఈ రకం అల్పపు రాజకీయ పక్షాలు తోకను కూడా ఝాడించలేవు. అది అసాధ్యమైన విషయం అవుతుంది.

ఏకైక రాజకీయ పక్ష పద్ధతికిన్నీ, స్వతంత్రమైన మిశ్రమ ప్రభుత్వ నిర్మాణ పద్ధతికిన్నీ వున్న తేడా అంతా ఇక్కడే వుంది. ఏకైక రాజకీయ పక్ష పరిపాలనంలో, ఆ పాలకులను ప్రతిఘటిస్తున్న వారిని, విధానాలను విమర్శిస్తున్న వారిని జైళ్లకు పంపుతారు. స్వేచ్ఛాసత్తాకమైన మిశ్రమ ప్రభుత్వాలు ఏలుబడి సాగిస్తూ వున్న చోటులలో ఆ ప్రభుత్వం రాజ్యాంగ ధర్మాన్ని పాలిస్తూ వుంటుంది. విమర్శలకు స్వేచ్ఛ వుంటుంది. పార్టీగాని, వ్యక్తులుగాని ప్రభుత్వాన్ని, ప్రభుత్వ విధానాలను తమ ఇచ్చకువచ్చిన విధంగా విమర్శించవచ్చు. ప్రతిఘటించవచ్చు.

ఇందుకు నైజీరియాలో ఒకప్పుడు జరిగిన ఉదంతమే ఉదాహరణం. నైజీరియాలో అల్పసంఖ్యాక వర్గాలు అధికంగా వున్నప్పటికిన్నీ, వీటిని మించి మూడు పెద్ద వర్గాలుగా జనం వున్నారు. ఈ జనం సగం మంది ఉత్తర నైజీరియాలో నివశిస్తున్నారు. వీరికి మంచి పలుకుబడి గల, శక్తివంతులైన ముస్లిం అమీర్‌లు నాయకులు. వీరు వస్తుతః మితవాదులు. ఏకాకారమైన, ఐక సిద్ధాంతికమైన ఒకపార్టీని వీరు కట్టుకున్నారు. దీనికి ఇంగ్లీషులు ఎన్. పి. సి. అని పేరు. పూర్తిపేరు నార్తరన్ పీపుల్సు కాంగ్రెస్ అని. ఆర్థికంగా యీ ప్రాంతం చెప్పుకోతగినట్టిది కాదు. నిస్సారమైనట్టిది. వర్షపాతం తక్కువ. దేశం యొక్కదక్షిణప్రాంతంలో 'ఐబో'లు ''యొరూబా''లు నివశిస్తున్నారు. అచ్చట తూర్పుభాగం ''ఐబో''ల నివాస భూమి. పశ్చిమప్రాంతం ''యొరూబా''లకు ఆవాస స్థలం. నైజీరియాకు స్వాతంత్ర్యం వచ్చిన రోజుల్లో తూర్పుప్రాంతం కూడా అంకించనంగానే వుండేది. ఆతర్వాత అచ్చట నూనెగనులు పడ్డాయి. ఇందువల్ల ప్రభుత్వం ఆదాయం ఆప్రాంతం వలన పెరుగగల పరిస్థితి ఏర్పడింది. ''ఐబో''లు నేషనల్ కౌన్సిల్ ఆఫ్ నైజీరియన్ సిటిజన్స్ అన్నపార్టీ వెనక వుండేవారు. పశ్చిమంలో వున్న ''యొరూబా''లు కొంత ధనవంతులు. ఆ ప్రాంతం సారవంతమైంది. వారు తమ బలాన్ని ''ఏక్షన్ గ్రూపు'', నేషనల్ కౌన్సిల్ ఆఫ్ నైజీరియన్ సిటిజన్స్ మధ్య పంచుకు కూర్చున్నారు. విధానాల దృష్ట్యా చూస్తే దక్షిణ ప్రాంతపు రెండు పక్షాలకు అట్టే తేడా యేమీ కన్పించదు. వారు రాజకీయాలలో మాధ్యమికులు. ఉత్తర ప్రాంతంవారు మితవాదులు.

నైజీరియాకు స్వాతంత్ర్య ప్రధానం జరుగబోతూ వున్న రోజుల్లో నేషనల్ కౌన్సిల్ ఆఫ్ నైజీరియన్ సిటిజెన్సు పక్షం నాయకులుగా డా. అజికివే వుండేవారు. అప్పుడు గనుక దక్షిణప్రాంతాలు ఉత్తరప్రాంతపు పక్షాలకు విరుద్ధంగా సంఘటితం అయినట్లయితే నైజీరియా ఫెడరేషన్‌కు ప్రమాదం తప్పదని ఆయన గ్రహించారు. అదే సంఘటిత పడితే ఉత్తరదక్షిణాల మధ్య సంఘర్షణ తప్పదు. అందువల్ల ఆయన ఒకపని చేశారు. ఉత్తరాది రాజకీయ పక్షంతో చేతులు కలిపారు. ఆ పక్షానికి నాయకుడు సర్ అబుబకర్ టఫావా బలావా. ఆయనయే స్వతంత్ర నైజీరియాకు ప్రధానమంత్రి అయినారు. దేశంలో మూడు పెద్దపక్షాలు వున్నాయి. ఈ మూడు పక్షాలు కలిసి మిశ్రమ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తేనేగాని లాభంలేదని సర్ అబుబకర్ అభిప్రాయపడ్డారు. అందుకు ''ఏక్షన్ గ్రూపు'' నాయకుడు శ్రీ ఆవోలోవో అంగీకరించలేదు. ప్రతిపక్షంలో కూర్చుంటామన్నారు. ఇక్కడ ఒక చిన్నకథ నడిచింది. ''ఏక్షన్ గ్రూపు'' నాయకులలో డా. అకిన్‌టోలా కూడా ఒకరు. ఆయన శ్రీ అకిన్‌టోలాతో ఏకీభవించలేదు. దీనితో ''ఏక్షన్ గ్రూపు''లో చీలికలు వచ్చాయి. అది రెండుగా విభక్తం అయిపోయింది. ఇందుకు

ఈ తగాదా ఒక్కటే కారణం కాదు. ఇంకా వున్నాయి. కాని ఇది ప్రధానమైంది. ఇప్పుడు శ్రీ అకిన్‌టోలా తమముతాలతో ఉత్తరాది పక్షాలతో చేతులు కలిపారు. ఇందుమూలంగా అఖిలపక్ష మిశ్రమ ప్రభుత్వం నైజీరియాలో ఏర్పడినట్లయ్యేదే; కాని అప్పుడే యుగపత్తుగా తూర్పుప్రాంతం ఉత్తరప్రాంతాల మధ్య తగాదా వచ్చింది. డా. అజికివేకు అంతవరకు కుడిభుజంగా వుంటూ వచ్చిన డా. ఓక్పారాకు ఉత్తరాది పక్షాలంటే అసంతృప్తి ఆరంభం అయింది. ముఖ్యంగా ఈ మిశ్రమ ప్రభుత్వంలోని సహచరుల పట్లనే ఆయనకు సరిపోనితనం ఏర్పడింది. ఇందుకు అమీర్లు కారణం అంటారు. ఆ అమీర్లు ఆయన్ను తమ ప్రాంతంలో పని చేయనీయలేదు. ప్రతిబంధకాలు కల్పించారు. ఓక్పారా ఇప్పుడు నేషనల్ కౌన్సిల్ ఆఫ్ నైజీరియన్ సిటిజన్స్, నైజీరియన్ పీపుల్సు పార్టీ సంఘటనతో తెగతెంపులు చేసుకొని పశ్చిమప్రాంతపు "ఏక్షన్ గ్రూపు"తో చేతులు కలపడానికి నిశ్చయించుకున్నారు.

ఉత్తర, దక్షిణ ప్రాంతాలమధ్య తగూ ఆంటూ సంభవిస్తే ఏమి జరుగుతుందని 1959 లో డా. అజికివే భయపడ్డారో, అది 1964 డిశంబరు ఎన్నికలలో దాదాపు జరగనే జరిగింది. ఆ ఫలితాలు నైజీరియా ఫెడరేషన్‌కు విపత్కర కారణంగా పరిణమించాయి. ఫెడరేషను దాదాపుగా నాశనం అయినంత పని అయింది. ఈ మూడు పెద్దపక్షాలు కలిసి గనుక మిశ్రమ ప్రభుత్వం ఏర్పాటుకోసం పని చేయని పక్షంలో యీ ప్రమాదం నైజీరియాకు ఎప్పుడైనా వున్నదే. వీరికి బ్రిటిషువారి వలన సంక్రమించిన వర్గసమాజపు రాజకీయ భావప్రపంచం మూలంగా ఒక విధమైన విచారధార అచ్చట ప్రాబల్యంలోనికి వచ్చింది. నాది గెలుపు, నీది ఓటమి—అన్న విచారధార అది. బహ్వంగ సమాజాలలో ఇటువంటి విచారధార పనికిరాదు. అచ్చట ఇటువంటి భావ ప్రపంచాన్ని నిషేధించవలసి వుంటుంది.

ఇచ్చట వాదం ఇది. మిశ్రమ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తే పెద్ద పార్టీలు ఏర్పాటు చెయ్యాలి. ఒక్కరాజ్యాంగ సూత్రాల వల్ల మాత్రమే ఇది జరగదు. ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడంకోసం రాజ్యాంగ సూత్రాలను మార్చవచ్చు. ఎక్కువ బలంతో ఎన్నికలలో నెగ్గిన పార్టీ నాయకుణ్ణి దేశాధ్యక్షుడు ఆహ్వానించి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవలసిందిగా కోరాలని రాజ్యాంగంలో వుంటుంది. దానిని మార్చవచ్చు. ఎన్నికలలో 20 శాతం కన్నా ఎక్కువగా ఓట్లు పడిన పార్టీ నాయకులను పిలిచి, వారి మధ్యగాని లేక మిశ్రమ ప్రభుత్వం ఏర్పాటులో సహకరించి పని చేయదలచుకున్న పార్టీల మధ్యగాని మంత్రివర్గంలోని స్థానాలను దేశాధ్యక్షుడు పంచగల విధంగా కూడా రాజ్యాంగంలో పేర్కొనవచ్చు. అందు అనుకూలంగా రాజ్యాంగాలను సరిదిద్దవచ్చు. ధర్మాను శాసనం నైతికమైన ప్రాబల్యం లేకుండా వుండదు. ప్రజలకు, ప్రజానాయకులకు కూడా అది నడకకు ప్రమాణాలు నిర్ణయిస్తుంది. సంకట పరిస్థితులంటూ ఏర్పడినప్పుడు సైన్యం కల్పించుకొని అంకెకురాని రాజకీయవేత్తల చేత దానిని పాటించేట్లు చెయ్యవచ్చును. అందువలన ఇప్పుడువున్న ప్రభుత్వపక్ష ప్రతిపక్షాల పద్ధతి ఏర్పాటును తొలగించి దానిస్థానే మిశ్రమ పద్ధతి ప్రభుత్వం ఏర్పాటు చేసితీరాలన్న విధిని రాజ్యాంగ ధర్మంలోనే విధించవచ్చు. ఇట్లా చేయడం కూడా ఎంతగానో ముందు అడుగు వేసినట్లు అవుతుంది.

ఇచ్చట ఒక్కవిషయాన్ని గుర్తించక తప్పదు. వ్యవస్థా సంబంధమైన ఎన్ని నూతన ప్రక్రియలను తెచ్చిపెట్టి, యీ దేశాలలో పెద్ద పార్టీ మధ్య పోరాటానికి బదులు సహకారాన్ని పెంపొందిద్దామనుకున్నా అవి ఆపళాన హఠాత్తుగా పనిచేయడం ప్రారంభించవు. ప్రజాస్వామ్యంలో అవతలి వారిని పథక్కరణం చేయడమే ప్రధానంగాని సహకారం చేయడం కాదన్న అర్థం వారిలో వున్నంతకాలం పృథక్కరణమే చేస్తారుగాని సహకారం కోసం ముందుకురారు. ఈ విషయాన్ని గూర్చి అమెరికన్ రాజకీయ తాత్వికుడు శ్రీ థియోడోరిక్కర్ The theory of Political coalition అన్న తమ గ్రంథంలో ఈ విషయాన్ని గురించి కొంత వ్రాశారు. రాజకీయాలను గనుక—సున్నా—అంకే ఆటగా పరిగణించినట్లయితే, ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసే రాజకీయపక్షం నాయకులు తక్కువ సంఖ్యగల పార్టీలతో మిశ్రమ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తాడేగాని, ఎక్కువ పార్టీలను కలుపుకొని వ్యవహరించడు. తక్కువ పార్టీలతో అయితే వేగడం తేలిక. ఎక్కువ పార్టీలను తెచ్చిపెట్టుకున్న

కొద్దో వారికి ఎక్కువ "రాహితీ"లు ఇవ్వాలి. అప్పుడు తాను తలపెట్టిన కార్యక్రమం ఎందుకూ పనికిరా నిదిగా తయారైపోయే ప్రమాదం ఏర్పడుతుంది. అధికారాన్ని వశం చేసుకొని, ఒకవర్గం ప్రజలను కాదని ఒకవర్గం ప్రజలకే లాభం చెయ్యాలన్న దృష్టితో రాజకీయవేత్తలు వ్యవహరించినప్పుడు దేశంలో పెద్ద పార్టీలు అన్నింటిని కలుపుకొని మిశ్రమ ప్రభుత్వం ఏర్పాటు చెయ్యడం అన్నది ఎప్పుడూ పడదు. బహ్వంగ సమాజాలలో అధికారధూర్వహులైన వారి రాజకీయ మౌలిక సిద్ధాంతాలలోనే పెద్దమార్పు ఇచ్చట అందువల్ల అవసరమని చెప్పబడుతున్నది.

మనుష్యులకు వున్న అభిప్రాయాలను మారుద్దామన్న అభిప్రాయం కలవాడు వట్టి "అభిప్రాయ వాది". ఒకవిధంగా ఆదర్శవాది కూడాను. అతనిని చారిత్రక నియతివాదులు, మనుష్యుడనేవాడు స్వతంత్రుడు కాదు, పరిస్థితులు—పరిసరముల ప్రభావము వలన మనిషి అయినవాడేనని నమ్మకమును పెట్టుకొన దలచుకొన్నవారు—ఈ ఆదర్శవాదిని వాస్తవ విషయములతో ఎరుకవున్న వానినిగా భావించరు. కాని రాజకీయాలలో సంప్రదాయములు, కట్టుబాట్లు—సంస్థలు ఎంత ముఖ్యమో అంతటి ముఖ్యమూ అయినవి. సంప్రదాయములు కట్టుబాట్లు సత్ప్రవర్తనకు నియమములు, నిబంధనల వంటివి. ఈ సత్ప్రవర్తన ఒక పరిస్థితి వలనగాని, పరిసరము వలనగాని, లేక ఆసక్తి మాత్రము చేతగాని కల్గడంలేదు. మరి ఎందుచేత కల్గుతున్నది? మానవుడు నైసర్గికముగా నైతిక జీవి అవడంచేత కల్గుతున్నది. కొన్ని కొన్ని పరిస్థితులు ఏర్పడినప్పుడు,ఆ పరిస్థితులగురించిఒకానొక సంఘము, లేక సమాజము ఎట్లా వ్యవహారము చేస్తుందో, లేక ఏమి అనుకొని ఏమి చేస్తుందో.రాజకీయ సిద్ధాంతులైనవారు—ఇది ఇట్లా జరుగుతుంది—అని చెప్పగల దక్షులు కారు. కారణము ఇది. ఒక సమాజము యొక్క నడవడికను నియమించడము అన్నది నైతిక ప్రమాణములకే సాధ్యముగాని తదితరమునకు కాదు. ఆ ప్రమాణములు ఎట్టివి? ఆ సమాజము గౌరవించ వలయునని పెట్టుకొన్నటువంటివి. అందుకుగాను తమ్ము తాము శిక్షించుకొన్నట్టివి.

ఈ కారణముచేత ఒకానొక మిశ్రమ ప్రభుత్వము ఏర్పడి అది నిలకడగా వుండటము అన్నది రాజకీయవేత్త మీద ఆధారపడి వున్నదని చెప్పడము వలనుకాదు. అది ప్రజల మీద ఆధారపడి వున్నది. మాకు ఇది కావాలి అని ప్రజలు చేసుకునే నిర్ణయం మీద ఆధారపడి వున్నది. రాజకీయవేత్తలకు స్వార్థము తప్ప ఇంకొక్క గుణము వుండదు. ఎప్పుడున్నూ స్వంత లాభము కోసమే యీ రాజకీయవేత్తలు అంగలారుస్తూ వుంటారు. అందువలన ఇచ్చట ఒక్క పని చేయవలసి వుంటుంది. సాధించవలసి వుంటుంది. రాజకీయవేత్త వున్నాడు. రాజకీయంగా పైకిరావాలని అతనికి వుంటుంది. అభ్యుదయమును చెందాలని వుంటుంది. ఇతరులైన రాజకీయవేత్తలలో ఆ రాజకీయవేత్త సహకరించి పని చేసినప్పుడే ఆ దయమునకు, లేక ఆస్థి కిరావడమునకు మార్గము కావలయునన్న భావమును ప్రజలలో సృష్టించగల్గిన నాడు పరిస్థితి ఒకవిధంగా ఏర్పడుతుంది.దీనిని సాధించడము కష్టముతో కూడిన పని. అసాధ్యము మాత్రము కాదు. ఇట్టి భావము ప్రజలలో ఏర్పడ్డానికి ముందు వారి మనస్సులయందు నుండి ప్రజాస్వామ్యాన్ని గురించి ఇప్పుడు వున్న ఆయాత ప్రయాతపు సద్దారి అర్థం పూర్తిగా రహితం అయిపోయేట్లు చేయవలసి వుంటుంది. అందువల్ల ఇది కష్టము. మరి అసాధ్యము కాదన్నాము కదా! ఎందుచేత? బహ్వంగ సమాజాలలో మిశ్రమ ప్రభుత్వాలు తప్ప మరి ఇంకో ప్రతి ప్రభుత్వం సరిగ్గా పని చేయులేదు గనుక. మిశ్రమ ప్రభుత్వాలే బహ్వంగ సమాజాలలో వాంఛనీయములు, అవశ్యకములు గనుక. కాలము, అనుభవము రెండూ కలిసి వస్తే పశ్చిమ ఆఫ్రికాలో ముందుతరం వారికి యీ మిశ్రమ ప్రభుత్వంయొక్క లక్షణాలు, మంచి లక్షణాలు అవగతం కాక మానవు. ఇప్పుడు ఇంగ్లీషు వారికి ఆయాత ప్రయాతపు పద్ధతి అవగతమౌతున్నట్లు. [illegible] రాజకీయము అనే క్రీడ యొక్క నియమ నిబంధనలను కూడా వారు వేరుగా వ్రాసుకుంటారు. ఎట్లా వ్రాసుకుంటారనగా మిశ్రమప్రభుత్వ నిర్మాణభావప్రపంచ సమున్మిషితులైన రాజకీయవేత్తలకు మాత్రమే అభ్యుదయము, పైకి రావడము సాధ్యమై రాగలదన్న పద్ధతిలో ఆ సూత్రాలను నిబంధిస్తారు.

ఇప్పుడు పశ్చిమఆఫ్రికా రాజ్యాలలో ఏకపక్ష రాజ్యాంగ పద్ధతి చెల్లుబాటు అవుతున్నది. ఇప్పుడు ఈ రాజ్యాలలో రాజకీయపు భవిష్యత్తు ఏవిధంగా

వుంటుంది అన్న విషయాన్ని గురించి—ఇది ఇట్లా వుంటుంది అని చెప్పడం—ఈ ఏకపక్ష రాజ్యాంగ ధర్మాన్ని గురించి ఎవరు ఎట్లా ఆలోచన చేస్తున్నారు, ఎట్లా అర్థం చేసుకుంటున్నారు—అన్న దానిమీద ఆధారపడి వుంది. ఈ అర్థం చేసుకొనడం లేక పశ్చిమ ఆఫ్రికా రాజ్యాలలో ఏకపక్ష రాజ్యాంగ ధర్మం ఏర్పడ్డాన్ని గురించి వివరించడం—మూడు విధాలుగా సాగుతున్నది.

వీనిలో మొదటి వివరణము ఇట్లా వున్నది. ఈ పశ్చిమఆఫ్రికా రాజ్యాల అవసరాలు అట్టివి. అచ్చట పరిస్థితులను ఎదుర్కొనడానికి యీ ఏకపక్ష రాజ్యాంగ ధర్మం ఒక్కటే మార్గం. అందువల్లనే ఆ పద్ధతి లచ్చట అనుసరింపబడుచున్నది. ఈ మాటను ఆ దేశాల రాజకీయనేతలే అంటున్నారు. పాశ్చాత్య రాజకీయ సిద్ధాంతాలు బలపరుస్తున్నారు. ఇంతవరకు యీ వాదాన్ని వివరించడము, తిరస్కరించడము జరిగింది.

రెండవ వివరణము ఈవిధంగా వుంది. స్వార్థపరులైన పెత్తందార్లు వుంటారు. అధికారాన్ని కాజేయడం వారి పద్ధతి. ఇది మామూలుగా జరుగుతుంది. ఇటువంటి కర్మ వలలో పడకుండా తప్పించుకొనడము బాగా అభివృద్ధి చెందిన సమాజములకు మాత్రమే సాధ్యము. అంతకుముందు అధికారంలోవున్న సామ్రాజ్యవాది దేశాలు అచ్చటి నుండి వైదొలగిపోయి ఈరాజ్యాలలో నిరాధార స్థితిని ఒక దానినిసృష్టించాయి. అప్పుడుఅచ్చటఆ అధికారాన్ని నీతినియమాలు లేనివారు హస్తగతం చేసుకోలేదు అంటే ఆశ్చర్యంగా వుంటుంది. పశ్చిమఆఫ్రికా వాసులు ఇంకా బాగా అభివృద్ధి చెందలేదు. అధర్మపరుల చేతుల్లో అధికారం పడిపోకుండా రక్షించుకోగలంతటి మానసికమైన ఔన్నత్యం ఇంకా వారికి అబ్బలేదు—మొదలైన వాదాన్ని కొందరు ప్రదర్శిస్తారు. ఈ వాదమే గనుక యదార్థమైతే ఆదేశాలలో అధికారం కోసం పోరాటాలు సాగించుకొనకుండా, పెద్దపార్టీలు ఒకటితో ఒకడు సహకరించుకుంటూ పని చేసుకుపోతూ వుండాలని ఆశించడం వట్టి ఆదర్శ వాదమే అయి వూరుకుంటుంది.

అయితే ఈ రెండో వాదంలో అసలు విషయం కంటే అనుకొనడం ఎక్కువగా వుంది. అధికారంలోకి వచ్చిన వారంతా అధర్మపరులు కారు. సగంమంది అటువంటి వాళ్లు వుండవచ్చు. తక్కినసగం మంది వాళ్లు. దేశభక్తులు. ఇక రాజకీయంగా మానసిక అభ్యున్నతిని చెందడము అనగా పాశ్చాత్య వేషభాషా భావాభిలంబనం అని అర్థం చెప్పకూడదు. తమ పాలం తాము దున్నుకుంటూ ప్రతికే రైతుజన సమాజం వున్నదంటే, వారు ఎంతగా విద్యను నేర్చినవారు కాక పోయినా, ఆ సమాజం రాజకీయంగా కార్మిక సమాజం అంతటి రాజకీయ చైతన్యాన్ని భజించడంలేదని కూడా లనలేము. పశ్చిమఆఫ్రికాలో కొంతమంది జాతి పెద్దలు, పెత్తందార్లు నిరంకుశులైనా, అచ్చట తెగలప్రజలతో స్వయంపరిపాలనకు సంబంధించిన సంప్రదాయాలు అనాదిసిద్ధంగా చలామణి అవుతూ వస్తున్నాయి. ఐరోపాలో ప్రజలలో జమీందారీ సాంప్రదాయాలకు ప్రచారం ఎక్కువ. ఛోటా జమీందారులు, బడా జమీందారులు భూమిలేని కూలిజనం మీద అధికారం చలాయించే పద్ధతి ఇది. పశ్చిమ ఆఫ్రికాలో స్థితికొనివున్న తెగల పద్ధతిలో నిబిడమై వున్న స్వయంపరిపాలనా సంప్రదాయంలో ప్రజాస్వామ్యం పాదుకొనడానికి ప్రాశ్చాత్యదేశాలతో వుండివున్న సావకాశం కన్నా అధికమైన సావకాశం వుంది. పశ్చిమఆఫ్రికాలో అన్నితెగలు చర్చల ద్వారా నిర్ణయాలు చేసుకుంటాయి. ఒక మిశ్రమప్రభుత్వం ఎట్లా పని చేస్తుందో, అట్లా ఈ తెగలు పని చేస్తాయి. మిశ్రమప్రభుత్వ వ్యవస్థలో నిర్ణయాలు ఏ పద్ధతిలో జరుగుతూ వుంటాయో, దాదాపు అదే పద్ధతిలో ఈ తెగలలో కూడా నిర్ణయాలు జరుగుతూ వుంటాయి. ఇది ప్రజాస్వామ్య పద్ధతి. ఈ పద్ధతి ఆ జనంలో నెలకొని వున్న ఆదివ్యవస్థలలో చెల్లుబడి అవుతూ వచ్చింది. రాజకీయమైన చైతన్య ప్రాభవం విషయంలో పశ్చిమఆఫ్రికాలో పునాదులలో దోషం ఏమీలేదు. దోషం అంతా తలకట్టులో వుంది. అచ్చట మధ్యతరగతి ఇంకా ఎక్కువ కాలేదు. ఒక వంద యేండ్ల క్రిందట ఐరోపాలో కూడా ఇంతే. ఇట్లాగే వుండేది. ఇచ్చట కూడా పశ్చిమఆఫ్రికా రాజ్యాలలోనే కొన్ని తేడాలు వున్నాయి. ఈ ప్రాంతంలో ఉత్తర దేశాలు వున్నాయంటే ఆదేశాలలో మధ్యతరగతి అన్నది వున్నదా లేదా, అనిపిస్తూ వుంటుంది. దక్షిణ దేశాలలో అట్లాకాదు. ఈ దేశాలలో ఎప్పటినుంచో మధ్యతరగతుల జనం రాజకీయాలలో ప్రవేశించడం, పని చేయడం అంటూ జరుగుతూ వస్తున్నది.

ఇక మూడో వివరణం వున్నది. ఇప్పుడు ఈ దేశాలలో ఏకపక్ష రాజ్యాంగ ధర్మం ప్రచారంలోనికి వచ్చిందంటే, అందుకు కారణం అచ్చట ప్రజాస్వామ్యం తత్కాలజనితమైన ఉద్రేకాలచేత అది అదుపుబడింది. ఇది ఒక కారణం. ముఖ్యమైన కారణం వేరే వుంది. ఐరోపా వలన సముపార్జితాలైన ప్రజాస్వామ్య భావ ప్రపంచమున్నూ, సంస్థా ప్రపంచమున్నూ ఈ రాజ్యాలకు సరిపోలేదు. అనగా వికటించాయి. ఇందువల్ల ఈ భావములను, ఈ సంస్థలను ఎవరు బలపరిచారో, వారు బలహీనులైపోయినారు. కర్తవ్యతా విమూఢులైపోయారు. స్వాతంత్ర్యము వచ్చిన ఉమ్మస్సు కొత్తలలో కల్గిన భావోల్బణము తగ్గిపోయిన కొద్దీ, ఆయా ప్రాంతములు ఎదుర్కొంటున్న సమస్యలు అవగతములు అవుతున్న కొద్దీ అప్పుడు ఉన్న ప్రభుత్వములు తొలగింపబడి తిరిగి ప్రజాస్వామ్యము సంప్రతిష్ఠము కావడానికి ఆస్కారం ఏర్పడుతుంది. ఇది మూడవ వివరణము.

ఇప్పుడు పశ్చిమఆఫ్రికాలో పరిస్థితులుస్థిమితంగా లేవు. మనికిలోనేమి, బలములోనేమి అచ్చట ప్రభుత్వాలు ఒక్కపద్ధతిలో లేవు. కొన్ని ప్రభుత్వాలకు ప్రజలలో కొంత పేరు వుంది. కొన్ని ప్రభుత్వాలు కూలిపోతాయి. కొన్నిచోట్ల వారిలో వారికి తగాదాలు వచ్చి యీ ప్రభుత్వాలు కూలిపోవచ్చు. మరికొన్నిచోట్ల రాజకీయవేత్తల నాటకాలు, తంతులు, అవినీతి, అసామర్థ్యం చూచి పడలేక విసిగి సైన్యమే కల్పించుకొని ఆ ప్రభుత్వాలను కూల్చివేయవచ్చు. వ్యక్తి సమారాధనం నిల్వదు. పైకి వస్తున్న తరాలవారు యీ రకమైన భేషజాన్ని సహించలేరు. తమ ముందుతరము వారి కాపట్యాలను వారు తిరస్కరిస్తారు. ఒక ప్రభుత్వం నియంతృత్వ లక్షణము కలది. అవినీతి కశ్మలమైనది అయినంతమాత్రంచేత పతనం చెందదు. ఆ ప్రభుత్వం పతనానికి అంత మాత్రమైన కారణాలు చాలవు. సువ్యవస్థితమైన నియంతృత్వ పరిపాలనం చిరకాలం నిల్వవచ్చు. కొంత మంది నియంతలు మంచాలలో మరణిస్తారు. పశ్చిమ ఆఫ్రికాలో ఇంతటి సమర్థమైన వ్యవస్థానం లేదు. అది అదృష్టం. హిట్లరు, స్టాలిను ఏకైక రాజకీయ పక్ష పద్ధతికి శిష్టాది గురువులై ప్రవర్తిల్లివున్నారు. వారికి సుష్ఠు పరిపాలనకు తగిన సిబ్బంది, సుష్ఠు రవాణా సౌకర్యాలు ఉన్నాయి. వీని సహాయమున వారు పటిష్టమైన పార్టీ యంత్రాంగములను నిర్మాణం చేసుకోగల్గారు. పశ్చిమ ఆఫ్రికాలో రాజకీయవేత్తలకు ఇవి యేమీ లేవు. పార్టీలలో ఎప్పుడూ తగాదాలు. అవి సంమూర్ఛనంచెందే సావకాశమేలేదు.

లాటిన్ అమెరికా రాజ్యాంగంలోని పరిస్థితులకు ఇచ్చటి పరిస్థితులకు సంబంధంలేదు. ఆ లాటిన్ అమెరికా దేశాలలో, ఆదేశాలకు స్వాతంత్ర్యాన్ని సైన్యాలు సాధించి పెట్టాయి. కొత్త రాజ్యాలను సృష్టించాయి. దానికి ఒక రాజకీయమైన సంప్రదాయం ఏర్పడిపోయింది. పశ్చిమ ఆఫ్రికా దేశాలలో తక్కిన మరకొన్ని దేశాలలోలాగానే సైన్యం ప్రగతిశీలమైన లక్షణం కల్గివుంటున్నది. సైన్యాధికారుల అదుపు ఉన్నంతవరకు దానివలన యేవిధమైన సేగి గాని లేదు. ఈ సైన్యాధికారులు రాజకీయవేత్తలకన్నా విద్యావంతులు. నెమ్మదితనం వారి లక్షణం.వాగ్ధరులకు కొట్టుకుపోయే రకంకాదు. ఏదో మరీ ముంచుకు వస్తేనేగాని చేయి చేసుకోరు. కాని ఎప్పుడో కలుగజేసు కుంటారు. అందులో అనుమానం ఏమీలేదు. తమ కుటుంబాల ఒత్తిడివలన, ప్రజలలో అతృప్తి కాష్ఠను అందుకొన్నవేళ, వారు విధిగా కల్పించుకుంటారు.

ఏకపక్ష రాజ్యాంగం చెల్లుబాటు అవుతున్న రాజ్యాలలో కూడా తేడాలు ఉన్నాయి. న్ని రాజ్యాలలో స్థిమిత ప్రతిష్ఠ కల్గివున్నాయి. నిగిరివ రాజ్యాలలో ఎప్పుడు అగ్నిపర్వతాలు ప్రబద్ధరౌతాయో తెలియదు. పశ్చిమ ఆఫ్రికాలో దక్షిణ ప్రాంతపు రాజ్యాలలో మంచి వర్షాలు పడతాయి. వృక్షపుపంటలు లాభదాయకంగా ఉన్నాయి. జనంలో చెప్పుకో తగినంత మధ్య తరగతి వుంది. ఆ రాజ్యాలు త్వరితగతిని అభివృద్ధి చెందుతున్నాయి. ఉత్తరప్రాంతపు దేశాలు వున్నాయంటే అవి ఇప్పుడే 18 వ శతాబ్దంలోంచి నిద్ర మేల్కొంటున్నాయి ఇప్పుడు ఏకపక్ష రాజ్యాంగ పద్ధతినుండి తొరగా దూరం కాగల దేశాలు దక్షిణాదివిగాని, ఉత్తరాదివి కాజాలవు. ఈ దక్షిణ దేశాలలో గూడా తేడావుంది. కొన్ని రాజ్యాలకన్నా కొన్ని రాజ్యాలు మెరుగ్గా ఉంటాయి.ఈ మెరుగ్గా వున్న రాజ్యాలలో ముందు మార్పులు రాగల సావకాశం వుంది. ఈ మార్పు ఎంత ఇదిగా కొనసాగితే, అంత ఇదిగా ఆర్థిక సంబంధమైన తారతమ్యాలు తలఎత్తుతాయి. అందువల్ల సామాజికమైన ఉద్రేకాలు కూడా

అధికం అవుతాయి. ఏకపక్ష రాజ్య వ్యవస్థ వీనిని సమృదాయించుకోగలదియై ఎప్పుడూ ఉండజాలదు. ఇప్పుడు ఈ ఏకపక్ష రాజ్యాంగ పద్ధతి చెల్లుబడి అవుతున్న రాజ్యాలలో రాజకీయ వ్యవస్థలు సంస్థలు ఏదో మహామారి జాడ్యాలవలె పరిగణింపబడుతూ వుండటానికి ఇదే కారణం. ఏ దేశాలలో అయితే ఏకపక్ష రాజ్యాంగ పద్ధతి పాదుకొంటుందో అచ్చట గనుక అది మంచి పేరును సంపాయించకల్గినట్లయితే, అప్పుడు తక్కిన రాజ్యాలకు గూడా ఆ పద్ధతి ఇట్టే ప్రాకుతుంది. అదేవిధంగా యీ ఏకపక్ష రాజ్యాంగ పద్ధతి గనుక ఒకదేశంలో చెడిపోతే, నిల్వ లేకపోతే అప్పుడు తక్కిన దేశాలలో దానికి పట్టే గతి కూడా ఏవం విధంగానే వుంటుంది. ఇటువంటి పరిస్థితి ఏర్పడినప్పుడు కొత్త నాయకులు తలఎత్తుతారు. కొత్త మార్గాలను అనుసరిస్తారు. అప్పుడు వారికి ప్రజాస్వామ్యంపట్ల ఒక విధమైన వైముఖ్యం కల్గడం అన్నది అసాధ్యమేమీకాదు.

తగినటువంటి నాయకులే గనుక లభ్యం అయితే, ఇప్పుడువున్న యీ ఏకపక్ష రాజ్యాంగ ధర్మ పద్ధతి మిశ్రమ ప్రభుత్వ ధర్మపద్ధతిగా మారడం పెద్ద కష్టమైన విషయంకాదు.ఆయాత ప్రయాతపుపద్ధతికి ఎట్లా మారవచ్చునో, యీ మిశ్రమ ప్రభుత్వ పద్ధతి కిన్నీ అలానే మారవచ్చును. ఈ రాజ్యాలలో కావలసింది ప్రభుత్వపక్ష, ప్రతిపక్షాలమధ్య సంఘర్షణ కాదు; బహ్వంగ సమాజాలలోయీ పద్ధతి పనిచేయదు. పశ్చిమ ఆఫ్రికా రాజ్యాలలో చెల్లుబడి అవుతున్న పరిస్థితులలో అసలు పని చేయదు. ఏకపక్ష రాజ్యాంగ ధర్మ పద్ధతినుండి మిశ్రమ ప్రభుత్వ ధర్మ పద్ధతికి మారడము తేలిక విషయము. టోగోలో, దహోమీలో ఇట్లానే ఏర్పడ్డాయి. సైన్యాలకుకూడా ఇటువంటి ప్రభుత్వాలు ఏర్పడటమే ఇష్టం. ఇటువంటి ప్రభుత్వాలను నెలకొల్పడానికే ఆ సైన్యాలు ఆసక్తి చూపిస్తాయి. ఏకైక రాజకీయపక్షాలు అట్లా ఏకాకారంగావుండి పోదలచుకొనడంలేదు. చీలడం మంచిది అనుకుంటున్నాయి. అందువల్లనే ఈ పార్టీలలో లుకలుకలు, సంకట పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఈ కారణంచేతనే వేరు వేరు గ్రూపులు, సభ్యమైన ఇతర వర్గాలతో కలిసి మిశ్రమ ప్రభుత్వాల నిర్మాణానికి కడంగగల్గినప్పుడు ఆ రాజ్యాలు ప్రజాస్వామిక ధర్మ సంబంధమైన రాజమార్గంలో పడినట్లు అవుతుందనడానికి ఉపపత్తి కన్పిస్తున్నది. ఈ ప్రభుత్వాలు ప్రధానమైన స్వాతంత్ర్యాలను నాల్గింటిని నెలకొల్పవచ్చు. రాజ్యాంగ ధర్మ పాలనాన్ని, రాజకీయమైన చర్చలకు విస్తృత స్వాతంత్ర్యం, ట్రేడ్ యూనియన్‌ల పునరుద్ధరణ మొదలైన ఘనకార్యాలను సాధించవచ్చు. అంతేగాక దౌర్జన్యంతో, హింసతో అధికారాన్ని కైవసం చేసుకుందామని యత్నించేసే సాహసిక రాజకీయవర్గాల విషయంలో అప్రమత్తంగా వ్యవహరించను కూడావచ్చు. ప్రొపోర్షనల్ ప్రాతినిధ్యపు పద్ధతిని స్వతంత్రమైన ఎన్నికలు జరపడం అంటూ పెట్టుకొని, ప్రజాస్వామ్య ధర్మ విహితాలైన రాజకీయపక్షాలకు మాత్రమే ఆ ఎన్నికలలో పాల్గొనే అవకాశాన్ని కల్పించవచ్చు. ఇది అంతా ఆయా దేశాలలో ప్రశాంతమైన పరిస్థితులు ఏర్పడినప్పుడు జరగవలసిన పని.

పశ్చిమ ఆఫ్రికా రాజ్యాలలో ప్రజాస్వామ్యం బలహీనంగా వుంటున్నదంటే, అందుకు కారణం అక్కడ సమాజధర్మంలోలేదు. ఆ దేశాల సమస్యలు పరిష్కారం కావడానికి ప్రజాస్వామ్యం ఒక్కటే మార్గం. ఎందు చేతనంటే,ఆ ప్రజాస్వామ్య ధర్మపుచట్రంలోనే ఆదేశాలలోని వివిధములైన తెగలవారు, మతములవారు కలిసి పని చేయడానికి, శాంతియుత సహజీవనం నెరపడానికి ఆస్కారం ఉంటూ ఉంటుంది. అయితే మరి యీ బలహీనత ఎచ్చటవుంది? ఈ దేశాలలో మార్పులు త్వరితగతిని కొనసాగాయి. అందువల్ల కొన్ని రకాలయిన అస్థిమిత స్థితులు ఉత్పన్నం అయినాయి. పైగా యీ దేశాలకు కొత్తగా స్వాతంత్ర్యం సంప్రాప్తం అయిన కారణంచేత భావ ఉపప్లవం కూడా ఇచ్చట యీ పరిస్థితికి తోడైంది. ఈ పరిస్థితిని ఉపయోగించుకొని నీతినియమాలులేనివారు, నదురుబెదురులులేనివారు ఈ దేశాలలో అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. వారు అట్లా అధికారాన్ని హస్తగతం చేసుకొనడానికి అయిన అవకాశం లచ్చట ఏర్పడింది. బ్రిటన్‌వలన, ఫ్రాన్సువలన సంక్రమించిన సంస్థలు, భావ ప్రపంచము కూడా ఈ బలహీనతను ఎక్కువ చేశాయి. అవి అతిప్రజాస్వామ్యంగా ఉన్నాయి. అందువల్ల యీ రాజ్యాలలో ప్రజాస్వామ్యానికి, స్వైర ప్రవృత్తికి తేడా గోచరించలేదు. ఈ సంక్రమించిన సంస్థలలో ప్రజాస్వామ్యం పరిమితమై మాత్రమే చెల్లుతూ వచ్చింది. ఇచ్చట పరిమితమంటే అర్థం

ఇది. ఈ పద్ధతిలో అల్ప సంఖ్యాకులకు, ప్రతిపక్ష వర్గాలకు ప్రాతినిధ్యంఅంటూ లభించే పద్ధతి అంటూ లేదు. అందువల్ల అవి ఇప్పట్కి, యీ దేశాలలో దాదాపు విఫలం అయినాయి. ప్రజాస్వామ్య ధర్మ వ్యవస్థ ఇట్లా బలహీనం అయిపోవడంవలన ఈ రాజ్యాలలో అయోమయ స్థితి ఏర్పడింది. ఈ రాజ్యాలకు ప్రజాస్వామ్యం పనికిరాదు, అది యీ రాజ్యాలలో పని చేయదు అన్న విపరీత భావాలు వ్యాప్తిలోనికి వచ్చినప్పుడు ప్రజలు వానిని సఫలంగా ఆమోదించక తప్పని పరిస్థితి, ఆ మాటలు నిజమే అనుకునే పరిస్థితి ఏర్పడింది.

పశ్చిమ ఆఫ్రికాలో ప్రజాస్వామ్య ధర్మం బలహీనంగా వుండడానికి ఇంకో కారణం కూడా వుంది. ఆ దేశాలలో క్రొత్తగా విద్యావంతులయిన వారిలో ప్రజాస్వామ్యం పని చేస్తుందన్న నమ్మకం ఎంతగా ఉండాలో అంతగాలేదు. అనగా అధిక సంఖ్యాకులలో తమ దేశాలలో పనిచేస్తుందనిలేదు. అట్లా ప్రజాస్వామ్యంలో నమ్మకం వున్నవాళ్ళు ఆ దేశాలలో లేరనికాదు. ఉన్నారు. గట్టిగా నమ్మేవారు ఉన్నారు. వారు సమర్థులు, శక్తిమంతులు కూడాను. తమ యీ విశ్వాసాన్ని బలపరిచేవారు ఇతర దేశాలలో కూడా తమకు లభిస్తే సంతోషపడగలవారు. ఆ బలంవలన భౌతికమైన, మానసికమైన అసంతృప్తిని పొందవచ్చునని కూడా వీరు ఆశించారు. కాని వారి యీ ఆశ అడియాస అయిపోయింది. వారి యీ అన్వేషణ చరితార్థం కాలేదు. పాశ్చాత్య రాజ్యాలలోని ప్రజాస్వామ్యవాదులు పశ్చిమ ఆఫ్రికాను లెక్క చేయలేదు. వదిలిపెట్టివేశారు. ఆఫ్రికా అంటే ఎంతకాలంనుంచో అనురక్తితో వుంటున్నవారుగూడా, ఆ దేశాలలో అధికారంలో వున్నవారు ఏమనుకొనిపోతారో అని తమ కర్తవ్యాన్ని నెరవేర్చడానికికూడా భయపడుతూవచ్చారు. ఇక రాజకీయ శాస్త్ర సిద్ధాంతులు వున్నారంటే, వారి సిద్ధాంతాల ప్రకారం యీ ప్రజాస్వామ్యం అన్నది ఒక్క ఐరోపా రాజ్యాలలోతప్ప ఉత్తర అమెరికాలో తప్ప మరి ఇంకా ఎక్కడా కూడా పని చేయదని; ఇంతటితో వీరు ఆగితే బాగానే వుండును. "ఛారిస్మా" పేర, "ఆధునికీకరణము" పేర, "జాతీయ ఐకమత్యము" పేర ఇంతమంది రౌడీలను వెంట వేసుకొని, పెద్దగా కంఠంతో ఉపన్యాసాలు దంచుతూ, రాజ్యాన్ని ప్రభుత్వాన్ని కైవసం చేసుకొని, తనకు ప్రతిస్పర్థులయిన వారిని అణిచివేసే రకం మనిషి ఎవడు బయలుదేరినా, వానిని మెచ్చుకోవాలని, వానిని సమర్థించాలని మన మీదపడి వీరు గోలచేస్తూవుంటారు.

హేతుమాత్రంచేత ప్రజాస్వామ్యం పుష్టికాదు. కాని ప్రజాస్వామికులుఅయిన వారికి ప్రజాస్వామ్యం ఒక్కటేకాక, శ్రద్ధ, విశ్వాసము కూడా అవసరం అవుతున్నాయి. పశ్చిమ ఆఫ్రికాలో ప్రజాస్వామ్య ధర్మం నెలకొనవలెను అంటే, ఇప్పుడు పాఠశాలలో విద్యను అభ్యసించి వస్తున్న జనులకు వారి అసలు సమస్యలు ఏమిటో అర్థం కావలసి వుంది. అంతేగాక కపటంతో కూడిన వివరణములకు వారు లొంగి పోరాదు.

(సమాప్తము)

—ఎన్‌కౌంటర్ సౌజన్యంతో)



# మారన మహాకవి కాలము

శ్రీ శేకుమళ్ల కామేశ్వరరావు

సంస్కృతములో రచింపఁబడ్డ మార్కండేయ పురాణమును మారన మహాకవి యదే పేరున తెలుగు చేసి, నాగయ గన్నయ యను సైన్యాధిపతికి నంకిత మిచ్చెను. కృతిభర్తయైన గన్నయను గుఱించి యా మహాకవి కొన్ని యంశములనైనఁ దెలిపినాడు; కాని తనను గుఱించి రెండే మాటలను, అదైనను, గద్యలోఁ జెప్పుకొన్నాడు—తండ్రి పేరు తిక్కన, గురువు పేరు తిక్కసోమయాజి. గ్రంథమును వ్రాసిన కవి యొక్క చరిత్ర యెంత ప్రధానమైనదో ఈ కాలపు వారమైన మన మెఱుఁగుదుము. కాని యానాటి కవులెఱుఁగకపోవుట చేత నెన్నియో చిక్కులు తటస్థించుచున్నవి. దానికి మారన కవి యొక నిదర్శనము.

మారనకవి తండ్రి పేరు తిక్కన కదా! తిక్కన యను పేరును బట్టి యా కవి కుటుంబము నెల్లూరి ప్రాంతముది యని మనము నిశ్చయింప వచ్చును. కాఁబట్టి యితఁడు సమీపముననున్న తిక్కన మహాకవి వద్ద శిష్యత్వమునకుఁ జేరినాడు. దానివలన యితఁడు తిక్కన కాలమువాడని స్థూలముగా నిర్ణయ మగుచున్నది. కాని మారన మహాకవి కాలమును నిశితముగా నిర్ణయించుటకు సాధనలేవైన నున్నవా యను విషయమును బరీక్షించుటకు ముందుగాఁ దెలిసికొనవలసిన యంశములున్నవి.

ఈ గ్రంథ రచన యెచ్చట జరిగినది? గ్రంథ రచనకు దనను (మారయ్యను) బిలువఁబంపినప్పుడు నాగయ గన్నయ యెక్కడ కొలువుదీరెనో కవి ప్రత్యేకముగాఁ దెలుపలేదు. కాని గన్నయ సైన్యాధ్యక్షుఁడుగానె కాక, కటక పాలుఁడుగా కూడ నుండెనని, కవి మూడు చోట్ల ఇట్లు విశదపరచినాడు—కాకతిక్ష్మాతలాధీశ కటకపాలుఁడు (ఆ 1—ప 39), కాకతి నరపాలక కటక పాలన స్థిరశౌర్యా (ఆ 7—ప 286), కాకతిక్షితీశ్వర పురపాలన ప్రకటశౌర్య (ఆ 8 ప 288). కాకతీయ సామ్రాజ్యముయొక్క కటకము (ముఖ్యపట్టణము) ఓరుగల్లు కదా! కాఁబట్టి ఓరుగంటి నగర పరిపాలకునిగా కూడ నాగయ గన్నయ ఉన్నాడు. అట్లు మార్కండేయ పురాణ రచన ఓరుగంటిలోనె జరిగినదని దృఢముగాఁ జెప్పవచ్చును.

గన్నయ వంశీకుల శాసనము లింతవరకును బైటపడలేదు.

మారన కవి కాలమును గనుగొనుటకుఁ గల యాధారములు—1. అతఁడు తిక్కన సోమయాజికి శిష్యుఁడు. 2. ఆతడు గణపతిదేవ చక్రవర్తిని, ప్రతాపరుద్రదేవుని తన గ్రంథములోఁ బ్రశంసించినాడు. గణపతిదేవుని (క్రీ. శ. 1199—1260) గుఱించి యే సందేహముండుటకు నవకాశములేదు. కాని ప్రతాపరుద్రుని విషయమట్టిదికాదు. మొదట తిక్కన సోమయాజిని బట్టి మారన కవి కాలమును సూక్ష్మముగా నిర్ణయించుటకుఁ బ్రయత్నించ చూచెదము.

మనుమసిద్ధిరాజు నెల్లూరు ముఖ్యపట్టణముగా, చోడరాజ్యమును బాలించినాడు. అతని మంత్రిసత్తముఁడు తిక్కన మహాకవి. మనుమసిద్ధి వంశవృక్షములోని యొక భాగమును, వారిలో నిద్దరి జీవితకాలములు నిచ్చటఁ దెలిపెదను—

రాజేంద్ర మనుమసిద్ధి

|

తిక్కరాజు (1188—1256)

|

పేరు తెలియదు మనుమసిద్ధి (1215—1260)

మనుమసిద్ధిరాజు ఆస్థానమున తిక్కన కవి యుండినాడు కదా! అప్పటికి నతని వయస్సును

సూక్ష్మముగా నిర్ణయించుటకుఁ దగిన సాధనలు లేవు. అయితే తిక్కనకు తన గ్రంథము నంకితమిచ్చిన మూలఘటిక కేతన కవిఁ కొంతవఱకు తోడుపడు చున్నాడు.

కేతన కవి తాను రచించిన దశకుమార చరిత్రను [1]కొట్టరువు తిక్కన కవికి నంకితమిచ్చినాడు. అతని వల్లనే తిక్కన యొక్క ఇంటిపేరు కొట్టరువు వారని తెలియుచున్నది. దశకుమార చరిత్రను సంస్కృతములో దండి మహాకవి రచించియున్నాడు. దానిని కేతన కవి తెలుగు చేసినాడు. కేతనకు అభినవ దండి యను బిరుదమున్నది. ఆ బిరుదు అతఁడు వ్రాసిన తెలుగు దశకుమార చరిత్రవల్ల వచ్చినదో లేదో చర్చింపవచ్చును. అతఁడు సంస్కృతాద్యనేక కావ్యరచనా విశారదుఁడు (పీఠిక, వ 24). అది సరే! అతఁడు దశ కుమార చరిత్ర రచన నుపక్రమించుచు, తనకు అభినవదండి యను బిరుదున్నదని యిటు చెప్పు కొన్నాడు—

సీ. వేంగి విషయమున వెంటిరాలనుపేర
నభిరామమగు నగ్రహారమునకు
నగణియగువాని, నభినవదండి నా
బొలుపు మీఱిన వానిఁ, బ్రోలనార్యు
ననుఁగుదమ్ముని, సంస్కృతాది భాషలఁ గావ్య
కర్తృత్వమున నుతిఁ గన్నవాని,
గౌండిన్యగోత్రుని, బండరు కేత దం
డాధీశుమఱఁది, నధ్యయన పరుని—

(పీఠిక, ప 23)

అంతియేకాక నా పీఠికలోనే 'దశకుమార చరిత్రము సెప్పఁబూనితిన్' (పీఠిక, ప 25) అని వ్రాసుచ్చినాడు. కాఁబట్టి యతనికి గ్రంథరచనకుఁ బూర్వమె అభినవదండి యను బిరుదున్నట్లుగా మనకుఁ దోచును. కాని యతని మాటలను నమ్ముటకులేదు. అయితే అతఁడు గ్రంథ రచనను సాగించిన తర్వాతనో, లేక ముగించిన పిమ్మటనో వచ్చిన బిరుదును గ్రంథావతారిక లోనే యెట్లు పేర్కొనగలిగి వాడను సందేహము పుట్టకమానదు. అతడు ప్రబంధమును గొంతవఱకు వ్రాసియో, లేక సంపూర్ణముగా రచించియో, గ్రంథావతారికా రచన నెత్తుకొని, దానిలో తనకు లభించిన బిరుదును జెప్పుకొన్నాడని చెప్పకతప్పదు. దానిని తర్కించుట కది యొక్కటె మార్గము. అభినవదండి వంటి పొగడికయె తిక్కన మహాకవికిఁ గూడ మార్కండేయ పురాణములోఁ గనఁబడుచున్నది. మారన కవి తిక్కనను స్తుతించుచు 'నవీన పరాశరసూనుఁడు (ఆ 1 ప 10) అని పేర్కొన్నాడు. భారత రచనను బట్టి తిక్కనకు వచ్చినట్లె, దశకుమార చరిత్రను బట్టి కేతనకు గూడ పొగడిక వచ్చినదని మనము గ్రహింపవచ్చును.

కేతన కవి వేగినాటి వాస్తవ్యుఁడు కదా! అతఁడు పాకనాటి సీమలోనున్న తిక్కన వద్దకుఁ బోయి తన గ్రంథము నంకితమిచ్చెను. దానిని తిక్కన మహాకవి ప్రోత్సహించుటకు ఒక ముఖ్యకారణము లేకపోలేదు. కేతనకవియొక్క మఱఁది బండరు కేతన. అతఁడు దండాధీశుఁడు; ఏ రాజు నద్దనో మాత్రము మనకుఁ దెలియదు. కాని యతఁడు వేగినాటిని బాలించుచున్న వెలనాటి చోడ ప్రభువుల వద్ద నుండవచ్చును. అట్లు కేతన కవి నాదరించుటలో తిక్కన కవి కొంత రాజ నీతిని గనబఱచకపోలేదు.

తిక్కన, మహాకవియే కాక మంత్రికూడ. కాఁబట్టి కేతన తన ప్రబంధము నంకితమిచ్చుటకు రెండు కారణములున్నవి. తిక్కన ఒక చిన్న రాజ్యము నకు మంత్రి. కాఁబట్టి యతఁడు తనకు ధనమో పణమో ముట్టజెప్పవచ్చును. ఆశ్వాసాది పద్యములలో మాత్రము కేతన యెంతసేపూ తిక్కనయొక్క మంత్రిత్వమునె పొగడినాడు. రెండవ కారణము—తిక్కన యొక మహాకవి యని విన్న కేతన యతనికి తన గ్రంథమునిచ్చి ప్రఖ్యాతినిఁ బొందదలచినాడు. తిక్కన మహాకవి తెలుగు గ్రంథములనె కాక [2]సంస్కృత గ్రంథములను గూడ వ్రాసినాడు.

---

1. కొట్టరువు అను ఇంటిపేరు గల బ్రాహ్మణులు ఇప్పుడు కృష్ణాజిల్లాలోని పెదకళ్లేపల్లిలోఁ గూడ నున్నారు (వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన ప్రజ్ఞాప్రభాకరము (1951) పుట. 5.

2. సంగమ వంశజాతైన కంపరాజు భార్య గంగాదేవి తన భర్త విజయములను వర్ణించుచు వ్రాసిన మధురా విజయమను సంస్కృతగ్రంథమునఁ దిక్కన సోమయాజిని సంస్కృత కవులలోఁజేర్చి వర్ణించినది. కాని అందునను నాతఁడు రచించిన గ్రంథనామముల నీయలేదు.(ఆంధ్రకవి తరంగిణి, సం 2. పుట 143.)

దశకుమార చరిత్ర ప్రబంధములో దిక్కన మహాకవి యొక్క గ్రంథరచనను గూర్చి ఈ క్రింది పొగడికలు గలవు—అపూర్వార్థ శబ్ద చారు కవితమై నెగడిన బాణోచ్ఛిష్టం జగత్త్రయం బనిన పలుకు సఫలంబయ్యెన్ (పీ 90), కృతులు రచియింప...నొరునికిం దీరునె...తిక్కఁడొక్కఁడు దక్కన్ (పీ 91), తెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తానుభయకవి మిత్ర నామము...తిక్కఁడు దాల్చెన్ (పీ 92), లలిత నానా కావ్యములు చెప్ప నుభయభాషలయందు ననుట ప్రశంస త్రోవ (పీ93), ఉభయకవి మిత్రునకున్ (ఆ4ప129) కావ్యకళాభిరామికిన్ (ఆ 5 ప 134), సారకవితా నిర్మాణ చాతుర్య (ఆ7 ప 164), కవితాధన్యుండు (ఆ9ప84). అన్ని పొగడికలను కేతనకవి తెలిపినాడు కాని ఆ మహా కవి వ్రాసిన యొక్క తెలుఁగు గ్రంథమునుగాని, సంస్కృత గ్రంథమునుగాని పేర్కొనలేదు. కాని పై పొగడికల నుండి మనము, తిక్కన ఒక్క ఉత్తర రామాయణమును వ్రాయుటయే కాక, ఆంధ్ర మహా భారతమును గూడ ఏ రవ్వంతో చేసియుండవచ్చునని గ్రహింపవచ్చును. తిక్కన యొక్క హరిహరనాథ భక్తిని గుఱించి కేతన కవి తన గ్రంథములో దెలుప లేదు. కాబట్టి యానాటి కింకను తిక్కనకవి మహా భారత రచనను ప్రారంభింపలేదని వాదింపఁ బూనుట వ్యర్థము. కేతన కవికి అట్టి సూక్ష్మములతో సంబంధములేదు. అతఁడు స్థూలాంశములనే కాని సూక్ష్మాంశముల జోలికిఁ బోవువాడు కాడు. తిక్కన కవి యొక్క శిష్యుఁడైన మారనకవి తన గురువైన తిక్కనను స్తుతించిన పద్యము (ఆ1 ప 10)లోనైనను తిక్కన యొక్క హరిహరారాధనపరతను గుఱించి చెప్పడయ్యె!

కేతన తన గ్రంథము నంకితమిచ్చు కాలమునకు తిక్కనకవి సోమయాజియైనాడా లేదా యను మఱి యొక సమస్య కలదు. కేతన కవి తిక్కనకవి యొక్క యాజికత్వమును గూర్చి చెప్పిన పొగడికలు—క్రతు పురుషత్వ ప్రసిద్ధుఁడు (పీ 88), మహితదక్షిణలైన బహువిధ యాగంబు లొనరించుననుట వర్ణనము చొప్ప (పీ 93), అధ్వరాబ్జ దినవాథునకున్ (పీ 95), సంతత సమర్పిత మఖశిఖిముఖ నిలింప పితృవర్గునకున్ (పీ 96), యాగవిద్యాభిరామ(ఆ3ప165), సతతాధ్వర క్రియాకర్మఠ పాణిపద్మునకున్ (ఆ 5 ప 134), మఖ సంతోషిత మరుత్సమాజునకున్ (ఆ5ప135), యాజక మండలోత్తమా (ఆ 8 ప 94), యాగాహ(?)రణ నిపుణ చిత్తుండు (ఆ 9 ప 86), ఆగమ గోష్ఠీఘటన ప్రదేశము (ఆ 10 ప 192). వాటిని బట్టి తిక్కనకవి దశకుమార చరిత్రము నంకితము పొందినప్పటికె సోమయాజియైనాడని నిరభ్యంతరముగాఁ జెప్పకొన వచ్చును. అంతేకాదు. అతఁడు ఉత్తరరామాయణ కావ్యగద్యలోనే తాను సోమయాజినని చెప్పుకొన్నాడు. భారత రచన కొంతయైనను దశకుమారచరిత్రను అంకితము గొన్ననాటికి జరిగియుండును. ఆంధ్ర మహాభారత పీఠికలో తాను తిక్కశర్మను అని కూడ ఆ మహాకవి చెప్పుకొన్నాడు.

తిక్కన యొక్క జీవిత విశేషములనెన్నిటినో తెలియజేయుగల యవకాశము కేతన కవికి నుండినది. కాని దాని నుపయోగించుకొనక లాంఛనపు పొగడికలతో నింపివేసినాడు. మారన మహాకవి తిక్కనను పరతత్త్వ బోధను (ఆ 1 ప 10) అని మాత్రమే పేర్కొన్నాడు. కేతన మారనలు తిక్కనకవి జీవితములోని యంశములను దెలుపక, తమకు గలిగిన యమూల్యావకాశము లను వ్యర్థము గావించుకొన్నారు. కేతనకవి దశకుమార చరిత్రను గాక తిక్కన మహాకవి చరిత్రను వ్రాసియున్నచో వాఙ్మయములో నతనికి సాటి జీవిత చరిత్రకారుఁడుండఁడు.

కేతన కవి తిక్కనకవికి తన ప్రబంధము నంకితమిచ్చు సరికి మనుమసిద్ధిరాజు జీవించియున్నాడను విషయ మా గ్రంథమందే—"ఇట్లు కీర్తిపాత్రంబైన మనుమసిద్ధి మహీవల్లభునకుఁ గరుణారస పాత్రంబైన కొట్టరువు తిక్కనామాత్యుఁడు నిజకులక్రమాగతంబగు మంత్రిపదంబున వర్ధిల్లుచు (పీ, ప 20) అని చెప్పబడినది. అంతియేకాక మనుమసిద్ధి యెంత కాలము జీవించెనో తెలుసుకొనుటకు ఇతరత్ర ఆధారము కూడ నున్నది.[3] ఆ రాజు శాసనములు 1257 దాటి కనఁబడుటలేదనిచాగంటి శేషయ్యగారు వ్రాసియున్నారు. కాని 1260 నాటి శిలాశాసన మొకటి కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలోని అనమంచిపల్లెలోని శివాలయ గర్భాలయములో నున్నదని[4] వీరేశలింగ కవి

3. ఆంధ్ర కవితరంగిణి సం 2, పుట 249.

4. ఆంధ్రకవుల చరిత్ర (1917) పుటలు 85, 98.

తెలిపినాడు. కాబట్టి యీరాజు 1260 లో గూడ నున్నాడని నిరాక్షేపణగా జెప్పవచ్చును. అటుపిమ్మట నాతని శాసనములు దొరకనందున నదియే అతని ఆఖరి సంవత్సరమని భావించుటలో విచిత్రమేమియు నుండదు. అతఁడు తఱచుగా దాయాదులతో జరుగు చుండిన యుద్ధములలో మృతిఁజెంది యుండవచ్చును. అతనికి తరచుగా సాయపడుచుండిన కాకతీయ చక్రవర్తి, అతని రాజ్యమును తన సామ్రాజ్యములోఁ గలుపుకొని యుండవచ్చును. అట్లు దాయాదులకు రాజ్యకాంక్ష వదలియుండును.

మనుమసిద్ధి వంశీయుల శాసనము లితర స్థలములలోఁ గూడ కనఁబడుచున్నవి. అతనికి మనుమడని చెప్పఁదగినరో మనుమగండగోపాలుఁడు కొణిదెన ముఖ్య పట్టణముగాఁ బరిపాలించుచు క్రీ. శ. 1297 లో నొక శాసనమును వేయించినాడు. ఇంక ప్రకృత విషయము—

తిక్కరాజు చాలకాలము రాజ్యపాలన చేసి 1256 లో స్వర్గస్థుడు కాగా, మనుమసిద్ధి సింహాసన మెక్కెను. అప్పటికి నతని వయస్సు నలువది యున్న కొన్నచో నతఁడు నుమారు అయిదు సంవత్సరములు మాత్రమె రాజ్యము చేసి 1260 కి దివంగతుడగుట చేత నలువదియైదేండ్ల చిన్నప్రాయమునకె జీవిత యాత్రను ముగించుకొనె ననవచ్చును. కావున నతని జీవిత కాలము 1215 నుండి 1260వరకు, మాత్రమె యగును.

తిక్కన మహాకవిని మనుమసిద్ధి మామ యని పిలుచుచుండుట చేత నా మహాకవి యీరాజు కంటె పెద్దవాఁడని యూహింపవచ్చును. ఆ రాజు కంటె నతడు అయిదేండ్లు పెద్దవాఁడని చెప్పుకొన్నచో,తిక్కన జన్మ సంవత్సరము 1210 యగును.

మనుమసిద్ధిరాజు పరిపాలించు చుండిన (1256--60) కాలముందె తిక్కన మహాకవి యతనికి ఉత్తరరామాయణము సంకితమిచ్చెను. ఆ గ్రంథరచనా కాలము 1256 ప్రాంతము కావచ్చును. అంతియేకాక మనుమసిద్ధి పరిపాలించు చుండగానె కేతనకవి దశ కుమార చరిత్రను వ్రాసియుండుటచేత నా గ్రంథ రచనా కాలము 1260 ప్రాంతము కావచ్చును.

ఆ సమయమునకుఁ దిక్కన మహాకవి ఉత్తర రామాయణమును ముగించి, మహాభారత రచనకుఁ దొరకొన్నాడు. తిక్కన కవి మహాభారతమునంతను రచించి ప్రపంచమునకుఁ బ్రమరించినాడా లేక ఒక్కొక పర్వమునె గొర్తిచేసి విడుదలచేసినాడా యను ప్రశ్నలు చొప్పదంటు ప్రశ్నలు మాత్రమె.

మారన మహాకవి వ్రాసిన మార్కండేయ పురాణ రచనా కాలమును, ఆ మహాకవి జీవితకాలమును గనుఁగొనవలసియున్నది. ఆ కవి తాను తిక్కన సోమ యాజి శిష్యుఁడనని గద్యలో—"శ్రీమదుభయకవి మిత్రు తిక్కన సోమయాజి ప్రసాద లబ్ధ సరస్వతీ పాత్ర, తిక్కనామాత్య పుత్ర, మారయ నామధేయ ప్రణీతంబైన —"అని చెప్పినాడు. అట్టి సందర్భములో మారన కవి 1260 కి ముందె తిక్కన కవికి శిష్యుఁడని భావింపవచ్చును. శిష్యునకు 1260 కి నిరువదేండ్ల ప్రాయముండవచ్చును.

మార్కండేయ పురాణములోని కృతిపతి వంశ వర్ణనమును బట్టి కూడ మారన కవి కాలమును నిర్ణయించుటకు బ్రయత్నించెదము.

మార్కండేయ పురాణమును నాగయ గన్నయ సైన్యాధిపతి కృతి పొందినాడు. అతఁడు చతుర్థ వర్ణజుఁ డని యీ గ్రంథమున నిర్వివాదముగా జెప్పబడినది. అంతకంటె ఏ కులము వాఁడో తెలియదు. అతని వంశక్రమము (ఆ 1 ప 12—43) ఇట్లున్నది—

మల్లఁడు (=పోలాంబ)  మేచయ

నాగయ (=మల్లాంబ)

గన్నయ (కృతిభర్త)  ఎల్లయ  మేచయ

మల్లయ, అతని కుమారుఁడు నాగయ కూడ సైన్యాధిపతులె! ఎవరి వద్దనో చెప్పబడలేదు. మేచయ మాత్రము గణపతిదేవ చక్రవర్తి యొక్క అలపరి. అతని యల్లుఁడు నాగయ. కావున వారిద్దరును గణపతిదేవుని కాలములోని వారేయని గ్రహింపవచ్చును. నాగయ యొక్క పుత్రుఁడైన గన్నయ మాత్రము ప్రతాపరుద్రదేవుని వద్ద కటకపాలుఁడు. అతని తమ్ము లిద్దరును సైన్యాధిపతులు. వారిద్దరిలో మేచయను

5. ఆంధ్రకవి తరంగిణి సం 2, పుట 250.

గుఱించి కవి ప్రత్యేకముగాఁ జెప్పినాడు. అతడు ప్రతాప రుద్రుని యొక్క సైన్యాధిపతి. ఈ వర్ణనలలోఁ జెప్పఁబడిన ప్రతాపరుద్రదేవు డెవడు?

మారన తన గ్రంథములోఁ ప్రతాపరుద్ర దేవుని పేరును మూఁడుచోట్ల (ఆ 1 ప 12, 24, 43) తెలిపినాడు. అంతియొకాక అతనికి రుద్రదేవ నామముగూడ కలదని ఇట్లు వ్రాసినాడు—

క. శ్రీ రుద్రదేవ నృపతి
స్ఫారదయాలబ్ధ విభవ! శౌర్యేంద్రభవా!
మారాస్త్ర దళిత [illegible]
నారీజన సుప్రసన్న! నాగయ గన్నా! (ఆ 5 ప1)

మార్కండేయ పురాణములో 'చలమర్త్యగండ ప్రతాప మనుజవిభుడు'(ఆ 1 ప 43) అని చెప్పబడినది. కాలమును సూక్ష్మముగా నిర్ణయించుటకు చలమర్త్య గండ బిరుదము తోడ్పడుటలేదు. ఏలనన, ఆ బిరుదు ఆ వంశము వారికి చిరకాలము నుండి వచ్చుచున్నది. రెండవ బేతరాజు[6] (క్రీ. శ. 1080—1115), గణపతిదేవ చక్రవర్తి యొక్క సైన్యాధిపతులైన [7]గంగయ సాహిణి, జన్నిగిసాహిణి, రుద్రాంబ యొక్క సైన్యాధ్యక్షుడైన త్రిపురాంతక దేవుడును గూడ ఆ బిరుదును ధరించిరి.

ప్రతాపరుద్రుడు అనినంతమాత్రమున ఫలానా ప్రతాపరుద్రుడని చెప్పలేము. గణపతిదేవుని తండ్రి యైన రుద్రదేవుఁడు కూడ ప్రతాపరుద్రుఁడే. అతడు మొదటి ప్రతాపరుద్రుఁడు.కానియతఁడు చాల పూర్వపు వాడగుటచేత వానితో మనకు ప్రసక్తి లేదు. మన పనికి యవసరమగు నంతమట్టుకు కాకతీయ వంక వృక్ష భాగము నిందు తెలుపుచున్నాను.

---

6. కాకతీయ సంచిక అనుబంధము పుట 1.

7. కాకతీయాంధ్ర రాజయుగ చరిత్ర 5 వ భాగము పుటలు 215, 408, 499.

ప్రోలరాజు II (1110—1158)

|*

రుద్రదేవుడు మహాదేవరాజు ?
(1158—1195) (1195—1199

గణపతిదేవుడు కుందమాంబ
(1199—1260)

కోట గణపాంబ రుద్రాంబ
(=గణపతి) 1260—1295
(= చాళుక్య వీరభద్రుడు)

పెంపుడు కూతురైన రుయ్యాంబ
ముమ్మడమ్మ (=ఇందులూరి అన్నయా
మాత్యుడు)
(=కాకతి మహాదేవరాజు*)

ప్రతాపరుద్రుడు
(1295–1324)

* ముఘుకుంటి తామ్రశాసనము—ఎపిగ్రాఫికా కర్ణాటకా, తుమకూరు, నెం. 14 (భారతి, డిశంబరు 1960, పుట, 43)

* కాకతి మహాదేవరాజు అను నీతఁడు రుద్ర దేవుని (1158—1195) పేరు తెలియని తమ్ములలో నొకని వంశస్థుడు(భారతి. డిశం. 1960. పుట43)

గన్నని తాత మేచయ నాయకుఁడు. ఆ మేచయ గణపతిదేవ చక్రవర్తి (1199—1260) యొక్క కొలువులో నుండగా నతని కూతురి కొడుకైన గన్నయ రెండవ ప్రతాపరుద్రుని కొలువులో నుండెననఁదగునా? 1260 కి ముందె తిక్కనకు శిష్యునిగా నుండిన మారయ సుమారుగా నలుబది యేండ్లు పిమ్మట రాజ్యమునకు వచ్చిన రెండవ ప్రతాపరుద్రుని కొలువులోనున్న గన్నసేనానికిఁ గృతినిచ్చెననుట సహజమా అను ప్రశ్నను బరీక్షించవలసి యున్నది.

గణపతిదేవుని కాలములో నుండిన మేచయ నాయకుని కూతురి "అగ్రజుఁ"డయిన గన్నయ రెండవ ప్రతాపరుద్రుని కొలువులో నుండెననుకొనుటకు దీర్ఘ కాల మడ్డు వచ్చుచున్నది. ఈక్రింది పోలికనుబట్టి అది అసహజమని పొడగట్టవచ్చును. రుద్రాంబ కాకతీయ రాజ్యమును(1260 నుండి 1295) వఱకు బరిపా లించినది. ఆమె పెంపుడుకూతురి బిడ్డఁడైన రెండవ ప్రతాపరుద్రుఁడే యామె వెనుక( 1295--1323) రాజ్యభారమును వహించినాడు. పౌత్రునకును దౌహి త్రునకును కాల వ్యత్యాసముండుట సహజము. గణపతిదేవుని కాలముననుండిన మేచయయొక్క దౌహిత్రుడు, రుద్రమదేవియొక్క దీర్ఘ పరిపాలనా కాలమునుదాటి రెండవ ప్రతాపరుద్రునివద్దనె సైన్యాధి కారిగా నుండెనని చెప్పుట అసహజముగాఁ గనబడు చున్నది. అందుచేత గన్నయ కొల్చిన ప్రతాపరుద్రు డెవఁడో కనుఁగొనవలసియున్నది.

రెండవ ప్రతాపరుద్రునికి (1295--1323) ప్రతాపరుద్రీయమను సంస్కృతగ్రంథ మంకిత మీయబడినది. దానితో గణపతిదేవునకు రుద్రాంబ యనెడి కూతురున్నదనియు, అతడు ఆమెను పురుష వేషము ధరింపజేసి, సింహాసనమున గూర్చుండబెట్టి, రుద్రదేవమహారాజు అని పేరు పెట్టెననియు వివర ముగా వ్రాసియున్నాడు. అంతియేకాక, ఆమెకు ముమ్మడమ్మ యను బాలికనిచ్చి పెండ్లి తంతు కూడ జరిపినారట! రుద్రాంబ లేక రుద్రదేవుడు గణపతి దేవుఁడు జీవించియున్నప్పుడే, అతనితోఁ గలసి పరిపాలన చేసినట్లుగా శాసనములనుండి తెలియుచున్నది.1253 నాటిదైన [9]జిలాలపురశాసనములో రుద్రాంబయే రుద్ర దేవుడను పేరితో రాజ్యము చేయుచున్నట్లు విశద మగుచున్నది. ఆనాటి సామంతులలోనొకఁడగు మల్యాల గుండ దండాధిపుఁడు 1259లో వేయించిన బూద పూరు శాసనములో "శ్రీమన్మహామండలేశ్వర రుద్రదేవ మహారాజులు ఒరంగల్లు మొదలి పట్టణముగా సుఖసంకథా వినోదంబుం బృథ్వీరాజ్యము సేయుచుండ" అని తెలిపినాడు. రుద్రాంబకు

8. ఆంధ్రేతిహాస పరిశోధక మండలి వారి సం. 3, భాగ 2, 3, 4, పుట 117.

9. ఆంధ్రేతిహాస పరిశోధక మండలి వారి సం. 7 భాగము 2 పుట 121.

నిజముగా వివాహమయినట్లుగా 1259 నాటి[10] జుత్తిగ శాసనమునుండి గ్రహింపవచ్చును. ఆమె భర్త పేరు చాళుక్య వీరభద్రుఁడు. అయినను గూడ నామె పురుష నామముతోనే వ్యవహరింపఁబడుచుండెను. గణపతిదేవుని యనంతరము ఆమె 1260లో సింహాసన మెక్కెను. ఆమె సైన్యాధ్యక్షుఁడైన త్రిపురాంతక దేవ మహారాజు తాను వేయించిన[11] ఒక శాసనములో రుద్రాంబను పురుషనామమునసె—"రుద్రదేవ మహారాజ చరణ నళిన యుగళ సమారాధనుడ" అని తెలుపుకొన్నాడు. 1290 నాటిదైన నిశ్శంక ఇమ్మడి మల్లికార్జునుని శాసనములో కాకతి రుద్రాంబ గణపతి దేవుని పుత్రుడుగా వర్ణింపబడినది.

అట్లు రెండవ ప్రతాపరుద్రునకు (1295—1323) పూర్వము రుద్రాంబయే రుద్రదేవ మహారాజను పేరున బిలువఁబడెను రుద్ర శబ్దమునకు ప్రతాప పదమును జేర్చుటలో వింత ఏమియులేదు. మొదటి రుద్రదేవునకుగూడ నట్టి విశేషణమును జేర్చి వాడిన పట్టులు గలవు. మార్కండేయ పురాణములోఁ బ్రతాప రుద్రదేవ, రుద్రదేవ అను పేర్లు రెండును గనఁబడు చున్నవి కదా! కాబట్టి దానిలోఁ జెప్పఁబడిన నామము రుద్రాంబదెకాని యన్యులదికాదు. విద్యానాథుని ప్రతాపరుద్రీయములో రుద్రాంబ పురుషనామముతో బేర్కొనబడినట్లె మార్కండేయ పురాణములో కూడను. అందుచేత నాగయ గన్నయ రుద్రాంబ వద్దనె సైన్యాధిపతిగా నుండెనని నిశ్చయింపవచ్చును.

ఇక్కడ మరియొక విశేషము. మారయకవి గణపతి దేవుని కాలములో మేచయ నాయకుఁడు తలవరిగా నుండెనని చెప్పినాడు. ఆతని యల్లుఁడు 'నాగచమూవిభుఁడు' కదా! మామయల్లుళ్ళు ఏక కాలమున నున్నారనవచ్చును. కాబట్టి యతడు కూడ గణపతిదేవుని కాలములోనే ఉన్నాడని గ్రహింపవచ్చును. మారనకవి గణపతిదేవుని కాలమును గురించి చెప్పిన పిమ్మట ప్రతాపరుద్రుని గురించి చెప్పినాడు. ఆ ప్రతాప రుద్రుడె రెండవప్రతాపరుద్రుఁడైన నక్షమున్న, గణపతి దేవునికిఁ బిమ్మట ముప్పదియైదు సంవత్సరముల దీర్ఘకాలము రాజ్యము చేసిన రుద్రాంబ (రుద్రదేవ మహారాజు) విషయమేమైనది? కవి పెద్ద కప్పదాటు వేసినాడా? రుద్రాంబ పరిపాలన వారలకు పరిపడ లేదా? కాబట్టి ప్రతాపరుద్రుఁడను పేరున మారన కవి రుద్రమదేవినిఁ బేర్కొన్నాడని చెప్పుకొనుట బహు సమంజసము. అందుచేత మేచయ నాయకుఁడును వాని యల్లుఁడు నాగయయును, గణపతిదేవుని కాలములో ప్రఖ్యాతి వహింపగా, మనుమఁడైన గన్నయ, రుద్రాంబ కాలములోఁ బేరుపొందినాడు. మారనకవి పేర్కొన్న ప్రతాపరుద్రుఁడు రుద్రాంబయె.

గన్నయ పుట్టుక గణపతిదేవుని యాఖరి రాజ్య సంవత్సరమైన 1260 యని గ్రహింపవచ్చును. గన్నయ వయస్సును నిర్ణయించుటకు నితర సాధన లున్నవా?

మార్కండేయ పురాణములో గన్నయ వంశ వృక్షము వర్ణింపఁబడినది కదా! నాగయకు మేచయ తన కుమార్తె నిచ్చి పెండ్లి చేసెనని చెప్పి, వారి సంతానమైన ముగ్గురను వర్ణించెను. ఆ ముగ్గురిలోను పెద్దవాడు గన్నయ. అతడు వట్టి సైన్యాధిపతి గానె వర్ణింపఁబడినాడు కాని వివాహితుఁడని చెప్పఁబడ లేదు. కాబట్టి మార్కండేయ పురాణమును గృతి నందు నరికి గన్నయ కింకను బెండ్లి కాలేదని చెప్ప గలమా? అట్టిది సాధ్యముకాదు. కవులు తాము అంకితమిచ్చిన వారి వంశవృక్షమును దెలుపుచు, కృతి పతి యొక్క భార్యను, బిడ్డలను దెలిపినవారు దెలిపిరి, లేనివారులేదు. కేతనకవి యొక్క గ్రంథమును అంకితము బొందునప్పటికిఁ దిక్కనకు యేబది సంవత్సరముల ప్రాయమైన నుండును. కాని యతనికి వివాహమైనట్లుగాని, బిడ్డలున్నట్లుగాని కేతన వ్రాయ లేదు. అంతమాత్రము చేత తిక్కనను ఆనాటి కింకను వివాహమైన కాలేదనుట అజ్ఞానము కదా! కాబట్టి కృతిపతి యొక్క భార్యాపుత్రులను వర్ణించిన వారు వర్ణించినారు, లేనివారు లేదు. అది కాలనిర్ణయమున కాధారమని పూర్తిగా భావింపరాదు.

మారయకవి తిక్కనసోమయాజికి తన యిరువదియవ యేట శిష్యుఁడుకాగా, 1290కి అతఁడు ఏబది సంవత్సరములవాఁడై యుండును. 1210లో జన్మించినాడనబడెడు తిక్కన మహాకవి 1290 వఱకు

10. A. R. 343 of 1921 (ఆంధ్ర కవి తరంగిణి సం 3 పుట 42.)

11. (1) కాకతీయాంధ్రయుగరాజచరిత్ర సం 5 పుట 498.

(2) నిశంక ఇమ్మడి మల్లికార్జునుని శాసనం (భారతి మార్చి 1959 పుట 18.)

జీవించియున్నచో ఎనుబది సంవత్సరములవాడై పోట్ల పండువలె నుండును. కాని తిక్కన నిర్యాణమును గుఱించి సాంప్రదాయకముగా వచ్చుచున్న పద్య మిట్లున్నది—

క. అంబర రవి శశి శాకా
బ్దంబులు చనఁ[12] గాళయుక్తి భద్రపదపు మా
సంబున నంబరమణి బిం
బంబునఁ దగు తిక్కయజ్వ బ్రహ్మముఁ జేరెన్.

దాని ప్రకారము కవిబ్రహ్మ క్రీ. శ. 1288 (శా. శ. 1210)నాడు నిర్యాణము చెందెనని చెప్పవలసియున్నది. అదియె నిజము కావచ్చును. కాబట్టి యాతఁడు సరిగా డెబ్బది యెనిమిది సంవత్సరములు మాత్రమె జీవించియుండును.

అయితే మార్కండేయ పురాణరచనా కాలము నాటికి దిక్కన మహామహుఁడు జీవించియుండెనాయను ప్రశ్నకు సమాధానము లభించునేమో చూచెదము. మారనకవి తిక్కనకు శిష్యుఁడె. కాని యాకవి తన గురువును వేరు పద్యమున వ్రాసి చెప్పుకొనక, తన గ్రంథము యొక్క గద్యలో మాత్రమె పేర్కొన్నాడు. అయితే కవి స్తుతిలో నన్నయభట్టుకి పిమ్మట స్తుతించినాడు. దానిలో "సంతత త్రిభువన కీర్తనీయ యశుఁడ"ని తెలియజేసినాడు. ఆ పదసంపుటినిఁ బట్టి మార్కండేయ పురాణరచనా కాలము నాటికి తిక్కన కవి కీర్తిశేషుఁడయ్యెనని చెప్పదగియున్నది. ఆ గ్రంథ రచన 1288 కి పిమ్మట జరిగియుండును. అయితే రుద్రాంబ పరిపాలన 1290 కి ముగిసినది. ఆ పుస్త కము ఆమె పరిపాలనా కాలములోనె వ్రాయఁబడినది. కావున మార్కండేయ పురాణము 1288—90 మధ్యకాలమున సృష్టింపఁబడినదని నిర్ణయింపవచ్చును.

ఇక్కడ మరియొక చిన్న సమస్యను విచారింప వలసి యున్నది.

1323 లో కాకతీయ సామ్రాజ్యము నాశన మైనది. రెండవ ప్రతాపరుద్రుఁడు శత్రువుల చేఁజిక్కి నాడు. అతడే కాక అతని సైన్యాధిపతులు కొందఱు కూడ పట్టుబడినారు. వారిలో[13] నాగయ గన్నయ యను వాఁడొకఁడున్నాడు. అతని చరిత్ర మహమ్మ దీయ చరిత్రకారుల వ్రాతల నుండి తెలియుచున్నది. ఆ గన్నయ మహమ్మదీయ మతమును స్వీకరించినాడు. మల్లిక్‌మక్బూల్ అను పేరును పెట్టుకొన్నాడు. పిమ్మట ఓరుగంటిని పాలించుటకు ఢిల్లీ సుల్తాను చేతఁ బంపబడినాడు.

కాని యది సాధ్యముకాలేదు. ఇతర స్థలములలోఁ బరిపాలించి 1372—73 లో మరణించినాడు..... 1260 ప్రాంతములో జన్మించి, పిమ్మట మారనకని నుండి మార్కండేయ పురాణమునుఁ గృతిఁగొనిన నాగయ గన్నయయే నా మతమును మార్చుకొన్నవాఁడు? అతఁడే యైన పక్షమున, నాగయ గన్నయ 1260 లో జన్మించి 1372 లో అనగా నూటపన్నెండవ యేట మరణించెనని చెప్పవలసియున్నది. అది పొత్తిగా అసంభవము. దానిని సంభవముగా జేయుటకు తల క్రిందులు లెక్కలను వేయవచ్చును. అంతట నదియె అసంభవమని రుజువుపఱచును. కాబట్టి వారిద్దఱును వేర్వేరు పురుషులని నిర్ణయించుట మేలు. ఈ రెండవ నాగయ గన్నయ యొక్క పుట్టువు మనకు తెలియదు.

మారన మహాకవి డెబ్బది సంవత్సరముల వఱకు జీవించియుండవచ్చును. అప్పటికి నతని జీవితము 1240 నుండి 1310 వఱకు యుండును. అట్లు రుద్రాంబకుఁ బిమ్మట రెండవప్రతాపరుద్రుని కాలములో గూడ మారనకవి యుండుట కవకాశ మున్నది. అయితే అతఁడు పేరు ప్రఖ్యాతుల కొఱకు తాపత్రయ పడిన వ్యక్తిగాఁగనఁబడడు. ఆనాటి చరిత్ర కొంతవఱకు ఏకామ్రనాథుని ప్రతాపచరిత్ర నుండి తెలియ్వ చున్నది. అందు మారన పేరు గానరాదు. అతఁడు చక్రవర్తినిగాక, యతని సిబ్బంది నాశ్రయించి కాలము వెళ్లబుచ్చినాడని మనము భావింపవచ్చును.

12. శా. శ. 1210 కాళయుక్తి గాక సర్వధారి యగుచున్నది. కాళయుక్తి పదము నెత్తివేసి సర్వధారిని వేసుకొన్నను పద్యలక్షణమునకు బాధలేదు.

13. భారతి, బహుధాన్య మాఘమాస సంచిక (ఆంధ్ర కవి తరంగిణి సం 3, పుట 169.)

# మారన మహాకవి కాలము

శ్రీ వేకుమళ్ల కామేశ్వరరావు

సంస్కృతములో రచింపబడ్డ మార్కండేయ పురాణమును మారన మహాకవి యనుపేరున తెలుగు చేసి, నాగయ గన్నయ యను సైన్యాధిపతికి నంకిత మిచ్చెను. కృతిభర్తయైన గన్నయను గుఱించి యా మహాకవి కొన్ని యంశములనైనఁ దెలిపినాడు; కాని తనను గుఱించి రెండే మాటలను, అదైనను, గద్యలోఁ జెప్పుకొన్నాడు—తండ్రి పేరు తిక్కన, గురువు పేరు తిక్కసోమయాజి. గ్రంథమును వ్రాసిన కవి యొక్క చరిత్ర యెంత ప్రధానమైనదో ఈ కాలపు వారమైన మన మెఱుఁగుదుము. కాని యానాటి కవులెఱుఁగకపోవుట చేత నెన్నియో చిక్కులు తటస్థించుచున్నవి. దానికి మారన కవి యొక నిదర్శనము.

మారనకవి తండ్రి పేరు తిక్కన కదా! తిక్కన యను పేరును బట్టి యా కవి కుటుంబము నెల్లూరి ప్రాంతముది యని మనము నిశ్చయింప వచ్చును. కాబట్టి యతఁడు సమీపముననున్న తిక్కన మహాకవి వద్ద శిష్యత్వమునకుఁ జేరినాడు. దానివలన యతఁడు తిక్కన కాలమువాడని స్థూలముగా నిర్ణయ మగుచున్నది. కాని మారన మహాకవి కాలమును నిశితముగా నిర్ణయించుటకు సాధనలేమైన నున్నవా యను విషయమును బరీక్షించుటకు ముందుగాఁ దెలిసి కొనవలసిన యంశములున్నవి.

ఈ గ్రంథ రచన మెచ్చట జరిగినది? గ్రంథ రచనకు దనను (మారయ్యను) బిలువఁబంపినప్పుడు నాగయ గన్నయ యెక్కడ కొలువుదీరెనో కవి ప్రత్యేక ముగాఁ దెలుపలేదు. కాని గన్నయ సైన్యాధ్యక్షుఁడుగానె కాక, కటక పాలుఁడుగా కూడ నుండెనని, కవి మూడు చోట్ల ఇట్లు విశదపరచినాడు—కాకతిక్ష్మాతలాధీశ కటకపాలుఁడు (ఆ 1—ప 39), కాకతి నరపాలక కటక పాలన స్థిరశౌర్యా (ఆ 7—ప 286), కాకతిక్షి పురపాలన ప్రకటశౌర్య (ఆ 8 ప 288). కాకతీయ సామ్రాజ్యముయొక్క కటకము (ముఖ్యపట్టణము) ఓరుగల్లు కదా! కాబట్టి ఓరుగంటి నగర పరిపాల కునిగా కూడ నాగయ గన్నయ ఉన్నాడు. అట్లు మార్కండేయ పురాణ రచన ఓరుగంటిలోనె జరిగినదని దృఢముగాఁ జెప్పవచ్చును.

గన్నయ వంశీకుల శాసనము లింతవరకును బైటపడలేదు.

మారన కవి కాలమును గనుగొనుటకుఁ గల యాధారములు—1. అతఁడు తిక్కన సోమయాజికి శిష్యుఁడు. 2. అతడు గణపతిదేవ చక్రవర్తిని, ప్రతాప రుద్రదేవుని తన గ్రంథములోఁ బ్రశంసించినాడు. గణపతిదేవుని (క్రీ. శ. 1199—1260) గుఱించి యే సందేహముండుటకు నవకాశములేదు. కాని ప్రతాప రుద్రుని విషయమట్టిదికాదు. మొదట తిక్కన సోమ యాజిని బట్టి మారన కవి కాలమును సూక్ష్మముగా నిర్ణయించుటకుఁ బ్రయత్నించ చూచెదము.

మనుమసిద్ధిరాజు నెల్లూరు ముఖ్యపట్టణ ముగా, చోడరాజ్యమును బాలించినాడు. అతని మంత్రి సత్తముఁడు తిక్కన మహాకవి. మనుమసిద్ధి వంశ వృక్షములోని యొక భాగమును, వారిలో నిద్దరి జీవితకాలములు నిచ్చుటఁ దెలిపెదను—

రాజేంద్ర మనుమసిద్ధి
|
తిక్కరాజు (1188—1256)
|
పేరు తెలియదు | మనుమసిద్ధి (1215—1260)

మనుమసిద్ధిరాజు ఆస్థానమున తిక్కన కవి యుండినాడు కదా! అప్పటికి నతని వయస్సును

సూక్ష్మముగా నిర్ణయించుటకుఁ దగిన సాధనలు లేవు. అయితే తిక్కనకు తన గ్రంథము నంకితమిచ్చిన మూలఘటిక కేతన కవిఁ కొంతవఱకు తోడుపడు చున్నాడు.

కేతన కవి తాను రచించిన దశకుమార చరిత్రను [1]కొట్టరువు తిక్కన కవికి నంకితమిచ్చినాడు. అతని వల్లనే తిక్కన యొక్క ఇంటిపేరు కొట్టరువు వారని తెలియుచున్నది. దశకుమార చరిత్రను సంస్కృతములో దండి మహాకవి రచించియున్నాడు. దానిని కేతన కవి తెలుగు చేసినాడు. కేతనకు అభినవ దండి యను బిరుదమున్నది. ఆ బిరుదు అతఁడు వ్రాసిన తెలుగు దశకుమార చరిత్రవల్ల వచ్చినదో లేదో చర్చింపవచ్చును. అతఁడు సంస్కృతాద్యనేక కావ్యరచనా విశారదుఁడు (పీఠిక, ప 24). అది సరే! అతఁడు దశ కుమార చరిత్ర రచన నుపక్రమించుచు, తనకు అభినవదండి యను బిరుదున్నదని యిట్లు వ్రా కొన్నాడు—

సీ. వేంగి విషయమున వెంటిఖాలనుపేర
నభిరామమగు న(గహారమునకు
న(గణియగువాని, నభినవదండి నా
బొలుపు మీఱిన వాని, (బోలనార్యు
ననుఁగుదమ్ముని, సంస్కృతాది భాషలఁ గావ్య
కర్తృత్వమున నుతిఁ గన్నవాని,
గౌండిన్యగోత్రుని, బండరు కేత దం
డాధీశుఁ, నధ్యయన పరుని—

(పీఠిక, ప 23)

అంతియెకాక నా పీఠికలోనె 'దశకుమార చరిత్రము సెప్పఁబూనితిన్' (పీఠిక, ప 25) అని వ్రాకుచ్చినాడు. కాఁబట్టి యతనికి గ్రంథరచనకుఁ బూర్వమె అభినవదండి యను బిరుదున్నట్లుగా మనకుఁ దోచును. కాని యతని మాటలను నమ్ముటకులేదు. అయితే అతఁడు గ్రంథ రచనను సాగించిన తర్వాతనో, లేక ముగించిన పిమ్మటనో వచ్చిన బిరుదును గ్రంథావతారిక లోనె యెట్లు పేర్కొనగలిగి నాడను సందేహము పుట్టకమానదు. అతడు ప్రబంధమును గొంతవఱకు వ్రాసియో, లేక సంపూర్ణముగా రచించియో, గ్రంథావతారికా రచన నెత్తుకొని, దానిలో తనకు లభించిన బిరుదును జెప్పకొన్నాడని చెప్పకతప్పదు. దానిని తర్కించుట కది యొక్కటె మార్గము. అభినవదండి వంటి సొగడికయె తిక్కన మహాకవికిఁ గూడ పూర్కండేయ పురాణములోఁ గినఁబడుచున్నది. మారన కవి తిక్కనను స్తుతించుచు 'నవీన పరాశరసూనుఁడు (ఆ 1 ప 10) అని పేర్కొన్నాడు. భారత రచనను బట్టి తిక్కనకు వచ్చినట్లె, దశకుమార చరిత్రను బట్టి కేతనకు గూడ సొగడిక వచ్చినదని మనము గ్రహింపవచ్చును.

కేతన కవి వేగినాటి వాస్తవ్యుఁడు కదా! అతఁడు పాకనాటి సీమలోనున్న తిక్కన వద్దకుఁ బోయి తన గ్రంథము నంకితమిచ్చెను. దానిని తిక్కన మహాకవి ప్రోత్సహించుటకు ఒక ముఖ్యకారణము లేకపోలేదు. కేతనకవియొక్క మఱిది బండరు కేతన. అతఁడు దండాధీశుఁడు; ఏ రాజు వద్దనో మాత్రము మనకుఁ దెలియదు. కాని యతఁడు వేగినాటిని బాలించుచున్న వెలనాటి చోడ ప్రభువుల వద్ద నుండవచ్చును. అట్లు కేతన కవి నాదరించుటలో తిక్కన కవి కొంత రాజ నీతిని గనబఱచకపోలేదు.

తిక్కన, మహాకవియే కాక మంత్రికూడఁ కాఁబట్టి కేతన తన ప్రబంధము నంకితమిచ్చుటకు రెండు కారణములున్నవి. తిక్కన ఒక చిన్న రాజ్యమునకు మంత్రి. కాఁబట్టి యతఁడు తనకు తృణమో పణమో ముట్టజెప్పవచ్చును. ఆశ్వాసాది పద్యములలో మాత్రము కేతన యెంతసేపూ తిక్కనయొక్క మంత్రిత్వమునె సొగడినాడు. రెండవ కారణము—తిక్కన యొక మహాకవి యని విన్న కేతన యతనికి తన గ్రంథమునిచ్చి ప్రఖ్యాతినిఁ బొందదలచినాడు. తిక్కన మహాకవి తెలుగు గ్రంథములనె కాక [2]సంస్కృత గ్రంథములను గూడ వ్రాసినాడు.

---

1. కొట్టరువు అను ఇంటిపేరు గల బ్రాహ్మణులు ఇప్పుడు కృష్ణాజిల్లాలోని పెదకళ్లేపల్లిలోఁ గూడ నున్నారు (వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన ప్రజ్ఞాప్రభాకరము (1951) పుట. 5.

2. సంగము వంశజుడైన కంపరాజు భార్య గంగాదేవి తన భర్త విజయములను వర్ణించుచు వ్రాసిన మధురా విజయమను సంస్కృతగ్రంథమునఁ దిక్కన సోమ యాజిని సంస్కృత కవులలోఁజేర్చి వర్ణించినది. కాని అందునను నాతఁడు రచించిన గ్రంథనామములనీయలేదు. (ఆంధ్రకవి తరంగిణి, సం 2. పుట 143.)

దశకుమార చరిత్ర ప్రబంధములో దిక్కన మహాకవి యొక్క గ్రంథరచనను గూర్చి ఈ క్రింది పొగడికలు గలవు—అపూర్వార్థ శబ్ద చారు కవితమై నెగడిన బాణోచ్ఛిష్టం జగత్త్రయం బనిన పలుకు సఫలంబయ్యెన్(పీ 90), కృతులు రచియింప...నొరునికిం దీరునె...తిక్కడొక్కడు దక్కన్ (పీ 91), తెనుగున సంస్కృతమునం జతురుండై తానుభయకవి మిత్ర నామము...తిక్కడు దాల్చెన్ (పీ 92), లలిత నానా కావ్యములు చెప్ప నుభయభాషలయందు ననుట ప్రశంస త్రోవ (పీ93), ఉభయకవి మిత్రునకున్(ఆ4ప129) కావ్యకళాధూమికిన్ (ఆ 5 ప 134), సారకవితా నిర్మాణ చాతుర్య (ఆ7 ప 164), కవితాధన్యుండు (ఆ9ప84). అన్ని పొగడికలను కేతనకవి తెలిపినాడు కాని ఆ మహా కవి వ్రాసిన యొక్క తెలుగు గ్రంథమునుగాని, సంస్కృత గ్రంథమునుగాని పేర్కొనలేదు. కాని పై పొగడికల నుండి మనము, తిక్కన ఒక్క ఉత్తర రామాయణమును వ్రాయుటయే కాక, ఆంధ్ర మహా భారతమును గూడ ఏ రవ్వంతో చేసియుండవచ్చునని గ్రహింపవచ్చును. తిక్కన యొక్క హరిహరనాథ భక్తిని గురించి కేతన కవి తన గ్రంథములో దెలుప లేదు. కాబట్టి యానాటి కింకను తిక్కనకవి మహా భారత రచనను ప్రారంభింపలేదని వాదింపం బూనుట వ్యర్థము. కేతన కవికి అట్టి సూక్ష్మములతో సంబంధములేదు. అతడు స్థూలాంశములనె కాని సూక్ష్మాంశముల జోలికిం బోవువాడు కాడు. తిక్కన కవి యొక్క శిష్యుడైన మారనకవి తన గురువైన తిక్కనను స్తుతించిన పద్యము (ఆ1 ప 10)లోనైనను తిక్కన యొక్క హరిహరారాధనపరతను గురించి చెప్పడయ్యె!

కేతన తన గ్రంథము నంకితమిచ్చు కాలమునకు తిక్కనకవి సోమయాజియైనాడా లేదా యను మఱి యొక సమస్య కలదు. కేతన కవి తిక్కనకవి యొక్క యాజికత్వమును గూర్చి చెప్పిన పొగడికలు—క్రతు పురుషత్వ ప్రసిద్ధుడు (పీ 88), మహితదక్షిణలైన బహువిధ యాగంబు లొనరించుననుట వర్ణనము చొప్ప (పీ 93), అధ్వరాబ్జ దినవాథునకున్(పీ 95), సంతత సమర్చిత మఖశిఖిముఖ నిలింప పితృవర్గునకున్ (పీ 96), యాగవిద్యాభిరాణ(ఆ3ప165), సతతాధ్వర క్రియాకర్మఠ పాణిపద్మునకున్ (ఆ 5 ప 134), మఖ సంతోషిత మరుత్సమాజునకున్ (ఆ5ప135), యాజక మండలోత్తమా(ఆ 8 ప 94), యాగాహ(?)రణ నిపుణ చిత్తుండు (ఆ 9 ప 86), అగమ గోష్ఠీఘటన ప్రదే శము (ఆ 10 ప 192). వాటిని బట్టి తిక్కనకవి దశకుమార చరిత్రము నంకితము పొందినప్పటికె సోమయాజియైనాడని నిరభ్యంతరముగాం జెప్పకొన వచ్చును. అంతేకాదు. అతడు ఉత్తరరామాయణ కావ్యగద్యలోనె తాను సోమయాజినని చెప్పుకొన్నాడు. భారత రచన కొంతయైనను దశకుమారచరిత్రను అంకితము గొన్ననాటికి జరిగియుండును. ఆంధ్ర మహాభారత పీఠికలో తాను తిక్కశర్మను అని కూడ ఆ మహాకవి చెప్పుకొన్నాడు.

తిక్కన యొక్క జీవిత విశేషములనెన్నిటినో తెలియజేయగల యవకాశము కేతన కవికి నుండినది. కాని దాని నుపయోగించుకొనక లాంఛనపు పొగడికలతో నింపివేసినాడు. మారన మహాకవి తిక్కనను పరతత్త్వ బోధను (ఆ 1 ప 10) అని మాత్రమే పేర్కొన్నాడు. కేతన మారనలు తిక్కనకవి జీవితములోని యంశ ములను దెలుపక, తమకు గలిగిన యమూల్యావకాశము లను వ్యర్థము గావించుకొన్నారు. కేతనకవి దశ కుమార చరిత్రను గాక తిక్కన మహాకవి చరిత్రను వ్రాసియున్నచో వాఙ్మయములో నతనికి సాటి జీవిత చరిత్రకారుండుండడు.

కేతన కవి తిక్కనకవికి తన ప్రబంధము నంకితమిచ్చు నరికి మనుమసిద్ధిరాజు జీవించియున్నాడను విషయు మాగ్రంథమందె—"ఇట్లు కీర్తిపాత్రం బైన మనుమసిద్ధి మహీవల్లభునకుం గరుణారస పాత్రం బైన కొట్టరువు తిక్కనామాత్యుడు నిజకులక్రమా గతంబగు మంత్రిపదంబున వర్ధిల్లుచు (పీ, ప 20) అని చెప్పబడినది. అంతియెకాక మనుమసిద్ధి యెంత కాలము జీవించెనో తెలుసుకొనుటకు ఇతరత్ర ఆధారము కూడ నున్నది.[3] ఆ రాజు శాసనములు 1257 దాటి కనబడుటలేదనిచాగంటి శేషయ్యగారు వ్రాసియున్నారు. కాని 1260 నాటి శిలాశాసన మొకటి కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలోని అనమంచిపల్లెలోని శివాలయ గర్భాలయములో నున్నదని[4] వీరేశలింగ కవి

3. ఆంధ్ర కవితరంగిణి సం 2, పుట 249.

4. ఆంధ్రకవుల చరిత్ర (1917) పుటలు 85, 98.

తెలిపినాడు. కాబట్టి యీరాజు 1260 లోఁ గూడ నున్నాడని నిరాక్షేపణగాఁ జెప్పవచ్చును. అటుపిమ్మట నాతని శాసనములు దొరకనందున నదియే అతని ఆఖరి సంవత్సరమని భావించుటలో విచిత్రమేమియు నుండదు. అతఁడు తఱచుగా దాయాదులతో జరుగు చుండిన యుద్ధములలో మృతిఁజెంది యుండవచ్చును. అతనికి తరచుగా సాయపడుచుండిన కాకతీయ చక్రవర్తి, అతని రాజ్యమును తన సామ్రాజ్యములోఁ గలుపుకొని యుండవచ్చును. అట్లు దాయాదులకు రాజ్యకాంక్ష వదలియుండును.

మనుమసిద్ధి వంశీయుల శాసనము లితర స్థలములలోఁ గూడ కనఁబడుచున్నవి. అతనికి మనుమడని చెప్పఁదగినవాఁడు మనుమగండగోపాలుఁడు కొణిదెన ముఖ్య పట్టణముగాఁ బరిపాలించుచు క్రీ. శ. 1297 లో నొక శాసనమును వేయించినాడు. ఇంక ప్రకృత విషయము—

తిక్కరాజు చాలకాలము రాజ్యపాలన చేసి 1256 లో స్వర్గస్థుఁడు కాగా, మనుమసిద్ధి సింహాసన మెక్కెను. అప్పటికి నతని వయస్సు నలువది యున్న కొన్నచో నతఁడు సుమారు ఐదు సంవత్సరములు మాత్రమె రాజ్యము చేసి 1260 కి దివంగతుడగుట చేత నలువదియైదేండ్ల చిన్నప్రాయముననె జీవిత యాత్రను ముగించుకొనె ననవచ్చును. కావున నతని జీవిత కాలము 1215 నుండి 1260వరకు మాత్రమె యగును.

తిక్కన మహాకవిని మనుమసిద్ధి మామ యని పిలుచుచుండుట చేత నా మహాకవి యీరాజు కంటె పెద్దవాఁడని యూహింపవచ్చును. ఆ రాజు కంటె నతడు అయిదేండ్లు పెద్దవాఁడని చెప్పుకొన్నచో,తిక్కన జన్మ సంవత్సరము 1210 యగును.

మనుమసిద్ధిరాజు పరిపాలించు చుండిన (1256-60) కాలముందె తిక్కన మహాకవి యతనికి ఉత్తరరామాయణము నంకితమిచ్చెను. ఆ గ్రంథరచనా కాలము 1256 ప్రాంతము కావచ్చును. అంతియేకాక మనుమసిద్ధి పరిపాలించు చుండగానె కేతనకవి దశ కుమార చరిత్రను వ్రాసియుండుటచేత నా గ్రంథ రచనా కాలము 1260 ప్రాంతము కావచ్చును.

ఆ సమయమునకుఁ దిక్కన మహాకవి ఉత్తర రామాయణమును ముగించి, మహాభారత రచనకుఁ దొరకొన్నాడు. తిక్కన కవి మహాభారతమునంతను రచించి ప్రపంచమునకుఁ బ్రకటించినాఁడా లేక ఒక్కొక పర్వమునె గుత్తిచేసి విడుదలచేసినాఁడా యను ప్రశ్నలు చొప్పదంటు ప్రశ్నలు మాత్రమె.

మారన మహాకవి వ్రాసిన మార్కండేయ పురాణ రచనా కాలమును, ఆ మహాకవి జీవితకాలమును గనుఁగొనవలసియున్నది. ఆ కవి తాను తిక్కన సోమయాజి శిష్యుఁడనని గద్యలో—"శ్రీమదుభయకవి మిత్రు తిక్కన సోమయాజి ప్రసాద లబ్ధ సరస్వతీ పాత్ర, తిక్కనామాత్య పుత్ర, మారయ నామధేయ ప్రణీతంబైన —"అని చెప్పినాడు. అట్టి సందర్భములో మారన కవి 1260 కి ముందె తిక్కన కవికి శిష్యుఁడని భావింపవచ్చును. అప్పటికి 1260 కి నిరువదేండ్ల ప్రాయముండవచ్చును.

మార్కండేయ పురాణములోని కృతిపతి వంశ వర్ణనమును బట్టి కూడ మారన కవి కాలమును నిర్ణయించుటకు బ్రయత్నించెదను.

మార్కండేయ పురాణమును నాగయ గన్నయ సైన్యాధిపతి కృతి పొందినాడు. అతఁడు చతుర్థ వర్ణజుఁడని యీ గ్రంథమున నిర్వివాదముగా జెప్పఁబడినది. అంతకంటె ఏ కులము వాఁడో తెలియదు. అతని వంశక్రమము (ఆ 1 ప 12—43) ఇట్లున్నది—

మల్లఁడు (=పోలాంబ)　　మేచయ

నాగయ (=మల్లాంబ)

గన్నయ (కృతిభర్త)　　ఎల్లయ　　మేచయ

మల్లయ, అతని కుమారుఁడు నాగయ కూడ సైన్యాధిపతులె! ఎవరి వద్దనో చెప్పఁబడలేదు. మేచయ మాత్రము గణపతిదేవ చక్రవర్తి యొక్క అలరి. అతని యల్లుఁడు నాగయ. కావున వారిద్దరును గణపతిదేవుని కాలములోని వారేయని గ్రహింపవచ్చును. నాగయ యొక్క పుత్రుఁడైన గన్నయ మాత్రము ప్రతాపరుద్రదేవుని వద్ద కటకపాలుఁడు. అతని తమ్ములిద్దరును సైన్యాధిపతులు. వారిద్దరిలో మేచయను

5. ఆంధ్రకవి తరంగిణి సం 2, పుట 250.

గురించి కవి ప్రత్యేకముగాఁ జెప్పినాడు. అతడు ప్రతాప రుద్రుని యొక్క సైన్యాధిపతి. ఈ వర్ణనలలోఁ జెప్పఁబడిన ప్రతాపరుద్రదేవు డెవడు?

మారన తన గ్రంథములోఁ బ్రతాపరుద్ర దేవుని పేరును మూఁడుచోట్ల (ఆ 1 ప 12, 24, 43) తెలిపినాడు. అంతియేకాక లతనికి రుద్రదేవ నామముగూడ కలదని ఇట్లు వ్రాసినాడు—

> క. శ్రీ రుద్రదేవ నృపతి
> స్ఫారదయాలబ్ధ విభవ! శౌర్యేంద్రభవా!
> మారాస్త్ర దళిత చేతో
> నారీజన సుప్రసన్న! నాగయ గన్నా! (ఆ 5 ప1)

మార్కండేయ పురాణములో 'చలమర్త్యగండ ప్రతాప మనుజవిభుడు'(ఆ 1 ప 43) అని చెప్పబడినది. కాలమును సూక్ష్మముగా నిర్ణయించుటకు చలమర్త్య గండ బిరుదము తోడ్పడుటలేదు. ఏలనన, ఆ బిరుదు ఆ వంశము వారికి చిరకాలము నుండి వచ్చుచున్నది. రెండవ బేతరాజు[6] (క్రీ. శ. 1080–1115), గణపతిదేవ చక్రవర్తి యొక్క సైన్యాధిపతులైన [7]గంగయ సాహిణి, జన్నిగసాహిణి, రుద్రాంబ యొక్క సైన్యాధ్యక్షుడైన త్రిపురాంతక దేవుడును గూడ ఆ బిరుదును ధరించిరి.

ప్రతాపరుద్రుడు అనినంతమాత్రమున ఫలానా ప్రతాపరుద్రుఁడని చెప్పలేము. గణపతిదేవుని తండ్రి యైన రుద్రదేవుఁడు కూడ ప్రతాపరుద్రుఁడే. అతడు మొదటి ప్రతాపరుద్రుఁడు. కానియతఁడు చాల పూర్వపు వాడగుటచేత వానితో మనకు ప్రసక్తి లేదు. మన పనికి యవసరమగు నంతమట్టుకు కాకతీయ వంశ వృక్ష భాగము నిందు తెలుపుచున్నాను.

---

6. కాకతీయ సంచిక అనుబంధము పుట 1.

7. కాకతీయాంధ్ర రాజయుగ చరిత్ర 5 వ భాగము పుటలు 215, 408, 499.

ప్రోలరాజు II (1110—1158)

రుద్రదేవుడు మహాదేవరాజు
(1158—1195) (1195—1199)

గణపతిదేవుడు కుందమాంబ
(1199—1260)

కోట గణపాంబ (=గణపతి)

రుద్రాంబ 1260—1295 (= చాళుక్య వీరభద్రుఁడు)

పెంపుడు కూతురైన ముమ్మడమ్మ (=కాకతి మహాదేవరాజు*)

రుయ్యాంబ (=ఇందులూరి అన్నమామాత్యుఁడు)

ప్రతాపరుద్రుఁడు
(1295—1324)

* ముళుకుంటి తామ్రశాసనము— ఎపిగ్రాఫికా కర్ణాటకా, తుమకూరు, నెం. 14 (భారతి, డిశంబరు 1960, పుట, 43)

* కాకతి మహాదేవరాజు అను నీతఁడు రుద్రదేవుని (1158—1195)పేరు తెలియని తమ్ములలో నొకని వంశస్థుఁడు(భారతి. డిశం. 1960. పుట43)

గన్నని తాత మేచయ నాయకుఁడు. ఆ మేచయ గణపతిదేవ చక్రవర్తి (1199—1260) యొక్క కొలువులో నుండగా నతని కూతురి కొడుకైన గన్నయ రెండవ ప్రతాపరుద్రుని కొలువులో నుండెననఁదగునా? 1260 కి ముందె తిక్కనకు శిష్యునిగా నుండిన మారయ సుమారుగా నలుబది యేండ్లు పిమ్మట రాజ్యమునకు వచ్చిన రెండవ ప్రతాపరుద్రుని కొలువులోనున్న గన్నసేనానికిఁ గృతినిచ్చెననుట సహజమా అను ప్రశ్నలను బరీక్షించవలసి యున్నది.

గణపతిదేవుని కాలములో నుండిన మేచయ నాయకుని కూతురి "అగ్రజుఁ"డయిన గన్నయ రెండవ ప్రతాపరుద్రుని కొలువులో నుండెననుకొనుటకు దీర్ఘ కాల మడ్డువచ్చుచున్నది. ఈ క్రింది పొలికనుబట్టి అది అసహజమని పొడగట్టవచ్చును. రుద్రాంబ కాకతీయ రాజ్యమును(1260 నుండి 1295) వఱకు బరిపాలించినది. ఆమె పెంపుడుకూతురి బిడ్డఁడైన రెండవ ప్రతాపరుద్రుఁడె యామె వెనుక( 1295—1323) రాజ్యభారమును వహించినాడు. పౌత్రునకును దౌహిత్రునకును కాల వ్యత్యాసముండుట సహజము. గణపతిదేవుని కాలముననుండిన మేచయయొక్క దౌహిత్రుఁడు, రుద్రమదేవియొక్క దీర్ఘ పరిపాలనా కాలమునుదాటి రెండవ ప్రతాపరుద్రునివద్దనె సైన్యాధికారిగా నుండెనని చెప్పుట అసహజముగాఁ గనబడుచున్నది. అందుచేత గన్నయ కొల్చిన ప్రతాపరుద్రుడెవఁడో కనుఁగొనవలసియున్నది.

రెండవ ప్రతాపరుద్రునికి (1295—1323) ప్రతాపరుద్రీయమను సంస్కృతగ్రంథ మంకితమీయబడినది. దానిలో గణపతిదేవునకు రుద్రాంబ యనెడి కూతురున్నదనియు, అతడు ఆమెను పురుష వేషము ధరింపజేసి, సింహాసనమున గూర్చుండబెట్టి, రుద్రదేవమహారాజు అని పేరు పెట్టెననియు వివరముగా వ్రాసియున్నాడు. అంతియేకాక, ఆమెకు నుమ్మడమ్మ యను బాలికనిచ్చి పెండ్లి తంతు కూడ జరిపినారట! రుద్రాంబ లేక రుద్రదేవుఁడు గణపతిదేవుఁడు జీవించియున్నప్పుడే, అతనితోఁ గలసి పరిపాలన చేసినట్లుగా శాసనములనుండి తెలియుచున్నది.1253 నాటిదైన [9]జిలాలపురశాసనములో రుద్రాంబయె రుద్రదేవుడను పేరితో రాజ్యము చేయుచున్నట్లు విశదమగుచున్నది. ఆనాటి సామంతులలోనొకఁడగు మల్యాల గుండ దండాధిపుఁడు 1259లో వేయించిన బూదపూరు శాసనములో "శ్రీమన్మహామండలేశ్వర రుద్రదేవ మహారాజులు ఒరంగల్లు మొదలి పట్టణముగా సుఖసంకథా వినోదంబుం బృథ్వీరాజ్యము సేయుచుండ" అని తెలిపినాడు. రుద్రాంబకు

8. ఆంధ్రేతిహాస పరిశోధక మండలి వారి సం. 3, భాగ 2, 3, 4, పుట 117.

9. ఆంధ్రేతిహాస పరిశోధక మండలి వారి సం. 7 భాగము 2 పుట 121.

నిజముగా వివాహమయినట్లుగా 1259 నాటి[10] జుత్తిగ శాసనమునుండి గ్రహింపవచ్చును. ఆమె భర్త పేరు చాళుక్య వీరభద్రుఁడు. అయినను గూడ నామె పురుష నామముతోనే వ్యవహరింపఁబడుచుండెను. గణపతిదేవుని యనంతరము ఆమె 1260లో సింహాసన మెక్కెను. ఆమె సైన్యాధ్యక్షుఁడైన త్రిపురాంతక దేవ మహారాజా తాను వేయించిన[11] ఒక శాసనములో రుద్రాంబను పురుషనామముననె—"రుద్రదేవ మహారాజ చరణ నళిన యుగళ సమారాధనుడ" అని తెలుపుకొన్నాడు. 1290 నాటిదైన నిశ్శంక ఇమ్మడి మల్లికార్జునుని శాసనములో కాకతి రుద్రాంబ గణపతి దేవుని పుత్రుడుగా వర్ణింపబడినది.

అట్లు రెండవ ప్రతాపరుద్రునకు (1295—1323)పూర్వము రుద్రాంబయె రుద్రదేవ మహారాజను పేరున పిలువఁబడెను రుద్ర శబ్దమునకు ప్రతాప పదమును జేర్చుటలో వింత ఏమియులేదు. మొదటి రుద్రదేవునకుఁగూడ నట్టి విశేషణమును జేర్చి వాడిన పట్టులు గలవు. మార్కండేయ పురాణములోఁ బ్రతాప రుద్రదేవ, రుద్రదేవ అను పేర్లు రెండును గనఁబడుచున్నవి కదా! కాబట్టి దానిలోఁ జెప్పఁబడిన నామము రుద్రాంబదెకాని యన్యులదికాదు. విద్యానాథుని ప్రతాపరుద్రీయములో రుద్రాంబ పురుషనామముతో బేర్కొనఁబడినట్లె మార్కండేయ పురాణములో కూడను. అందుచేత నాగయ గన్నయ రుద్రాంబ వద్దనె సైన్యాధిపతిగా నుండెనని నిశ్చయింపవచ్చును.

ఇక్కడ మరియొక విశేషము. మారయకవి గణపతి దేవుని కాలములో మేచయ నాయకుఁడు తలవరిగా నుండెనని చెప్పినాడు. అతని యల్లుడు 'నాగచమూవిభుఁడు' కదా! మామయల్లుళ్లు ఏక కాలమున నున్నారనవచ్చును. కాఁబట్టి యతడు కూడ గణపతిదేవుని కాలములోనే ఉన్నాడని గ్రహింపవచ్చును. మారనకవి గణపతిదేవుని కాలమును గురించి చెప్పిన పిమ్మట ప్రతాపరుద్రుని గురించి చెప్పినాడు. ఆ ప్రతాప రుద్రుడె రెండవప్రతాపరుద్రుఁడైన పక్షమున్న, గణపతి దేవునికిఁ బిమ్మట ముప్పదియైదు సంవత్సరముల దీర్ఘకాలము రాజ్యము చేసిన రుద్రాంబ (రుద్రదేవ మహారాజు) విషయమేమైనది? కవి పెద్ద కప్పదాటు వేసినాడా? రుద్రాంబ పరిపాలన హారలకు సరిపడ లేదా? కాఁబట్టి ప్రతాపరుద్రుఁడను పేరున మారన కవి రుద్రమదేవినిఁ బేర్కొన్నాడని చెప్పుకొనుట బహు సమంజసము. అందుచేత మేచయ నాయకుఁడును వాని యల్లుఁడు నాగయయును, గణపతిదేవుని కాలములోఁ బ్రఖ్యాతి వహింపగా, మనుమఁడైన గన్నయ, రుద్రాంబ కాలములోఁ బేరుపొందినాడు. మారనకవి పేర్కొన్న ప్రతాపరుద్రుఁడు రుద్రాంబయె.

గన్నయ పుట్టుక గణపతిదేవుని యాఖరి రాజ్య సంవత్సరమైన 1260 యని గ్రహింపవచ్చును. గన్నయ వయస్సును నిర్ణయించుటకు నితర సాధన లున్నవా?

మార్కండేయ పురాణములో గన్నయ వంశ వృక్షము వర్ణింపఁబడినది కదా! నాగయకు మేచయ తన కుమార్తె నిచ్చి పెండ్లి చేసెనని చెప్పి, వారి సంతానమైన ముగ్గురను వర్ణించెను. ఆ ముగ్గురి లోను పెద్దవాఁడు గన్నయ. అతడు వట్టి సైన్యాధిపతి గానె వర్ణింపఁబడినాడు కాని వివాహితుఁడని చెప్పఁబడ లేదు. కాఁబట్టి మార్కండేయ పురాణమును గృతి నందు సరికి గన్నయ కింకను బెండ్లి కాలేదని చెప్ప గలమా? అట్టిది సాధ్యముకాదు. కవులు తాము అంకితమిచ్చిన వారి వంశవృక్షమును దెలుపుచు, కృతి పతి యొక్క భార్యను, బిడ్డలను దెలిపినవారు దెలిపిరి, లేనివారులేదు. కేతనకవి యొక్క గ్రంథమును అంకితము బొందునప్పటికిఁ దిక్కనకు యేబది సంవత్సరముల ప్రాయమైన నుండును. కాని యతనికి వివాహమైనట్లుకాని, బిడ్డలున్నట్లుకాని కేతన వ్రాయ లేదు. అంతమాత్రము చేత తిక్కనను ఆనాటి కింకను వివాహమైన కాలేదనుట అజ్ఞానము కదా! కాఁబట్టి కృతిపతి యొక్క భార్యాపుత్రులను వర్ణించిన వారు వర్ణించినారు, లేనివారు లేదు. అది కాలనిర్ణయమున కాధారమని పూర్తిగా భావింపరాదు.

మారయకవి తిక్కనసోమయాజికి తన యిరువదియవ యేట శిష్యుఁడుకాగా, 1290కి అతఁడు ఏబది సంవత్సరములవాఁడై యుండును. 1210 లో జన్మించినాడనబడెడు తిక్కన మహాకవి 1290 వఱకు

---

10. A. R. 343 of 1921 (ఆంధ్ర కవి తరంగిణి సం 3 పుట 42.)

11. (1) కాకతీయాంధ్రయుగరాజచరిత్ర సం 5 పుట 498.

(2) నిశంక ఇమ్మడి మల్లికార్జునుని శాసనం (భారతి మార్చి 1959 పుట 18.)

జీవించియున్నచో ఏనుబది సంవత్సరములవాడై పెట్లు పండువలె నుండును. కాని తిక్కన నిర్యాణమును గుఱించి సాంప్రదాయికముగా వచ్చుచున్న పద్య మిట్లున్నది—

క. అంబర రవి శశి శాకా
బ్దంబులు చనఁ[12] గాళయుక్తి భద్రపదపు మా
సంబున సంబరమణి బిం
బంబనఁ దగు తిక్కయజ్వ బ్రహ్మముఁ జేరెన్.

దాని ప్రకారము కవిబ్రహ్మ క్రీ. శ. 1288 (శా. శ. 1210)నాడు నిర్యాణము చెందెనని చెప్పవలసియున్నది. అదియె నిజము కావచ్చును. కాబట్టి యాతఁడు సరిగా డెబ్బది యెనిమిది సంవత్సరములు మాత్రమె జీవించియుండును.

అయితే మార్కండేయ పురాణరచనా కాలము నాటికి తిక్కన మహాపురుషుడు జీవించియుండెనాయను ప్రశ్నకు సమాధానము లభించునేమో చూచెదము. మారనకవి తిక్కనకు శిష్యుఁడె. కాని యాకవి తన గురువును పేరు పద్యమున వ్రాసి చెప్పుకొనక, తన గ్రంథము యొక్క గద్యలో మాత్రమె పేర్కొన్నాడు. అయితే కవి స్తుతిలో నన్నయభట్టుకి పిమ్మట స్మరించినాడు. దానిలో "సంతత త్రిభువన కీర్తనీయ యశుఁడు"ని తెలియజేసినాడు. ఆ పదసంపుటినిఁ బట్టి మార్కండేయ పురాణరచనా కాలము నాటికి తిక్కన కవి కీర్తిశేషుఁడయ్యెనని చెప్పదగియున్నది. ఆ గ్రంథ రచన 1288 కి పిమ్మట జరిగియుండును. అయితే రుద్రాంబ పరిపాలన 1290 కి ముగిసినది. ఆ పుస్తకము ఆమె పరిపాలనా కాలములోనె వ్రాయఁబడినది. కావున మార్కండేయ పురాణము 1288—90 మధ్యకాలమున సృష్టింపఁబడినదని నిర్ణయింపవచ్చును.

ఇక్కడ మరియొక చిన్న సమస్యను విచారింప వలసి యున్నది.

1323 లో కాకతీయ సామ్రాజ్యము నాశన మైపోయినది. రెండవ ప్రతాపరుద్రుఁడు శత్రువుల చేజిక్కినాడు. అతడే కాక అతని సైన్యాధిపతులు కొందఱు కూడ పట్టుబడినారు. వారిలో[18] నాగయ గన్నయ యను వాఁడొకఁడున్నాడు. అతని చరిత్ర మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతల నుండి తెలియుచున్నది. ఆ గన్నయ మహమ్మదీయ మతమును స్వీకరించినాడు. మల్లిక్ మక్బూల్ అను పేరును పెట్టుకొన్నాడు. పిమ్మట ఓరుగంటిని పాలించుటకు ఢిల్లీ సుల్తాను చేతఁ

కాని యది సాధ్యముకాలేదు. ఇతర స్థలములలోఁ బరిపాలించి 1372—73 లో మరణించినాడు..... 1260 ప్రాంతములో జన్మించి, పిమ్మట మారనకవి నుండి మార్కండేయ పురాణమునుఁ గృతిఁగొనిన నాగయ గన్నయయే నా మతమును మార్చుకొన్నవాఁడు? అతఁడే యైన పక్షమున, నాగయ గన్నయ 1260 లో జన్మించి 1372 లో అనగా నూటపన్నెండవ యేట మరణించెనని చెప్పవలసియున్నది. అది బొత్తిగా అసంభవము. దానిని సంభవముగా జేయుటకు తల క్రిందులు లెక్కలను వేయవచ్చును. అంతట నదియె అసంభవమని రుజువగును. కాబట్టి వారిద్దఱును వేర్వేరు పురుషులని నిర్ణయించుట మేలు. ఈ రెండవ నాగయ గన్నయ యొక్క పుట్టువు మనకు తెలియదు.

మారన మహాకవి డెబ్బది సంవత్సరముల వఱకు జీవించియుండవచ్చును. అప్పటికి నతని జీవితము 1240 నుండి 1310 వఱకు యుండును. అట్లు రుద్రాంబకుఁ బిమ్మట రెండవప్రతాపరుద్రుని కాలములో గూడ మారనకవి యుండుట కవకాశ మున్నది. అయితే అతఁడు పేరు ప్రఖ్యాతుల కొఱకు లాపత్రయ పడిన వ్యక్తిగాఁగనఁబడడు. ఆనాటి చరిత్ర కొంతవఱకు ఏకామ్రనాథుని ప్రతాపచరిత్ర నుండి తెలియు చున్నది. అందు మారన పేరు గానరాదు. అతఁడు చక్రవర్తినిగాక, యతని సిబ్బంది నాశ్రయించి కాలము వెళ్లబుచ్చినాడని మనము భావింపవచ్చును.

12. శా. శ. 1210 కాళయుక్తి గాక సర్వధారి యగుచున్నది. కాళయుక్తి పదము నెత్తివేసి సర్వధారిని చేసుకొన్నను పద్యలక్షణమునకు బాధలేదు.

13. భారతి, బహుధాన్య మాఘమాస సంచిక (ఆంధ్ర కవి తరంగిణి సం 3, పుట 169.)

నాటిక:

# "ఆపదలో అబల"

శ్రీ రంగధామ్

## పాత్రలు:

| | |
|---|---|
| నరసింహం | ఇంటి యజమాని. వయస్సు ఏభై అయిదు. |
| రమణరావు | గదిలో అద్దెకున్న విద్యార్థి. వయస్సు ఇరవై రెండు. |
| శర్మ | విద్యార్థి. |
| వేణు | విద్యార్థి. |
| మన్యం | విద్యార్థి. |
| సుబ్బారావు | నరసింహంగారి మేనల్లుడు. ఇంజినీరు. |
| దీక్షితులు— | వయస్సు అరవై లోపు. నరసింహంగారి చుట్టం. |
| కమల | నరసింహంగారిఅమ్మాయి. వయస్సు ఇరవై. |

### మొదటి రంగం

[తెర ఎత్తగానే కన్పించేది వరండా. దానికి కుడివైపు మొదట్లో రమణరావు గది వుందన్నమాట. కుడివైపే వీధి వుంటుంది. ఎడంవైపు ఇంటివారిల్లు. స్టేజి మీదకు రమణరావు గది తలుపు మాత్రమే కన్పిస్తుంది. నాటకమంతా వరండాలోనే జరుగుతుంది. బయటి నుండి వచ్చేవారు కుడివైపు నుంచి వస్తారు నరసింహంగారు. కోటుజేబులో చేతులు పెట్టుకొని వరండాలో పచార్లు చేస్తూంటారు. శర్మ ప్రవేశిస్తాడు.)

శర్మ — (నరసింహంగారి నుద్దేశించి) రమణరావు వున్నాడాండి.

నరసింహం — ఎవరూ?

శర్మ — రమణరావు.

నర — నువ్వెవరబ్బాయివి?

శర్మ — వేదాంతం కృష్ణశర్మగా రబ్బాయిని.

నర — అంటే ఆ బ్రహ్మసమాజంలో చేరారూ, ఆయనేనా?

శర్మ — యస్! రమణరావు లేడా?

నర — నువ్వేం చదువుతున్నావు?

శర్మ — బి. ఏ.—నా పేరు రామశర్మ,వయస్సు పద్దెనిమిది. ఇప్పుడప్పుడే పెళ్లి చేసుకోను.మాయిల్లు ఉల్లితోట వీధిలో వుంది. నాకు మేనరికం వుంది. మా అమ్మా నాన్నా అంతా కులాసా. మేము అయిదుగురన్నదమ్ములం.చెల్లెళ్ళు లేరు. (అని గబగబ చెప్పేసి) రమణరావు వెళ్లి ఎంత సేపయిందో చెప్పండి.

నర — అదేమిటి అలా ఏకరువు పెట్టావు.

శర్మ — లేకపోతే మీరు ఒక్కొక్క ప్రశ్న అడగడం, దానికి నేను సమాధానం చెప్పడం చాలా సేపు

పడుతుంది. అందుకని అన్నిసమాధానాలకా
ముందే చెప్పేశాను.

నర — బలేవాడివే. అయితే చూడు, నీతో ఒక చిన్న
పనుంది.

శర్మ — నా దగ్గిర డబ్బుర్లేవు.

నర — ఆహ! అదికాదు.

శర్మ — ఉన్నా మీకు చస్తే అప్పివ్వను.

నర — కుర్రాడివి అంత తొందర పనికిరాదు.

శర్మ — ఎందుకంటే మీకు గనక ఇస్తే మళ్ళీ మీరు
తిరిగి ఇవ్వరు.

(ఎడంవైపు వెనుక నుండి, రమణరావు ప్రవే
శిస్తాడు. గళ్ళలుంగీ; బనీనూ,టర్కీటవలూ, చేతిలో
సబ్బుపెట్టే, నోటిలో సిగరెట్టూ, అప్పుడే స్నానం
చేసి బాత్ రూములోంచి వస్తున్నాడు.)

రమణరావు — హల్లో శర్మా,! ఎంత సేపయిందిరా
వచ్చి?

శర్మ — ఇప్పుడేరా

రమణరావు — ఎంతవరకూ వచ్చాయి ఏర్పాట్లు?

శర్మ — అంతా రెడీ అయిపోయింది. నేను రిక్షాలో
మైకు ఏర్పాటు చేసి వాళ్ళని తిరుగుతూండ
మని చెప్పి ఇలా వచ్చాను. ఇంక మనం 'లేడీ
స్టూడెంట్సు' దగ్గిరికి వెళ్ళడమే తరువాయి.

రమణరావు — వాళ్ళు చెప్పవలసిన విషయాలన్నీ
రాసిచ్చావా?

శర్మ — ఓ, బ్రహ్మాండంగా రాసిచ్చాను.

రమణరావు — ఏయే వీధుల్లో తిరగాలో చెప్పావా?

శర్మ — ఆ!

రమణరావు — కృష్ణారావు పార్టీ వాళ్ళేమంటున్నారు?

శర్మ — మన 'ప్రాపగాండా స్టంట్సు' చూసి వాళ్ళు
గాభరా పడిపోతున్నారు. మైకుతో వీధులవెంట
తిప్పి చెప్పించడం 'అయిడియా' చూసి తెల్ల
మొహాలువేసారు.వాళ్ళు కూడా అలాగే చెయ్యా
లనుకుంటున్నారు.

రమణరావు — ఆడపిల్లల ఓట్లన్నీ మనకే వస్తా
యంటావా?

— తప్పకుండా. మన టాయ్‌లెట్‌బాక్సు
అయిడియాకి గుమ్మెత్తిపోరూ.

రమణరావు — అన్నట్టు టాయ్‌లెట్ బాక్సెస్ అన్నీ
వచ్చాయా?

శర్మ — అన్నీ సిద్ధంగా వున్నాయి. ఇక మనం వెళ్ళి
ఇవ్వడమే తరువాయి. ఇంకో గంటవరకూ
వాళ్ళు కాలేజీలో వుంటారు. తరువాత వెళ్ళి
పోతారు.

రమణరావు — ఆ బాక్సెస్‌లో అన్నీ పెట్టారా?

శర్మ — ఓ. మీ అందాన్ని ఇనుమడింప జేసే రేమీ
స్నో, మీ ముఖవర్చస్సును పెంపొందించే లక్సు
టాయ్‌లెట్ సోపు, మీ సౌందర్య భరిత ముఖ
పద్మాల్ని వికసింపజేసే పాండ్సు పౌడరు డబ్బా,
మీ కళ్ళల్లోని కాంతిని ప్రతిబింబించే దర్పణం,
మీ నిగనిగలాడే నల్లని కేశాల్ని సరిదిద్దే
దువ్వెనా అన్నీ గ్రహించి, మీ మృదువైన
హస్తాలతో రమణరావుకు వోటెయ్యండి.
రమణరావుకే ఓటూ, రమణరావుకే ఓటూ,
రమణరావుకే ఓటూ—అని చెప్తాం.

రమణరావు — సరే నేనిప్పుడే వస్తున్నాను డ్రెస్
చేసుకుని.

— త్వరగా రా.

(రమణరావు తన గదిలోకి వెళ్తాడు. శర్మ
జేబులోంచి సిగరెట్టు పెట్టితీసి అందులోంచి ఒక
సిగరెట్టు తీసి ముట్టిస్తాడు. నరసింహంగారు అంత
వరకూ దూరంగా వున్నాయన దగ్గిరికి వస్తాడు.)

శర్మ — నాకు పెద్దవాళ్ళంటే చాలా గౌరవం. అందు
కని వాళ్ళముందరే సిగరెట్టు కాలుస్తాను.
ఎందుకంటే, వాళ్ళముందర కాల్చకుండా వాళ్ళ
వెనకాల కాలుస్తానని తెలిస్తే, 'చూశావా,
మనకి తెలియకుండా వీడు చాలా వెధవ పన్లు
చేస్తున్నాడు' అని బాధపడతారు. అందుకని
వాళ్ళ ఎదురుగానే కాలుస్తాను.

నరసింహం — చూస్తే అంతా ఎలక్షను హడావుడిలా
వుందే.

శర్మ — అవును. రమణరావు కాలేజీ యూనియన్
సెక్రటరీ పదవికి అభ్యర్థిగా నిలబడ్డాడు.

నర — చాలాడబ్బు ఖర్చు పెట్టున్నట్టుందే.

శర్మ — నిస్సందేహంగా. అవతల పోటీదారు కృష్ణారావు
నాన్నకి రెండు సినిమా హాళ్ళున్నాయి. వాడు

కాలేజీ కుర్రాళ్ళందరికి రండు ఉచిత ప్రదర్శన లేర్పాటు చేస్తున్నాడు. మన రమణరావు మేనమామకి ఒక పెద్ద హోటలుంది. అందులో అందరికీ ఉచిత భోజనాలు ఏర్పాటు చేస్తున్నాం.

నర — ఆడపిల్లలకి టాయ్‌లెట్ బాక్సు లిస్తున్నారా?

శర్మ — ఓ! ఎలా వుండదంటారు మన 'ఆయిడియా'?

నర — (కొంచెం ఆలోచించి) నీలో ఒక చిన్నపనుంది.

— మీకో బాక్సిస్మంటారు. లాభంలేదు. అది ఓటు హక్కున్న ఆడపిల్లలకే గాని ఇతరుల కివ్వం. 'నో' 'నో' 'నో', వెరీసారీ!

నర — అది కాదోయ్, అసలది ఎలా వుంటుందో చూద్దామని. ఏమాత్రం ఖరీదుంటుంది?

శర్మ — ఎంతైనా కానివ్వండి. ప్రెజంటు ప్రెజంటే. దాని విలువ ఒక ఓటు మాత్రమే.

నరసింహం — అయినా ఈ ఎలక్షన్లంటే ఓ వేలం వెర్రయిపోయింది. ఆఖరికి కాలేజీల్లోకి కూడా రాజకీయాలు పాకాయి.

శర్మ — సబబే కదండీ. నేటి విద్యార్థులే రేపటి పౌరులు. కాలేజీల్లో రాజకీయాలు నేర్చుకుంటే తర వాత ఎలాగా జీవితంలో అవి పనికొస్తాయి.

నరసింహం — మా రోజుల్లో చదువులో ఫస్టొచ్చిన కుర్రాడే కాలేజీ సెక్రటరీగా వుండేవాడు.

శర్మ — ఛ! ఛ! మరీ అంతఘోరంటండీ? చదువులో ఫస్టొచ్చినవాడు సెక్రటరీగా ఏం పనికొస్తా డండీ.

నర — అంటే నీ వుద్దేశం?

శర్మ — వాడు వట్టి దద్దమ్మ అని.

నర — ఆహా! అయితే చదువులో లాస్టు వచ్చినవాడు గొప్పవాడా?

శర్మ — 'నాచురల్లీ.' అందులో సందేహమేముంది? పరీక్షలు ఫేలయిన కొద్దీ వాడి గొప్పతనం పెరుగుతుంది. అర్హత హెచ్చుతుంది.

నర — దీనినే వితండ వాదన అంటారు.

శర్మ — కాదని మీ చేత ఒప్పిస్తాను.

నర — నేనొప్పుకోను.

శర్మ — సరే కాసుకోండి. ప్రస్తుత విద్యావిధానం వట్టి గుమస్తాలను తయారు చెయ్యడానికే ఉప యోగిస్తోందని పెద్దలంటున్నారు. మీ వుద్దేశం?

నర — అదీ నిజమే.

శర్మ — బి. ఏ. ఫస్టుక్లాసు పాసయినవాడు ఉద్యోగం దొరక్క ఆత్మహత్య చేసుకున్న ఉదంతా లున్నాయి. అవునంటారా?

నర — కావచ్చు.

శర్మ — ప్రస్తుత రాజకీయ నాయకులలో చాలా మంది కాలేజీలలో చదువుకోలేదంటే, కాదం టారా?

నర — అనను. కొంతమంది యం. యల్. ఏ లకూ యం. పీ.లకూ చదువు చాలా తక్కువ అన్న సంగతి నిజమే.

శర్మ — డబ్బు సంపాదించే కేపిటలిస్టులూ, సినిమా స్టారులూ, ఆటగాళ్ళూ వీళ్ళల్లో చాలామంది ఏ నాడూ కాలేజీలో చదువుకొని వాళ్ళేనంటే ఒప్పుకుంటారా?

నర — నిరభ్యంతరంగా.

శర్మ — ఇంక చదువెందుకో చెప్పండి. మీరు సినిమా స్టారు కావాలంటే చదువక్కరలేదు. రాజ కీయ నాయకులు కావాలంటే చదువక్కర లేదు. డబ్బు సంపాదించాలంటే చదువక్కర లేదు. అలాంటప్పుడు కాలేజీ చదువుల్లో ఫస్టు రావడం ఎంత దండుగో మీరే ఆలోచించండి.

నర — నువ్వు చెప్పింది నిజమేగాని చదువు అనవసర మని తెలుసుండి కూడా నువ్వు ఎందుకు చదువు తున్నావు?

శర్మ — ఇందాకే చెప్పేను కదండీ నాకు పెద్దలంటే చాలా గౌరవమని. మానాన్న, 'చదువుకోరా, ఎంత పెద్ద చదువు చదివితే అంత కట్నం ఎక్కువ వస్తుంది' అన్నాడు. ఆయన మాట కొట్టెయ్యలేక చదువుకుంటున్నాను.

(రమణరావు డ్రెస్ చేసుకుని వస్తాడు.)

రమణరావు — ఏమిట్రా ఆ వాదన?

శర్మ — అబ్బే ఏంలేదురా. కాలేజీలు గులకరాళ్ళకు మెరుగు పెడ్తాయనీ, వజ్రాలను కాంతి విహీనం చేస్తాయన్నీ 'ఇంగర్ సాల్' చెప్పిన మాటలే చెప్తున్నాను.

రమణరావు—మావాడు కాలేజీలో 'వెన్ను స్పీకరు.' వక్తృత్వపు పోటీ లన్నిటిలోనూ ఫస్టు ప్రైజు మన వాడిదే.

నర — తెలుస్తూనే వుంది.

రమణరావు — సరే పదరా శర్మా, కాలేజీ కెళ్దాం.

శర్మ — త్వరగా పద. మళ్లీ అమ్మాయిలు వెళ్లి పోతారు.

నర — మిస్టర్ రమణరావు. మీతో ఒక చిన్నపనుంది.

రమణరావు —రూము ఖాళీ చెయ్యడం గురించేనా? ఇంకొక నెలరోజుల్లో తప్పకుండా ఖాళీ చేసేస్తాను. నేను కూడా గదుల కోసం వెదుకుతున్నాను.

నర — ఉబ్బెబ్బే. అదికాదు. మా అమ్మాయి జీతం ఇంకా రాలేదు. అందుకని కొంచెం డబ్బు కావాలి. ఓ ఫైవ్ రూపీసుంటే ఇవ్వండి

రమణరావు — అరే, సారీ! ఇవాళే బాంకులోంచి డబ్బు తీద్దామనుకుని మర్చిపోయాను. అయినా ఇప్పటికే ఒకనెల అద్దె అడ్వాన్సు ఇచ్చినట్లున్నాను.

నర — అవును. ఇచ్చారు. ఇది కేవలం చేబదులుగా ఇవ్వండి. మళ్లీ ఇచ్చేస్తాను.

రమ — చేబదులుగా మొన్న ఒక అయిదు రూపాయలు తీసుకున్నట్లున్నారు.

నర — అదీ, ఇదీ కలిపి ఇచ్చేస్తాను.

రమ — రేపు చూస్తాను. ఇవాళ నాదగ్గర ఎక్కువ లేదు.

నర — ఇవాళే కొంచెం అవసరం వచ్చింది. ఎలాగైనా సర్దుబాటు చెయ్యాలి.

రమ — లాభంలేదు. వస్తా. (అని శర్మ రమణరావు బయటికి వెళ్లిపోతారు.)

నరసింహం — (కోపంగా) అయిదు రూపాయలిమ్మంటే లేదం గాడా పెద్దమనిషి! నేనేం ఎగ్గొట్టాలనుకుంటున్నాడా? ముప్ఫై రూపాయలికి ఇంత మంచి గది ఎవడద్దెకిస్తాడు? ఆ విశ్వాసమైనా లేదు. ముష్టి అయిదు రూపాయలు ఇవ్వడానికి బాంకులోంచి తియ్యాలట. హు!

(కమల ప్రవేశిస్తుంది. అప్పుడే ఆఫీసునుంచి వస్తుంది. చేతిలో ఒక చిన్నసంచీ, అందులో ఒక టిఫిన్ కారియరూ వుంటాయి. రెండు జడలు వేసుకుని, చెవులకి రింగులు పెట్టుకుంటుంది. ఎత్తు మడమలు కనిపించే జోళ్లు వేసుకుంటుంది.)

కమల—అమ్మ దగ్గర్నుంచి ఏమైనా ఉత్తరం వచ్చిందా? నాన్నా?

నర — లేదు.

కమల — అబ్బ! ఇంకా ఎప్పుడొస్తుందో బాబూ నాకు విసుగెత్తిపోతోంది.

నర — వెళ్లిన పని అవద్దూటమ్మా. మీ అక్కయ్యకు పురుడు రావాలా? ఆ తర్వాతగాని రావటానికి వీలులేదు.

కమల—ఇక్కడ ఈ చికాకులన్నీ ఎవరు పడతారు? ఇవాళ ఆఫీసులో ఎంత పని చెయ్యాలిసి వచ్చిందో మీకేం తెలుసు. నాలుగుగంటలు ఆపకుండా టైపు చెయ్యాల్సి వచ్చింది.

నర — నాలుగుగంటలే! అయ్యో, పాపం! అన్నట్లు కాఫీ కాచి ఫ్లాస్కులో పోశాను. వెళ్లి తాగు. వెళ్లు.

కమల — ముందర ఒంటిమీద నీళ్లు పోసుకుంటేనేగాని తోచటంలేదు.

నర — నువ్వు గబగబ మొహం కడుక్కునిరా. నేను కాఫీ కప్పులో పోసిస్తాను.

(కమల బాత్‌రూమ్ వైపు వెళ్తుంది. నరసింహం గారు ఇంట్లోకి వెళ్లి ఫ్లాస్కు తెస్తాడు. కమల వెంటనే తిరిగి వస్తుంది. కోపంగా వుంటుంది. ఆవేశంతో మాట్లాడుతుంది.)

కమల — మళ్లీ ఆ స్టూడెంటుగారు స్నానం చేశారా?

నర — ఆ!

కమల — బాతురూములో ఒక్క నీళ్ళచుక్క లేకుండా చేశాడు. ట్యాంకునిండా నీళ్లు పెట్టి వెళ్లాను. ఇంత దురన్యాయం ఎక్కడైనా వుంటుందా?

నర — ఆ. ఒక్కచుక్క కూడా లేవూ. అయితే అన్ని నీళ్లూ పోసేసుకున్నా డన్నమాట.

కమల — ఛీ! ఛీ! వాడు మనిషా? పశువా? అక్కడ పూద్దామంటే చెంబుకూడాలేదు. అది తీసు కెళ్లి రూములో పెట్టుకున్నాడు కాబోలు.

నర — కనుక్కుంటానుండు.

కమల — కనుక్కోవడమేమిటి, నా మొహం. ఇంట్లోంచి వెళ్లగొట్టక. నామాట వింటారా. నే నెన్నిసార్లు చెప్పాను వాణ్ణి పొమ్మనండి అని.

నర — అతనూ కాళీ చేసేస్తానంటున్నాడు.

కమల— ఇంకా ఎన్నిరోజులు? ప్రొద్దున్నే నా కన్నా ముందు లేచి బాతురూములోకివెళ్లి తలుపులు వేసుకు కూచుంటాడు. గంటసేపు స్నానం చేస్తాడు. కొళాయిలు కట్టేస్తారని చచ్చీ చెడీ డ్రమ్మునిండా నీళ్లు పట్టి వుంచితే వాటిని దర్జాగా వాడేస్తాడు.

నర — అలా వీల్లేదని చెప్తాను.

కమల — స్నేహితు లందర్నీ పోగుజేసి, వరండాలో బాతాఖానీ. ఆ సిగరెట్ల పొగకంపుకో చస్తున్నాను. పైగా ఈ ఇంట్లో ఆడవాళ్లు అటూ ఇటూ ఎలా మెసులు తారా? అనే జ్ఞానం కూడా లేదు.

నర — ఆ స్నేహితులు రావడానికి వీల్లేదని చెప్పేస్తాను.

కమల — మీకేం మీరు దర్జాగానే వుంటారు. మధ్య చచ్చేది నేను. ఏమైనా సరే వెంటనే అతణ్ణి కాళీ చేయించండి. లేకపోతే నేనీ ఇంట్లో వుండలేను.

నర — ఇదిగో ఇప్పుడే చెప్పేస్తాను. రేపు ప్రొద్దున్నే కాళీ చెయ్యమని చెప్పేస్తాను.

కమల — ఏం ఇవాళ ఖాళీ చేసెయ్య మనకూడదా?

నర — ఇప్పటికిప్పుడు ఎలా చేస్తాడు?

కమల — ఎందుకు చెయ్యలేడూ. మహరాజులా చేస్తాడు. ఏ స్నేహితుడి రూములోనైనా చేరతాడు.

నర — సరే అయితే అలాగే చెయ్యమని చెప్తాను.

కమల — అతన్ని కాళీ చేయించకపోతే నేనూరుకోను. ఎవతె భరిస్తుంది ఈ చికాకులు. పెద్ద జమిందారునని డాబులు కొట్టాడు. ఆఖరికి చెంబు కొనుక్కోడానికి కూడా దిక్కులేదు.

నర — అతని చేత నేను ఖాళీ చేయిస్తానుగాని నువ్వో కాఫీ తాగు.

కమల — (కాఫీ త్రాగి) ఇప్పుడే కుంపటి మీద ఎసర పడేసి వస్తాను. (అని లోపలికి వెళ్తుంది)

నర — మీ అమ్మని వెంటనే రమ్మని రాసేస్తాను. కావాలంటే మళ్లీ వెళ్లవచ్చు. అయినా నేరక పోయి అద్దెకిచ్చాను. బుద్ధొచ్చింది. ఇంకెప్పుడూ ఎవరికీ ఇవ్వను.

కమల — (ప్రవేశించి) అగ్గిపెట్టె తీశారా?

నర — అగ్గిపెట్టా? ఇందాకా రమణరావు కిచ్చినట్లు జ్ఞాపకం.

కమల — (రౌద్రాకారంతో) నేనెన్నిసార్లు చెప్పాను అతనికి అగ్గిపెట్టె ఇవ్వద్దని. ఆ మానవుడు మనవి ఎన్ని అగ్గిపెట్టెలు కాజేసాడో లెక్క లేదు.

నర — అబ్బే! ఒకసారి ఇమ్మంటే ఇచ్చా. మళ్లీ ఇవ్వడం మర్చిపోయాడు.

కమల — ఇహ నా వల్లకాదు బాబూ. అతను వెంటనే ఖాళీ చేసి తీరాల్సిందే. మన అగ్గిపెట్టెలన్నీ అతనికీ అతని స్నేహితుల సిగరెట్లకీ అయి పోతున్నాయి.

నర — అంత మతిమరుపేమిటి? తీసుకున్న వస్తువు ఇచ్చెయ్యొద్దూ.

కమల — అసలు మీ రెందుకివ్వాలి? ఇప్పుడు మన గతేంకాను? మళ్లీ కొట్టుకెళ్లి

నర — నే తెస్తాలే.

కమల — మీరు తెచ్చినా సరే, నే నివాళ వంట చెయ్యను. అతనాగదిలోంచి ఖాళీ చేసేదాకా నేను కుంపటి వెలిగించను.

నర అక్కర్లేదు. నేను తప్పకుండా అతన్ని ఖాళీ చేయిస్తాగా.

కమల ఆమాట మీరిదివరకు ఎన్నిసార్లన్నారు. మళ్లీ అతని దగ్గరికివెళ్లి మాట్లాడగానే మారిపోతారు.

నర — ఈ సారి ఏమైనా సరే, అతన్ని ఖాళీ చేయించి తీరుతాను.

కమల - అమ్మో గనక ఇప్పుడుంటే మూడు నిముషాల్లో ఖాళీ చేయించేది.

నర — నేనూ చేయిస్తాగా.

కమల — ఛీ! ఛీ! తల్చుకుంటే ఏడుపొస్తోంది. ఇంట్లో ఉండలేకపోతున్నాం. ఏదో మర్యాదస్థుడు కదా అని అద్దెకిస్తే ఆ ఫ్రెండ్సు, ఆ సిగరెట్లూ ఎంత ప్రాణం విసిగించేస్తున్నాడు.

నర — పైగా సాయంకాలం అయిదు రూపాయలిమ్మంటే ఏవేవో కబుర్లు చెప్పాడు.

కమల — (పరీక్షగా చూస్తూ) అతన్ని మీరు అయిదు రూపాయలడిగారా?

నర — (నోరు జారానని గ్రహించి, తప్పించుకుందామన్నట్లు) ఏదో మాటవరస కడిగాను.

కమల — (బాధగా) ఎందుకడిగారూ? అతన్ని అద్దె గొడ్వని చెప్పలేదూ? అందుకే అతనికి మీరంటే అంత అలుసు.

నర — (దబాయింపుగా) అద్దె ఎలాగూ ఇవ్వాలి కాబట్టే అడిగాను. ఏం తప్పా? మనకి రావలసిన డబ్బే అడిగాను. అతనిదేమీ వూరికే ఇమ్మనలేదే.

కమల — (విరక్తిగా) నాకేం తెలియదు. మీగతన్ని వెంటనే ఖాళీ చేయిస్తే సరేసరి, లేకపోతే నేను ఆఫీసుకు సెలవు పెట్టి, అమ్మ దగ్గరికి వెళ్ళిపోతాను. (అటు ప్రక్కగా తిరిగి ఏడుపు స్వరంతో) మీరు నా మాట వినరు. (అని జేబు రుమాలుతో ముక్కు గుడుచుకుంటుంది.)

నర — (కమల దగ్గరికి వెళ్ళి) ఛ! నువ్వు అంత బాధపడక్కరలేదు. అతను రాగానే, ఇప్పుడే ఇవాళే ఖాళీ చేయించేస్తాను. చెయ్యనంటే సామానంతా వీధిలో పారేస్తాను.

కమల — నా మీద ఒట్టేనా? (దీనంగా అతని వైపు చూస్తుంది.)

నర — ఆ! ఒట్టే నా మాట నమ్ము.

కమల — సరే. (అని కళ్ళు తుడుచుకొని లోపలికి వెడుతుంది.)

(నరసింహంగారు ఆలోచిస్తూ నిల్చుంటాడు. రమణరావూ, శర్మా వీధిలోంచి వచ్చి, రూములోకి వెడతారు. రమణరావును చూడగానే నరసింహంగారు గతుక్కుమంటారు. ఆయన అటు చూస్తూంటే కమల మళ్ళీ ప్రవేశిస్తుంది.)

కమల — (మెల్లిగా) నాన్నా అతను వచ్చినట్లుంది.

నర — అవును. ఇదిగో ఇప్పుడే వెళ్తా.

కమల — (రహస్యంగా, కసిగా) వెంటనే ఖాళీ చేసెయ్యమనండి వెంటనే, వెంటనే.

నరసింహం — (రమణరావు గది వద్దకు వెళ్ళి) ఇదిగో మిస్టర్ రమణరావు ఇలా ఒకసారి రండి.

రమణరావు — (లోపల్నుంచి వచ్చి) ఏమిటి?

నర — మీరు వెంటనే మా గది ఖాళీ చెయ్యాలి.

రమణరావు — ఓ, అదా! తర్వాత మాట్లాడుదాం. కొంచెం బిజీగా వున్నాను. (అని లోపలికి పోబోతాడు.)

నర — ఏమండోయ్! అలా అంటే కుదరదు. తక్షణం మీరీ గది ఖాళీ చెయ్యాలి. మాట వినిపించుకోకుండా అలా వెళ్ళిపోతారేమిటి?

రమణరావు — (ఆగి, తెల్లబోయినట్లు చూస్తాడు) ఏమిటంటారూ?

నర — అదేనండీ. గది విషయం.

రమ — ఇందాకా చెప్పాను కదండీ, కొద్దిరోజులు ఓపిక పట్టమని.

నర — అలా వీల్లేదు. ఏమైనా సరే ఇప్పుడే ఖాళీ చెయ్యాలి.

రమ — ఇప్పుడా?

నర — అవును. ఈ క్షణంలో.

రమ — (నరసింహం వైపు తీక్షణంగా చూస్తాడు) అది కుదరదు.

నర — ఎందుకు కుదరదూ? చెయ్యాల్సిందే.

రమ — నేను చెయ్యను.

నర — చేసి తీరాలి.

రమ — నేను చెయ్యనూ, చెయ్యదల్చుకోలేదు.

నర — చెయ్యకపోతే, చేయిస్తాను.

రమ — (కోపంగా) మీరేం చేస్తారో చేసుకోండి.

నర — ఏంచేస్తానా? సామాన్లన్నీ వీధిలో పారేస్తాను.

రమ — (మరీ కోపంగా) పారెయ్యండి చూస్తాను. నా సంగతి ఇంకా మీకు తెలియదు. మర్యాదగా వూరుకున్నంత సేపే మంచివాణ్ణి. మర్యాదా తప్పితే నా అంత చెడ్డవాడు ఈ వూరు మొత్తంమీద లేడు.

నర — ఏం? నన్ను కొట్తావా?

రమ — కొట్టడంలో ఇలా అలాగాదు. నల్ని నున్నం లోకి ఎముకలు లేకుండా విరగ్గొడలాను.

కమల — (వెనకాల నుంచి భయంగా) నాన్నా!

నర — (వినిపించుకోకుండా) జడిపిద్దా మనుకుంటున్నావా?

రమణరావు — నేను జడిసించే మనిషినికాను. మీరివవ సరంగా నా జోలికి రావద్దని చెప్తున్నాను. ఇంతకుముందు మీరు మర్యాదగా అడిగారు కాబట్టి, కొన్ని రోజుల్లో ఖాళీ చేస్తానన్నాను. ఇప్పుడు నన్ను అవమానించారు కాబట్టి అసలు ఖాళీ చెయ్యనని చెప్తున్నాను.

నరసింహం — ఎందుకు చెయ్యరు? ఇదేం మీ బాబుగారి ఇల్లు, ఇష్టం వచ్చినట్లు స్నేహితులతో చేరి నానాగొడవా చెయ్యటానికి.

రమ — ఏమండోయ్! నన్నంటే ఊరుకుంటానుగాని నా ఫ్రెండ్సు నేమైనా అంటే వూరుకోను.

నర — ఏదో పెద్దమనిషివి కదా అని ఇల్లిచ్చాను. ఇలాటి రౌడీవని తెలుస్తే ఇల్లివ్వక పోదును.

రమణరావు — ఎవరికి కావాలండీ మీ బొక్కి ఇల్లు. వర్షం పడితే గదినిండా నీరే. అల్మారు తలుపులూ, కిటికీ తలుపులూ నేను వేయించాను. గచ్చు నా డబ్బుతో బాగు చేయించాను. ఆ డబ్బంతా మీ దగ్గర వసూలు చేశాకగాని ఖాళీ చెయ్యను.

నర — అదంతా నిన్నెవడు చెయ్యమన్నాడు. నేను దమ్మిడీ ఇవ్వను.

రమ — అయితే నా కవసరంలేకపోయినాసరే శాశ్వతంగా ఈ గదిని నా క్రిందే వుంచేసుకుంటాను.

నర — నేను పోలీసు రిపోర్టు ఇస్తాను.

రమ — ఇవ్వండి ఇన్‌స్పెక్టరుగారు నాకు బాగా పరిచితులే.

నర — అదా, నీ ధైర్యం! అసలు ఈ వీధిలోని పెద్ద మనుష్యుల్నందర్నీ పిలిపించి నువ్వు చేస్తున్న అల్లరంతా చూపిస్తాను. వాళ్లే నీ మెడ బట్టి గెంటేస్తారు.

రమ — అసలు మీరంటే ఈ వీధిలో ఒక్కరికైనా గౌరవం వుందా? అందరూ, మీ కక్కుర్తి గుణాలకి మిమ్మల్ని తిట్టేవాళ్లేనే. అలాటిది మీరు పిలుస్తే ఎవరొస్తారండీ?

నర — ఆహా! నీలాంటి రౌడీ పిలిస్తే వస్తార్రా?, నువ్వంటే అందరికీ గౌరవ మనుకుంటున్నావా? నువ్వూ నీ ఫ్రెండ్సు చేసే అల్లరికి ఆడపిల్లల తలిదండ్రులు ఎంత ఘోషిస్తున్నారో తెలుసా?

రమ — అబద్ధాలాడకండి, మేము కావాలని ఏడ్పించామని ఒక్క ఆడపిల్ల చేత అనిపించండి, చూద్దాం. నేనుగాని, నా ఫ్రెండ్సుగాని ఎవరైనా ఏ మాటైనా అన్న వారెవరూ లేరు.

నర — అదంతా నా కనవసరం. గది వెంటనే ఖాళీ చెయ్యాల్సిందే!

రమ — మీరు వెంటనే నోరుముయ్యాల్సిందే!

నర — నేను తల్చుకుంటే ఏమైనా చెయ్యగలను!

రమ — నేను తల్చుకోకుండానే చెయ్యవలసింది చేస్తాను!

నర — సరే చూసుకో!

రమ — మరే కాసుకోండి!

నర — తర్వాత నువ్వే విచారిస్తావు!

రమ — ముందే మీరు విచారించండి.

నర — అయితే ఖాళీ చెయ్యనన్న మాట.

రమ — ఇప్పటికి నిజం తెలుసుకున్నారన్న మాట (అని గదిలోకి వెళ్లిపోతాడు).

(నరసింహం కోపంగా చూసి, కమల దగ్గరికి వెడతాడు).

నర — నేనూ కనుక్కుంటాను వీడి సంగతేమిటో.

కమల — (నీరసంగా) అయితే ఖాళీ చెయ్యమంటే కొట్టడానికి వస్తున్నాడన్నమాట. నేను అతనికి ఇవ్వద్దని మొత్తుకుంటూనేవున్నాను. మీరూ, అమ్మా, చాలా తొందరపడిపోయారు.

నర — అయిపోయిందానికేం చేస్తాం. నే నిప్పుడే వెళ్లి మన భూషణంగారితో విషయమంతా చెప్పి వస్తాను.

కమల — ఏమో మీ యిష్టం. ఎలాగైనా అతన్ని ఖాళీ చేయిస్తేనేగాని మనం వూరుకోకూడదు. ఇంతవరకూ వచ్చాక ఇహ తగ్గకూడదు.

నర — అదెలా కుదురుతుంది. దీని అంతేదో నేనహా కనుక్కుంటాను. (అని నరసింహం వీధిలోకి వెళ్లాడు. కమల ఇంట్లోకి వెళ్తోంది. రమణా రావూ, శర్మ బయటికి వస్తారు.)

ఒరేయి. నీ కంత ఇబ్బంది కలిగితే మా యింటికివచ్చేయి. అనవసరంగా ముసలాయనతో తగువెందుకు?

రమణరావు — తగువేమిట్రా? కొద్దిరోజుల్లో ఏలాగ ఖాళీ చేస్తానంటూంటే హఠాత్తుగా వచ్చి ఇప్పుడే ఖాళీ చెయ్యమని కూర్చున్నాడు. నేనెలా చేసా ను.

శర్మ — అసలింతకూ కారణమేమిటట?

(కమల వరండాలోకివచ్చి వీళ్లను చూసి మళ్లీ లోపలికి వెళ్లిపోతుంది.)

రమ — ఏమో.

శర్మ — ఇది అమ్మాయిగారి ప్రోద్బలం అని నా కను మానం. ఆమెకూ నీకూ ఏమైనా తగు వొచ్చిందా?

రమ — లేదురా. అసలు ఆమే నేనూ మాట్లాడుకుని చాలా కాలమైంది.

శర్మ — ముసలాయనకు తనంత తాను ఖాళీ చెయ్య మనేటంత దమ్ములేవు.

రమ — నత్తి కక్కుర్తి రకం. అడిగినప్పుడల్లా రెండో మూడో అప్పిస్తే చాలు.

శర్మ — అమ్మాయి పుట్టుకు తల్లిపోలిక. పురి పిల్ల. అసలు కాంతమ్మ గారంటే వీధి వీధంతా హడలు.

రమ — అయితే ఎందుకు ఖాళీ చెయ్యమంటున్నా రంటావు.

శర్మ — ఇంకెవరైనా ఎక్కువ అద్దె ఇస్తామన్నారేమో.

రమ— ఆ సంగతి చెప్పెయ్యి కూడదూ.

శర్మ— అహ! అలా చెప్తే తాము అద్దె డబ్బులకి కక్కుర్తిపడుతున్నామని లోకం అంటుందని.

రమ — వీళ్లకి తగిన పాఠం చెప్పాలి.

శర్మ — వీళ్ల బెదిరింపులకు మనం జడిసినట్లుండ కూడదు.

రమ — చూస్కో. వీళ్లని నా కాళ్ల బేరానికి రప్పిస్తాను. నా ఫ్రెండ్సూ నేనహా కలిసి అల్లరి చేస్తున్నామంటున్నాడు కదూ. ఇన్నాళ్లూ మర్యాదకి జడిసి వూరుకున్నాను. ఇహ నుండి మనం పూర్తిగా విజృంభించాలి. ఇవాళ రాత్రే ప్రారంభం.

— అంటే అల్లరి చెయ్యడమా?

రమ — అవును. మన 'గాంగు' నంతా వెంటబెట్టుకుని వచ్చేయి. రాత్రి తెల్లవార్లూ భజన ప్రోగ్రాం ఏర్పాటు చేద్దాం.

శర్మ — అలా కాఫీ హోటలుకువెళ్లి టీ ఏర్పాటు కూడా చెయ్యనా?

రమ — అవును, అన్నట్లు అదికూడా వుండాలి.

— సరే వస్తా. (అని బయటికి వెళ్లాడు.)

(రమణరావు కొద్దిసేపు వంటరిగా వరండాలో పచార్లు చేస్తాడు. ఒక యువకుడు చేతిలో హోల్డాలుతో ప్రవేశం. వయస్సు ఇరవై వుంటుంది.)

యువ — హాల్లో! రమణా!

రమణ — హాల్లో, వేణూ ఎప్పుడొచ్చావ్?

వేణు — ఇప్పుడే రైలు దిగి వస్తున్నా.

రమణ — మంచి పని చేశావు. ఇంకా ఎప్పుడొస్తావా? అని ఎదురు చూస్తున్నాను.

వేణు — పరీక్షలు ఇంకా మూడునెలలున్నాయనుకో. అయినా మా వూళ్లో వుంటే చదువు సాగదని వచ్చేశాను. నాకేదైనా రూముచూసి పెట్టలా?

రమ — రూమా? (ఆ సమయంలో వరండాలోకి ఏదో పని మీద కమల ప్రవేశించి వీరిద్దరిని చూస్తుంది.) వేరే రూమెందుకు? నా రూము లోనే వుండు.

(వేణు కమల్ని చూసి చిన్న చిరునవ్వు నవ్వు కుంటాడు తనలో.)

వేణు — ఆ, ఎందుకులా నీ కిబ్బంది!

రమ — ఛ! ఛ! ఇబ్బందేమిటిరా. ఇలాంటి రూము నీకు ఎక్కడా దొరకదనుకో. ఇది చాలా ప్రత్యేక మైన రూము.

వేణు — అంటే?

రమ — అబ్బే, వాన కురిస్తే ఒక్కచినుకు బయటకు పోదు. దేవతలు అమృతవర్షం కురిపిస్తున్నారని

సంతోషించాలి. రాత్రిళ్ళు ఏడుకుంటే ఎంతో అప్యాయంగా ఎలుకలు వచ్చి నీ క్షేమ సమాచారాలు కనుక్కుంటూ వుంటాయి. అంలెందుకు ఈ దోమల సంగీతం తోటీ, ఆ మురుక్కాలువ కంపుతోటీ, తెల్లవార్లూ మేలుకుని చదివి నువ్వు పాసవకపోతే ఎలాటి పందెమైనా ఓడిపోతాను.

(కమల కోపంగా చూసి వెళ్ళిపోతుంది.)

వేణు — (కన్నుగీటుతూ) మంచి ఛాన్సే కొట్టావురా.

రమ — (విరక్తిగా) పోనీరా ఎవడిక్కావాలి?

వేణు — ఏం? అలాటి రకం కాదా?

రమ — (హెచ్చరిస్తూ)ఏడిశావు. చాలా 'రెస్పెక్టబుల్' ఫామిలీ. ఒళ్ళు దగ్గరుంచుకుని ప్రవర్తించు.

వేణు — అల్‌రైట్ బాస్! ఇంతకీ ఇలాంటి రూములో నువ్వే ఇబ్బంది పడ్తూంటే నేను కూడా ఎందుకురా?

రమ — అక్కడే వుంది గమ్మత్తు. ఇంటాయన నన్ను వెంటనే ఖాళీ చెయ్యమన్నాడు. నేను ఖాళీ చెయ్యనన్నాను. ఆయన ఎలాగైనా నా చేత ఖాళీ చేయించాలని చూస్తున్నాడు.

వేణు — ఇంటాయనంటే ఆ అమ్మాయి తండ్రా?

రమ — అవును.

వేణు — ఎందుకు ఖాళీ చెయ్యమంటున్నాడు?

రమ — ఏమో! ఆ విషయం ఆయనకే తెలియాలి.

వేణు — (కొద్దిగా ఆలోచించి) దీన్నిబట్టి చూస్తూంటే నీకూ, ఆయనకూ పడలేదని తెలుస్తోంది.

రమ — సరిగ్గా గ్రహించావు.

వేణు — అందుకే నిన్ను రూము ఖాళీ చెయ్యమంటున్నాడు.

రమ — అవును.

వేణు — నువ్వు ఖాళీ చెయ్యదల్చుకోలేదు. పోనీ అతన్నే ఖాళీ చేసెయ్యమందాం.

రమ — భలే ఐడియా!

వేణు — అవును. సెప్టెంబరు పరీక్షకు చాలమంది మన స్నేహితులు వస్తున్నారు. ఈ రెండు నెలలూ ఆయన్ని వేరే చిన్న యిల్లు తీసుకుని అద్దెకుండమను.

రమ — బాగానే వుంది. ఆ యన ఖాళీ చేస్తాడంటావా?

వేణు — మర్యాదగా చెయ్యమందాం. లేకపోతే మన గోలకు భరించలేక ఆయనే ఖాళీ చేసేట్లు చేద్దాం. నువ్వు 'ఊ' అను. ఆయన్ని ఖాళీ చేయించేస్తాను.

రమ — సరే. కానియ్యి.

వేణు — పద, అలా కాఫీహోటలుకువెళ్ళికాఫీత్రాగొద్దాం.

రమ — నీ హోల్డాలు రూములో పెట్టు.

తన హోల్డాలు రూములో పెట్టాక ఇద్దరూ బయటికి వెడతారు. నరసింహంగారు గబగబ వస్తారు. 'కమలా' అని పిలుస్తారు. కమల లోపల్నుంచి వస్తుంది).

నర — నేను ప్లీడరుగారితో మాట్లాడాను. వెంటనే రిజిష్టరు నోటీసిద్దాం అన్నారు.

కమల— ఏమని?

నర— గది ఖాళీ చెయ్యమని.

కమల— చెయ్యకపోతే.

నర — అప్పుడెలాగా కోర్టుకు వెళ్దాం.

కమల — బాగానే వుంది. ఈలోపల ఇతనితో బోలెడన్ని తగాదాలు పడాలన్నమాట. వెంటనే ఖాళీ చేయించే మార్గమేమీ లేదా?

నర — ఏదైనా కోర్టుకు వెడితేనేగాని లాభంలేదు.

కమల — మనం కోర్టుకు వెళ్లామని తెలుస్తే, మరీ గొడవ ప్రారంభిస్తాడు.

నర — అల్లాటిదేమీ కుదరదు. అంతపెరతూ వచ్చిందంటే న్యూసెన్సు కేసు పెట్టమన్నారు ప్లీడరుగారు.

కమల — పైగానేం ఇందాకెవరో స్నేహితుడు ఊరు నుంచి వచ్చాడు. వాడిని కూడా తనతో పాటు ఈ రూములోనే వుండమంటున్నాడు.

నర — ఎంత సాహసం! వీల్లేదని చెప్పేస్తాను.

కమల — మన మాట విన్పించుకుంటేనా?

నర — మన రూము తను ఇంకొకడికి ఎలా ఇస్తాడూ? అని.

కమల — ఇన్నాళ్లూ కొంచెం పెద్దమనిషి లాగ నటించేవాడు. ఇప్పుడు అసలు రంగు బయట పడింది.

నర — అసలింతవరకూ ఇటువంటి వాడికి అద్దెకివ్వ లేదు. ఈసారి పొరపాటయి పోయింది.

కమల — ఇప్పుడెలా ఖాళీ చేయించడం? నాకు పిచ్చెత్తుతోంది ఈ సమస్యతో.

నర — నాకూ ఏం తోచటంలేదు. మీ అమ్మ వుంటే ఏదో సలహా చెప్పేది.

కమల — అమ్మయితేనా మూడు నిముషాల్లో ఖాళీ చేయించేది.

(వేణు ప్రవేశించి, రమణరావు గది వైపు వెడతాడు).

కమల — (మెల్లిగా) అదుగో. అతనే కొత్తగా వచ్చింది. అతన్ని కూడా తన రూములో వుండ మంటున్నాడు.

నర — అలాగా, ఆ సంగతేమిటో కనుక్కుంటా నుండు. (వేణు దగ్గరికి వెడతాడు) ఆ! ఎవరండీ మీరు, ఈ రూములో వుండమని రమణరావు చెప్పాడట. అదంతా వీల్లేదు.

వేణు — (కొద్ది ఆశ్చర్యంగా ఆయన వైపు చూసి, తలవూపి) మీరేనా ఈ యింటి యజమాని?

నర — అవును.

వేణు — (అతి వినయంగా) నమస్కారం. నా పేరు వేణు అంటారు. నేనీ గదిలో వుంటాననే అభిప్రాయం మీకెలా కలిగింది! నా కటువంటి వుద్దేశం ఎంతమాత్రం లేదే.

నర — ఎందుకంటే రమణరావునే ఖాళీ చెయ్యమని చెబుతున్నాను. అతను మొండిగా కదలటంలేదు.

వేణు — అబ్బే వాడు వట్టి మొండి ఘటం అండీ. పాపం మీరు చూస్తే చాలా పెద్ద మనుష్యుల్లా వున్నారు. మావాడి గురించి మీకంతగా తెలియ దనుకుంటాను.

నర — ఇప్పుడిప్పుడే కొంచెం తెలుస్తోంది. కాని మొదట తెలియదు.

వేణు — ఎక్కడైనా మనవాడి చరిత్ర ఒకలాగే వుందన్న మాట (నిట్టూరుస్తాడు).

నర — అంటే మునుపు కూడా ఇలాగ జరిగిందా?

వేణు — ఆ. వాడింతకు ముందు చదివిన వూళ్లల్లో వాడి చరిత్ర వింటే ఆశ్చర్యపోతారు.

నర — అహా! అంతటి ప్రబుద్ధుడా?

వేణు — బెజవాడ కాలేజీలో డిస్మిస్ చేసినప్పుడు ప్రిన్సిపాలుకి వాళ్ల పినతండ్రి స్నేహితుడు కాబట్టి అంతతో వూరుకున్నాడు. లేకపోతే ఏ కాలేజీలోనూ సీటు లేకుండా అయిపోయేది.

కమల — అబ్బా!

నర — అంత అల్లరి చేసేడా? ఎందుకు డిస్మిస్ చేశారు?

వేణు — ఎందుకో అడక్కండి. మొట్టమొదట కాకినాడ కాలేజీలో డిస్‌మిస్ చేసినప్పుడు మేమంతా ఎంతో చెప్పాం 'నీ మతం మార్చు కోరా' అని. ససేమిరా ఒప్పుకోందే.

నర — అంటే బెజవాడ కాలేజీలో డిస్‌మిస్ లవడం రెండో సారన్నమాట.

వేణు — అబ్బే! మూడోసారి.

కమల — మూడోసారే! ఇతని కిదొక 'హాబీ' కాబోలు.

నర — అంటే చాలా రౌడీ అన్నమాట.

వేణు — అందుకు ఏమాత్రం సందేహం లేదు. విశాఖపట్నంలో లెక్చరరు ఏదో అన్నాడని క్లాసులో వాడి దవడపళ్లు వూడగొట్టేడు.

నర — ఆ, అంతటివాడా?

వేణు — బెజవాడలో 'స్టూడెంట్సంతా' రెండు పార్టీలుగా చీలిపోయారు. వీడొక పార్టీకి లీడరు. ఒక్కడు ఆ రెండో పార్టీలో నలుగుర్ని చావ చితక కొట్టేశాడు.

నర — ఆ! ఒక్కడూనా?

వేణు — ఆ. వాడికి కోపం వస్తే సోడాబుడ్లీలు ఎగరేసి కొడతాడు. వందమందైనా వాడి ధాటికి ఆగలేరు.

నర — సోడాబుడ్లే!

వేణు — ఆ. మీ రెప్పుడైనా చూశారో లేదో, సోడాబుడ్డి ఎగరేసి ఒకటి చేతితో పట్టుకుని కొట్టే ఎదుటి వాడి వంటి నిండా గాజు పెంకులు చొచ్చుకుపోతాయి.

నర — గాజుపెంకులే! చాలా బాధిస్తాయే!

వేణు — బాధంటే ఇలాగా, అలాగానా! ఒక స్టూడెంటు హాస్పిటల్లో చేరి రెండునెలలైనా ఆ గాయాలు మానలేదు. మరొకడికి కన్నొకటి పోయింది.

## "ఆపదలో అబల"

కమల - నాన్నా! ఒకసారి ఇలా రండి.

నర — వస్తున్నానమ్మా. కాసిని మంచినీళ్ళు తెచ్చి పెట్టు. ఆ, ఇంతకీ ఎందుకు కోపం వస్తుందిట అతనికి?

వేణు — ఎందుకేమిటండీ. వాడి మాట విన్నంత కాలం వాడంత పెద్దమనిషి ఉండడు. కాని ఎవడైనా వాడిని రెచ్చగొడ్తే వాడు మరి మనిషి కాడు.

నర — చాలా ప్రమాదమే.

వేణు — అలా ఏదైనా తిక్కవచ్చిందంటే రోజూ కన్నా ఒకటోరెండు గ్లాసు లెక్కువ తాగుతాడు.

నర మంచినీళ్ళే.

వేణు — మంచినీళ్ళు కాదు. స్వచ్ఛమైన విదేశీ పానీయం. వాడెప్పుడూ స్కాచ్ విస్కీ తప్ప మరేమీ తాగడు.

నర — ఏమిటి? సారాయే? పచ్చి తాగుబోతన్నమాట.

కమల — నాన్నా! ఇదంతా మనకు అనుభవంలేదు. ఆయన మూడునాలుగు నెలల నుండి మనింట్లో వుంటున్నారుగాని మాకు ఎప్పుడూ తాగుబోతులా కన్పించలేదు.

వేణు — ఎందుకు కన్పిస్తాడూ? బాగా తాగిన రోజున క్లబ్బులోనే రాత్రంతా వుండిపోతాడు వాడు సిటీక్లబ్బులో మెంబరన్న సంగతి మీకు తెలుసుగా.

నర — నాకేమీ తెలియదండీ. ఏమాత్రం తెలుసున్నా గది అద్దెకిచ్చేవాణ్ణి కాదు. ఇప్పుడేం చెయ్యాలో తోచటంలేదు.

వేణు — ఇక్కడేదైనా గొడవ జరిగిందా?

నర — ఏం?

వేణు — ఏంలేదు. అరడజను సోడాబుడ్లు తన రూముకు పంపమని కొట్టువాడితో చెప్తున్నాడు. ఎందుకా?—అనుకున్నాను.

నర - (భయంగా) రూముకే! ఎంత దారుణం!

వేణు - మీకు నేనొక్కటే సలహా ఇవ్వదల్చుకున్నాను. వాడితో ఎప్పుడూ ఏ తగువూ పెట్టుకోకండి.

నర — అబ్బే! అతనితో నా కెందుకండీ తగువు.

వేణు — ఎందుకంటే, బెజవాడలో ఇంటాయన ఏదో అన్నాడని ఆయన్ని సోడాబుడ్డీతో కొట్టేశాడు.

నర — అయితే పోలీసు లతన్ని అరెస్టు చెయ్యలేదూ? కోర్టులో కేసు పెట్టలేదూ?

వేణు — మీకు తెలియదేమిటి, వీడు మంత్రిగారికి బంధువు. వాడి నరెస్టు చేసే దమ్ములు ఎవడికున్నాయండీ. అసలు వాడేంచేసినా దానికి అప్పీలు లేదు.

నర - ఘోరం! దారుణం!

వేణు — నిజంగా ఆ బెజవాడాయనను చూస్తే నాకు చాలా జాలేసింది. ఆయన ఏమీ అన్లేదు సుమండీ, 'మా రూము ఖాళీ చెయ్యండీ' అన్నాడు. అంతే, మా వాడికి కోపం వచ్చేసింది. ఖాళీ చెయ్యనన్నాడు. ఆయనింకొంచెం గట్టిగా అనేసరికి వీడాయన్ని కొట్టేశాడు.

నర — రామ! రామ!

(రమణారావూ, శర్మా ప్రవేశిస్తారు. వేణు వాళ్ల వద్దకు వెడతాడు. ముగ్గురూ రూములోకి వెడతారు).

నర — (కమల వద్దకు వెళ్ళి) మన జాగ్రత్తలో మనం వుండాలి.

కమ — నాన్నా! ఇతనెవరో మనని బెదిరించాలని కోతలు కోస్తున్నాడు. అన్నీ అబద్ధాలని నా నమ్మకం.

నర — ఏమోనమ్మా! ఏం చెప్పగలం. అప్పుడప్పుడు నాకూ సందేహం కలుగుతూంటుంది, రమణరావు తాగుతాడేమోనని.

కమల —ఇంతకీ ఈ వచ్చిన కుర్రాడు కూడా ఈ రూములోనే తిష్ఠవేసేటట్లు వున్నాడు.

నర — అది కుదరదని ముందరే చెప్పేశాగా.

కమ — ఏమైనా సరే. రేపు ప్రొద్దున్నే ఇతన్ని ఖాళీ చేయించాల్సిందే.

నర — అందుకు తగిన మార్గం నేనాలోచిస్తాగా, లోపలికి పద.

(కమల నరసింహం లోపలికి వెళ్తారు. శర్మా వేణూ, రమణరావు గది లోంచి బయటికి వస్తారు)

శర్మ — అయితే ముసలాడికి మంచి డోసు ఇచ్చావన్న మాట.

వేణు - ఇక మన జోక్ రాడులే.

శర్మ - లేకపోతే తక్షణం ఖాళీ చెయ్యమంటాడా ఎన్నిసార్లు రమణరావు దగ్గిర చేబదుళ్లు పుచ్చుకున్నాడు. ఆ విశ్వాసంలేదు.

వేణు - బ్రతికి చెడ్డవాడులా కన్పిస్తున్నాడు.

శర్మ - అందుచేతే కూతురి చేత ఉద్యోగం చేయిస్తున్నాడు. ఈ ఇల్లూ ఆ అమ్మాయి జీతం తప్ప వేరే ఆధారమేదీ లేదు.

వేణు - ఆ అమ్మాయికి పెళ్లి చెయ్యడం చాలా కష్ట మనుకుంటాను.

శర్మ - (కొంచెం వెటకారంగా) ఏం బ్రదర్, ఆ అమ్మాయి మీద అంత జాలి పడుతున్నావు నీ కేమైనా పెళ్లి చేసుకోవాలని ఉందా?

వేణు — అబ్బే! అదికాదురా. ఆ అమ్మాయి చాలా సుకుమారంగా కన్పిస్తోంది. పాపం ఆఫీసులో ఎలా పని చేస్తోందా, అని........

— నీలా జాలిపడే వాడెవడయినా పని సాయం చేసి పెడుతున్నాడేమో.

వేణు - అయినా ఆడపిల్ల నలుగురి మగాళ్ల మధ్య పని చెయ్యాలంటే ఎంత సిగ్గుగా వుంటుంది.

శర్మ — అవును మరి. మొట్టమొదట అలాగే వుంటుంది. తరువాత మాత్రం ఆ అమ్మాయి హొయలు చూడలేక, ఈ మగాళ్లే సిగ్గు పడతారు.

వేణు — పదిమందిలో ఒక్కడికైనా ఆ అమ్మాయిని ఎలా గౌరవించాలో తెలియని సంఘంలో మెస లడం ఎంత కష్టం!

— చాలాకష్టం. గౌరవించడం సంగతెలాగున్నా, పదిమందిలో తొమ్మండుగురికి ప్రేమించడం మట్టుకు తెలుసు.

వేణు — తన తోటి వయస్సు వాళ్లు హాయిగా పెళ్లి చేసుకుని కాపురం చేస్తూంటే, తను ఆఫీసులో మగ్గిపోతూ తన స్థితిని తలచుకుని ఎంత కృంగిపోతుంది!

శర్మ — ఒకొక్కప్పుడు ఆ పెళ్లి చేసుకున్న అమ్మాయిలే, ఇష్టంలేని అత్తవారిళ్లలో మగ్గిపోతూ ఆఫీసులో పనిచేసే అమ్మాయిలతో తమ స్థితిని పోల్చుకుని కృంగిపోవడం కద్దు.

వేణు — ఎంతైనా, భర్త యొక్క సాన్నిధ్యంలో ఎన్ని కష్టాలైనా మరిచిపోతుంది భార్య.

శర్మ — ఆఫీసులో తన్నారాధించే రోమియోల సాన్నిధ్యంలో కూడా ఎన్నికష్టాలైనా మరిచిపోతుంది మోడరన్ జూలియట్.

వేణు - అంటే పెళ్లి చేసుకోడం కన్నా, ఆఫీసుల్లో పని చెయ్యడమే ఆడపిల్లలిష్టపడతారంటావా?

శర్మ — ఉద్యోగాలు దొరక్కగాని, ఆఫీసుల్లో ఆడ పిల్లలకున్నంత హాయి పెళ్లి చేసుకోవడంలో ఎక్కడుందిరా.

వేణు - ఏమిట్రా ఆ హాయి? ఆఫీసులో నలుగురి కళ్లూ తనని నఖశిఖ పర్యంతం పరీక్ష చేస్తూంటే, తనని గురించి గుసగుస లాడుతూంటే ఏమాత్రం అవకాశం వచ్చినా, వంచించాలని ప్లానులు వేస్తూంటే, వాళ్ల నీచమైన బుద్ధులు గ్రహించి ఎంత బాధ పడుతుందిరా ఆ అమ్మాయి!

- అక్కడే వుంది కిటుకు. ఆడది అందకుండా దూరంగా వున్నంత సేపే ఆమెలో ఆకర్షణ వుంటుంది. చేతి కందిననాడు మళ్లీ ఆమె వె పు తిరిగి చూడడు మగవాడు. కాస తెలివైన ఆడదె తే తనచుటూ వున్న మగాళ్లను తెగ ఏడిపిస్తూ తను చాల ఆనందించగలదు.

వేణు — కొందరు నట్టిపుణ్యానికి ఆ పిల్ల మీద 'స్కాండల్స్' వేస్తారు. రుజువు లేకుండానే నమ్మేస్తారు తక్కినవాళ్లు.

శర్మ — రుజువులేని 'స్కాండల్' మీదున్న మోజు అది రుజువైతే పోతుంది. ఒకటి రెండు అలాంటివి ఆమె పేరుతో జోడిస్తే ఆమె విలువ మరీ పెరుగుతుంది, సారా పులిసిన కొద్దీ కైపెక్కువైనట్లు.

వేణు — మనది భారతదేశం అనీ, భారతనారి అంటే పవిత్రతకు చిహ్నం అనీ మర్చిపోయావా?

శర్మ — భారతనారి అంటే సీతా, సావిత్రీ, దమయంతీ వాళ్లకే చెల్లిందిరా. అది కృతయుగంలో. అప్పుడు పురుషులు కూడా శ్రీరాముడూ, సత్యవంతుడూ, నలుడూ మొదలైన వాళ్లుండే వాళ్లు. కాని ఇది కలికాలంరా బ్రదర్,

మగాళ్ళైనా, ఆడాళ్ళైనా అంతా ఇమిటేషను సరుకు. మనం పాశ్చాత్యుల ననుకరించడంలో హనుమలమై పోయాం.

వేణు — ఎంతైనా ఆడవాళ్లు ఉద్యోగాలు చెయ్యడానికి కాలం మంచిది కాదురా.

శర్మ — దీనికిపేరే కలి కాలంరా అంటే 'కలికికాలం' అన్నాడు మహాకవి. కలికి అంటే ఆడది. వాళ్లదేరా, ఇప్పుడు పైచెయ్యి.

(కమల వరండాలో, ప్రవేశించి పై మాటలు విని శర్మ వైపు కోపంగా చూస్తుంది.)

వేణు — అందంగా వున్న ఆడవాళ్లు కోపంతో మరీ అందంగా కన్పిస్తారురా.

శర్మ — ఎందుకంటే వాళ్లకు కోపం హెచ్చిన కొద్దీ వీళ్లకు తాపం హెచ్చుతుంది.

(కమల గిరుక్కునో తిరిగి వెనక్కి ఇంట్లోకి వెళ్లిపోతుంది.)

వేణు — మన మాటలకు నొచ్చుకుంది కాబోలురా.

శర్మ — కాదురా అబ్బాయి. నువ్వు తన అందాన్ని మెచ్చుకుంటున్నావని తెలుసుకుంది.

వేణు — వాళ్ల నాన్నతో చెప్పి మనల్ని బయటికి గెంటిస్తుందేమో.

శర్మ — ఆ ప్రయత్నం ఇందాకా జరిగింది. అది ఫలించకే ఆ కోపం.

వేణు — నువ్వేమైనా అను, ఆ అమ్మాయి అంటే నా కదొక అభిమానం ఏర్పడింది. ఇందాక రమణరావు ఈ రూములో వుండమన్నప్పుడు నేనంత ఇష్టపడలేదుగాని ఇప్పుడు నాకింక ఈ రూమును వదిలి వెళ్ళ బుద్ధి కావటం లేదు.

శర్మ మొత్తానికి మనవాడు గది ఖాళీ చెయ్యక పోవడానికి మరొక కారణం ఏర్పడిందన్నమాట.

(రమణరావు ప్రవేశిస్తాడు.)

రమ — ఒరేయ్, వరండాలో కుర్చీలు వేసుకుందాం.

(ముగ్గురూ లోపల్నుంచి కుర్చీలు తెచ్చి వేసుకుని కూచుంటారు.)

రమ — ఇందాకా ఆడపిల్లలు మన టాయిలెట్ బాక్సెస్ చూసి తెగ మురిసిపోయినట్లుందిరా.

శర్మ — ఆ 'అయిడియా' మంచి 'సక్సెస్' అయిందిరా.

రమ — ఏరా వేణూ అలా వున్నావేరా?

శర్మ — మనవాడికి ఇందాకా కాసిన ఎండకు గాళుపు కొట్టిందిలే. దాన్ని ప్రేమగాళుపు అంటారు. ఆ దెబ్బకి వాడి తల దిమ్మెక్కిపోయింది.

వేణు — ఉత్తినే నా మీద అభాండాలు వెయ్యకు.

శర్మ — సిగ్గెందుకురా వెర్రి తండ్రీ! మేమందరం నీ మేలు కోరే వాళ్లమేగాని నీకు పోటీదారులం కాము.

రమణరావు — ఛ!ఛ! ఆ అమ్మాయి వైపు కన్నెత్తి అయినా ఎవడు చూస్తాడురా. పాలిపోయిన మొహం, తేలిపోయిన కళ్ళూ, ఏం బావుంటుందిరా.

వేణు — ఒరే! అందం అంటే ఏమిటో తెలియని నీలాటి వాళ్లతో ఆ దేవత సౌందర్యం గురించి మాట్లాడ్డం అనవసరం.

రమణరావు — అయినా నీ అభిరుచి ఇంతిలా దిగజారి పోతుందని నేనెప్పుడూ అనుకోలేదు. నా స్నేహితుల్లో మంచి కళాభిరుచి కలవాళ్లలో నువ్వొకడివి అనుకున్నాను.

వేణు — కళాభిరుచి కలవాడిని కనుకనే సౌందర్యాన్ని చూడగానే పోల్చేశాను.

రమణరావు — నువ్వు పోల్చింది సౌందర్యంకాదు, వికారం.

వేణు — నీ కళ్లకు కన్పించింది అదేనేమో గాని నాకు మాత్రం ఎక్కడా అది కన్పించలేదు.

రమణరావు— నీకన్నా ఎక్కువకాలం నుంచి ఇక్కడ వుంటున్నాను. నాకు తెలిసినట్లు నీకేం తెలుసు.

వేణు — సూర్యోదయాన్ని వందేళ్ళు రోజూ చూసినా అందులోని అందాన్ని సామాన్య మానవుడు గ్రహించలేడు. కాని కళాకారుడు ఊహ తెలియగానే ఒక్కరోజున సూర్యోదయం చూసి అందులో అందం గ్రహిస్తాడు.

రమణరావు — సూర్యోదయానికి పాండ్స్ క్రీమూ, యార్డ్లీ పౌడరూ, పెదవులకు లిప్‌స్టిక్, జడలో సవరం, బ్రాస్ అవసరమూ వుండవు, దాని అందం గ్రహించడానికి. అవి లేకుండా నువ్వా మనిషిని చూస్తే నీకు జ్ఞానోదయం అవుతుంది.

శర్మ — అక్కడే వుంది కిటుకు. ఊరికే అందంగా వుండాలని ఏవేవో ప్రయత్నాలు చేస్తారుగాని అసలు మేకప్పే లేకుండా అందంగా కన్పించే అమ్మాయి సృష్టిలో చాలా అరుదనుకుంటాను.

వేణు — అలాటి అమ్మాయి నీకు కన్పించిందా?

శర్మ — కన్పించింది కాబట్టే, సృష్టి మీదా, దేవుడి మీదా నమ్మకం కలిగింది.

వేణు — ఎవర్రా ఆ అమ్మాయి?

శర్మ — నా మనసులోని ఒక మధురకాంక్ష; నా కళ్ల లోని వెలుగు; నా ఊహలోని మెరుపు; నా హృదయంలోని వేదన; నా స్వప్నసుందరి.

వేణు — ఆమెకు ఊరూ పేరూ ఉన్నాయంటావా.

రమణరావు — ఆ, పూర్తి యడ్రసుంది వాడి దగ్గర.

— పేరులో ఏముంది. గులాబీని గులాబీ అని కాకుండా మరో పేరుతో మాత్రం పిలిస్తే ఆ సౌందర్యం, ఆ పరిమళం మృగ్యమౌతాయా? పేరు అనేది శుద్ధ అనవసరం.

రమణరావు — ఆ తెలివితేటలు లవ్‌లెటరు రాసి నప్పుడేమయ్యాయి? క్రింద గార్తి పేరు సంతకం పెట్టేశావే.

వేణు— ఏం? ఏమైంది?

రమణరావు — ఆ అమ్మాయి అన్నలూ, మేనమామలూ అంతా మనవాణ్ణి లాఠీలతో పరామర్శించడానికి వచ్చారు. అప్పుడు నేనుండబట్టి సరిపోయింది.

వేణు — కొంపతీసి ఈ అమ్మాయికి కూడా మేన మామలూ, అన్నలూ ఎవరైనా వున్నారేమిటి?

రమణరావు — వాళ్లెవరూ లేరుకాని వాళ్లమ్మ వుంది. వెయ్యిమంది మగాళ్లకు సమాధానం చెప్పవచ్చు కాని ఆవిడకి మాత్రం సమాధానం చెప్పలేము. ఆ ముసలాయన ఆవిడ నుంచో మంటే నుంచో వాలి; కూచోమంటే కూచోవాలి.

వేణు — పాపం ఆ మానవుణ్ణి చూస్తే జాలేస్తుంది. (నరసింహంగారు ప్రవేశిస్తారు. కమల వెనకాల నిలబడి వుంటుంది.)

నర — ఏమిటీ గోల? రాత్రిళ్లు మమ్మల్ని నిద్ర పోనియ్యరా? వరండాలో లైటార్పేస్తాను.

రమ — అలా వీల్లేదు. మాకు పనుంది.

నర — పనుంటే రేపు ప్రొద్దున్న చూడవచ్చు.

రమ — అది రేపు ప్రొద్దున్న పనికాదు. ఇప్పుడే

నర — నేనీ ఇంటి యజమానిని. నేను చెప్పినట్లు వినాలి. (వేణు కమలవైపు చూస్తూంటాడు. శర్మ వాడివైపు చూసి నవ్వుతూంటాడు. కమల మొహం తిప్పుకొంటుంది.)

రమణరావు — నేను అద్దె ఇస్తున్నాను. నా యిష్ట ప్రకారం జరగాలి.

నర — అద్దె ఇవ్వగానే సరిపోదు. మర్యాదగా నడుచు కోవాలి. ఇవతలి వాళ్లకి ఎంత ఇబ్బంది కలుగు తుందో చూడాలి.

— అలా చూసే కాబోలు వెంటనే గది ఖాళీ చెయ్యమని ఒత్తిడి చేశారు.

నర — అది నా యిష్టం. ఇంటి యజమానిగా నాకా హక్కుంది.

రమ — అయితే అద్దెకున్నవాడిగా నాకూ హక్కుంది. నా యిష్టమేమిటో తెలుసుకోండి. మీరు వీలై నంత త్వరలో ఆ పోర్షన్ ఖాళీ చెయ్యండి.

నర— (నిర్ఘాంతపోయి) మేమా! ఖాళీ చెయ్యాలా?

రమ —అవును. నా స్నేహితులు కొందరు సెప్టెంబరు పరీక్షలకు వస్తున్నారు. వాళ్లకోసం గదులు కూడా అద్దెకు తీసుకోదలుచుకున్నాను.

వేణు — ఆ బెజవాడాయనకు కూడా అదే చెప్పాం. వింటేనా. మరీ మొండిగా మనవాణ్ణి ఇల్లు ఖాళీ చెయ్యమంటే మన వాడికి కోపంవచ్చింది.

నర — (కొద్దిగా భయపడ్డట్టు చూసి) అది కాదండీ. ఇక్కడ మీరు ఇలా తెల్లవార్లూ బాలాఖానీ కొడ్తే మాకు నిద్రెలా పడ్తుంది.

వేణు — ఒరే శర్మా! ఎందుకైనా మంచిది ఆ సోడా బుడ్లు కొట్టువాడికి తిరిగి పంపించెయ్.

రమణరావు — వీల్లేదు.

కమల — నాన్నా ఒక్కసారిలా రండి.

నర — వస్తున్నానమ్మా (అని కమల వద్దకు వెళ్తాడు.)

కమల — ఇవాళ్టికి ఊరుకోండి నాన్నా తరువాత చూసుకుందాం.

నర — అబ్బే! నేనేం అనలేదు.

కమల — పోనీండి ఎందుకైనా మంచిది ఊరుకోండి.

నర — అలా వూరుకుంటే లాభంలేదు. వాళ్లకి తగిన బుద్ధి చెప్పాలి.

కమల — త్రాగుబోతులతో దెబ్బలాట లేమిటి.

(రమణరావు ఆశ్చర్యంగా చూస్తాడు. శర్మా వేణూ సైగ చేసుకొని చిరునవ్వు నవ్వుకుంటారు.)

నర — బాగా చెప్పావు. అసలు అద్దెకివ్వడమే మనది పొరపాటు.

కమల — అయినా మనిషన్నవాడికి ఒకసారి చెప్తే బుద్ధుండాలి.

(రమణరావు కోపంగా చూస్తాడు.)

నర — అబ్బే! ఆమాత్రం బుద్ధుంటే ఇంకేం కావాలి.

కమల — మొండి వాళ్లనేం చెయ్యగలం.

నర — అందుకే మొండివాడు రాజుకన్నా బలవంతు డన్నారు.

(రమణరావు 'ఓహో!' అన్నట్లు తలూపుతాడు.)

కమల — మనం అన్యాయకులం కాబట్టి అందరూ పెద్దమనుషు లనుకుంటాం.

నర — అందుకే మోసపోయాం.

(రమణరావు కొద్దిగా ముందుకు వెళ్తాడు.)

కమల — ఇన్నాళ్ల నుండీ మనింట్లో అద్దెకున్నది రౌడీలని తెలుసుకోలేకపోయాం.

నర — రౌడీలుకూడా ఇంత దారుణంగా ప్రవర్తించరు.

రమణరావు — ఒరే శర్మా! ఒక సోడాబుడ్డి తేరా.

(శర్మ సోడాబుడ్డీ ఒపెనరూ తెస్తాడు. కమలా, నరసింహం భయంగా చూస్తారు. రమణరావు ఒక్క నిముషం ఆ బుడ్డీని చేత్తో పట్టుకుంటాడు. అందరూ అతని వైపే చూస్తారు.)

నర — కటిక కసాయివాడికైనా జాలీ మర్యాదా వుంటాయి.

కమల — (గద్గదకంఠంతో) నాన్నా, బాధపడకండి. ఏం చేస్తాడో చెయ్యనియ్యండి. (రమణరావు సోడా కొట్టేసి గడగడ త్రాగేస్తాడు. త్రాగేసి సీసా లోపలికి పెడ్తాడు. నరసింహం కమలా ఇంట్లోకి వెళ్ళిపోతారు.)

రమ — ఈమాటలన్నీ ఆడపిల్ల అంది కాబట్టి సరిపోయిందిగాని మరొకరయితే రక్తం కళ్లజూసి వుందును.

వేణు — ఆడవాళ్ల మాటలకే గనక శక్తి వుంటే ఆటంబాంబు లనవసరంరా బాబూ.

శర్మ — పెద్ద తుఫానులా ఉరుములూ, మెరుపులూ ఫెళఫెళ లాడించింది. వేణూ, నీ ఆరాధ్య దైవం మహంకాళీ స్వరూపం దాల్చిందిరా.

రమ — ఇలా వూరుకుంటే లాభంలేదు. వేణుగా డన్నటు వీళ్ల చేత ఇల్లు ఖాళీచేయించే ప్రయత్నంలోకి దిగాలి.

వేణు — ఈసారి ముసలాయన గనక మనల్ని ఖాళీ చెయ్యమనడానికి వస్తే ముందే మనం. 'ఏమండీ ఎప్పుడు ఖాళీ చేస్తారు ఇల్లు' అని మొగలెడ్దాం.

శర్మ — ఒరే! రమణరావు నిన్ను అన్నిమాట లంది కదా నీలో పౌరుషం అంతా ఏమయిపోయిం దిరా? ఒక్కదానికీ జవాబు చెప్పకుండా, అలా బెల్లం కొట్టిన రాయిలా నుంచుండిపోయావు.

వేణు — అదే నాకూ ఆశ్చర్యం కలిగింది. నా పుట్టుకు నాకు ఏమిటో అనాలని అనిపించేది కాని, మళ్లీ నోట్లోంచి మాట పెగిలేదికాదు.

రమణరావు — అయినా అలా నిలువునా అబద్ధా లాడేస్తూంటే ఏం అనాలో నాకే తెలియలేదు. ఆ అమ్మాయి అలా అంటూంటే ఛివరకు నేనొక త్రాగుబోతుననీ, కసాయివాడిననీ, మొండి రౌడీననీ నాకే అనుమానం వేసింది.

వేణు — ఆ అమ్మాయి గొంతుకలో ఏదో ఆకర్షణ వుందిరా.

– మరే. కాస్త ఆ ధోరణి నీ మీదకి తిరుగుంటే ఆ ఆకర్షణ ఏదో తెలిసేది. ఒరే రమణా, ఈ వేణుగాడు ఏదో పెద్దఎత్తులో వున్నాడు. ఆ అమ్మాయి ఏంచేసినా భళాభళీ అంటున్నాడు. (మన్యం ప్రవేశిస్తాడు.)

మన్యం — ఒరే! రాత్రి పేకాట వేద్దాం అని రమణ రావు చెప్తే వచ్చాను. మీరంతా ఏదో గొడవలో వున్నట్లున్నారు. ఆట వుందా? లేదా?

రమణరావు — అవునురా, ఇవాళ శనివారం కదా. కాసేపు పేకాటాడుదాం.

— ఈ ఇంటాయనతో దెబ్బలాడి నీరసం వచ్చింది.

వేణు — నాకు ఏనుగంత బలం వచ్చింది.

శర్మ — అవున్నోయనా, నీకా అమ్మాయి మాటలు అమృతధారల్లా వున్నాయి, కాబట్టి బలం వచ్చింది.

వేణు — అలా ప్రతిదానికీ ఖంగారు పడకూడదు.

శర్మ — మరినువ్వు కూడా ఆ అమ్మాయి గురించి ఖంగారు పడకు. ఆ అమ్మాయి కొక బావ వున్నాడు. వాడూ ఆ అమ్మాయీ ప్రేమించు కున్నారట.

వేణు — అంతా శుద్ధబద్ధం, నే నన్నమ్మను.

రమణరావు —ఒరే ఆటగురించిప్రయత్నం చెయ్యండిరా'

శర్మ — నాకేం అభ్యంతరం లేదుగాని, మళ్లీ ఆ ముసలాయనతో చెడుగుడు ఆడాలిసి వస్తుం దేమోనని భయం.

వేణు — ఆడితే ఆడదాం. అది మరీ హుషారుగా వుంటుంది.

శర్మ —ఏదీ, ఆ అమ్మాయితో దాగుడు మూతలాడ్డం అనుకుంటున్నావా.

రమ —ఒరే,మీరిద్దరూ ఆగొడవచాలించి దారిలోకిరండి.

వేణు —పేకాటకేంగాని మన్యంగాణ్ణి రెండుపాటలు పాడమన్నా. చాలా చక్కగా పాడతాడు.

మన్యం — నాగొంతుక బాగాలేదురా నే పాళ్లేనూ.

శర్మ —పోనీ వేణూ, నువ్వొకపాట పాడకూడదురా అవతలనుంచి ఆ అమ్మాయి అందుకుంటుంది. దాంతో అది యుగళగీతం అయిపోతుంది.

వేణు —నాకేం అభ్యంతరం లేదుగాని ఆ అమ్మాయే ముందర పాడితే బావుంటుంది.

శర్మ —అయితే ఆ అమ్మాయిని అడుగుదామా? పాడమని.

రమ —ఇందాకా పాడిందికా మంగళహారతి. ఇహచాలు. ఒరేయ్, మీరంతా వినండి. నాకు ఒళ్లు మండి పోతోంది. అసలు వీళ్ల సంగతేమిటో పూర్తిగా కనుక్కోందే వూరుకోను. ఇవాళ రాత్రి తెల్ల వార్లూ భజనకాలక్షేపం ఏర్పాటు చేశాను. ఇలా రోజూ ఇక్కడ భజనలూ, పురాణాలూ ఏర్పాటు చెయ్యదల్చుకున్నాను. వాళ్లు బుద్ధితెచ్చుకుని కాళ్లబేరానికైనా వస్తారు. లేకపోతే మనబాధ పడలేక ఇల్లు ఖాళీచేసిపోతారు.

వేణు —దానికి భజనలూ, పురాణాలూ ఎందుకురా, రోజూ రాత్రి క్లబ్బులో పేకాట మానేసి ఇక్కడే పేకాటపెట్టేసరి.

శర్మ — లేకపోతే ఏదైనా నాటకసమాజంచేత రిహర్సల్సు చేయించినాసరే.

మన్యం — ఒక చిన్న డాన్సుస్కూలు ప్రారంభిస్తే.

రమ —ఒరే, వాటన్నిటికి కూడా ఒకప్రమాదముంది. ఇంటిగలవాళ్లు వీధిలో నలుగురితోనూ—మా ఇంట్లో అద్దెకున్న కుర్రాడు తెల్లవార్లూ పేకాడుతున్నాడనిగాని, నాటకాలేస్తున్నాడనిగాని చెప్తే వీధివాళ్లంతా కూడా ముక్కుమీద వేలేసుకుని మనకు బుద్ధిచెప్పడానికి వస్తారు. అదేగనక భజన కాలక్షేపమో పురాణమో అయితే వాళ్లుకూడా వినడానికి వస్తారుగాని మనల్ని పల్లెత్తుమాట లనరు. ఇవతల వీళ్లకి కూడా తిక్కబాగా కుదురుతుంది.

శర్మ —భలే ఐడియారా బ్రదర్. నాకూ ఇలాంటి 'ఐడియా' తట్టింది. ఒకస్వామీజీనో. సన్యాసినో తీసుకొచ్చి రూములో వుంచి అతన్ని అందరి ముందరా పొగిడేశామంటే మనదరిద్రం తీరిపోతుంది. స్వామీజీ దర్శనానికి వచ్చేవారంతా ఎలాగా దక్షిణా పళ్లూ ఫలాలూ తెస్తారు. అవి మనం ఉపయోగించుకోవచ్చు.

వేణు —నిజమేరా స్వామీజీ దర్శనానికి ఆడపిల్లలు కూడా చాలామంది వస్తారు.

శర్మ —వీల్లేదు. స్వామీజీ బ్రహ్మచారి. అలాటివేషాలు పనికిరావు.

వేణు —తప్పు తప్పు. స్వామీజీ మహాజ్ఞాని. ఆయన అలాంటి అడ్డు ఎన్నటికీ చెప్పరు. ఆయన దృష్టిలో స్త్రీ పురుషులంతా సమానం.

శర్మ — ఆయనకు ఆడదంటే మహాచిరాకు. ఆయన హిమాలయాల్లో పన్నెండేళ్లు ఘోర తపస్సు చేశారు.

మన్యం — అయితే ఆయనదగ్గర కొన్నిసిద్ధులుంటాయి.

శర్మ —ఉంటాయి ఏమిటి. కళ్లారా మేముచూస్తే. ఆయన దగ్గర ప్రసాదానికని అరటిపళ్లుపెడ్తే వాటిమీద ఎవరూ రాయకుండా కొన్నివాక్యాలు కన్పిస్తాయి.

వేణు —అనేకమంది భక్తులు తలుచుకున్న కోరికలు నెరవేరాయి.

రమ — ప్రర్తమానాలు చెప్ప గలరనుకుంటా.

శర్మ —ఔను. స్వామీజీ రమణరావుగనక రూము ఖాళీ చేస్తే ఈకొంపకు నిప్పంటుకుని, కాలిపోతుం దని చెప్తారు.

వేణు—అంతేకాదు. నన్ను ఈరూములోనే వుండమని స్వామీజీ ఆజ్ఞ.

శర్మ —మరే. శిష్యుడుకోరింది త్వరలోనే లభిస్తుందని స్వామిజీవారి ఆశీర్వాదం.

మన్యం —భక్తుల కోరికలు తీర్చటమే ఆయన అభిమతం.

రమణ —ఇంతకీ స్వామీజీవారి పేరేమిటి?

శర్మ —అవున్రా ఏదైనా మంచిపేరు పెడదాం. స్వామి 'అభయానంద' అంటే ఎలావుంటుంది.

వేణు —అబ్బే! కొంచెం రొమాంటిక్‌గావుంటేనేగాని ఆడవాళ్లకి ఆకర్షణకలుగదు. —'అఖండ సచ్చిదానంద బ్రహ్మచారి స్వామీజీ' అంటే.

రమ —బాగానేవుంది.

వేణు —ఆ బ్రహ్మచారి అన్నమాటెందుకురా?

శర్మ —అదిమాంచి 'ఎఫెక్టు' రావడానికి. మనమంతా బ్రహ్మచార్లం కదూ. అందుకని. ఆయనా బ్రహ్మచారే.

మన్యం —అయితే ఇంతకూ స్వామీజీ ఎవరూ?

రమ —ఇలాంటివేషాలకు మన కృష్ణంరాజు చాలా బాగుంటాడు. వాడికి కాస్త గడ్డాలూ, మీసాలూ తగిలించి కాషాయ బట్టలు తొడిగించామంటే సరిగ్గా స్వాములవారిలా వుంటాడు.

శర్మ —కాని ఒకటే ప్రమాదం. వాడు నోరువిప్పితే అన్నీ తిట్లే. మనం ఆ దరిదాపుల్లో వుండలేం.

రమ —అసలు స్వామీజీ చాలాకాలంనుండి మౌనవ్రతంతో వున్నారన్న సంగతి మర్చిపోయావా. అంతా సంజ్ఞలే గాని మాటాడరు.

శర్మ —రక్షించారు.

రమ —పదండి అలా కాఫీహోటలుకు వెళ్లి టీ తాగి, తిరిగి వచ్చేటప్పుడు భజన సమాజాన్ని పిలుచుకొద్దాం.

(అందరూవీధిలోకివెడుతుంటేతెరవాల్తుంది.)



# "ఫలు వ్రాసినవాళ్లకు కఠినశిక్షలు"

శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

సాహిత్యం (కవితగాని, కథలుగాని, మరి ఏ ఇతర కల్పనాశాఖగాని) ఎందుకనే ప్రశ్న ఇప్పటిది కాదు. దానికి మన పూర్వ ఆలంకారికులు సమాధానాలు వ్రాశారు. యశస్సుకోసం, ధనం కోసం, అమంగళాన్ని పరిహరించడంకోసం, లోకంలో వ్యవహారవేత్తృత్వాన్ని పెంపొందించడం కోసం, విశ్వశ్రేయస్సుకోసం—అని పరిపరి విధాలుగా సమాధానాలు చెప్పారు. పాశ్చాత్య సాహిత్యకారులలో అద్యతన కాలంలో అమితమైన కీర్తిప్రతిష్ఠలు సంపాదించిన స్త్రీ—మేడమ్ బ్యూవోయిర్—వంటి వాళ్లు కూడా I Wanted to be widely read in my life time, to de esteemed, to be loved (నా రచనలు నేను బ్రతికిఉన్న కాలంలోనే ఎక్కువగా చదువబడాలి—నన్ను లోకం గౌరవించాలి—సాహిత్య భావుకుల హృదయాల్లో నాకు స్థానం లభించాలి) అని చెప్పుకున్నారు. కీర్తిప్రతిష్ఠల కోసం కాకుండా, భావుకుల ప్రేమాభిమానాలకోసం కాకుండా—నమ్మిన సిద్ధాంతంకోసం సాహిత్యకృషి చేస్తున్నవాళ్లూ ఉన్నారు. ఒక సిద్ధాంతంలో తమకు కన్పించిన హేయత్వాన్ని దుయ్యబడుతూ విజృంభించి సాహిత్య సృష్టి చేసినవాళ్లూఉన్నారు. వాళ్లు కీర్తిని ఉపలక్షించక గుప్తనామాలు ధరించినా లోకంనిండా వాళ్ల కీర్తిప్రతిష్ఠలు అలముకుపోవడమున్నూ జరుగుతూ ఉంటుంది.

రష్యా దేశంలో ఈమధ్య ఇద్దరు ప్రముఖ రచయితలపైన నేరారోపణలు చెయ్యబడి, వాళ్లు నేరాలు చేసినట్లు న్యాయస్థానంలో నిర్ణయింపబడి, వాళ్లకు కఠినమైన శిక్షలు విధింపబడ్డాయి. సాహిత్యంలో ప్రసిద్ధుల్ని శిక్షలతో హింసిస్తున్నారనే వార్తలు—ధనికవాద దేశాలైన అమెరికావంటి దేశాలలో ఉన్న మేధావుల్నేకాక—సోదర కమ్యూనిస్టు దేశాలలో ఉన్న రచయితలతో కూడా తీవ్ర సంచలనం కలిగించాయి. ఇంతకూ ఆ ఇద్దరు రచయితలూ చేసిన నేరమేమిటి? రష్యాదేశంలో ఆచరణలో ఉన్న కొన్ని సిద్ధాంతాలలో తమకు కన్పించిన హేయమైన గుణాలను దుయ్యబడుతూ సాహిత్య సృష్టి చెయ్యడమే. ఒక కథలో, ఒక నవలలో చెప్పబడిన విషయాల మీద హోముధూములు చెయ్యడం ఎంతవరకు నాగరక మనిపించుకుంటుంది? కొన్ని అభిప్రాయాలు కలిగి ఉండటమే క్షమింపరాని నేరమైనట్లు భావింపబడితే—ఆ భావన అసంభావ్యమైనది కాదా? (It is making crime of an opinion out of a misdemeanor of opinion.) ఇందువల్ల ఉత్తమసాహిత్యకృషికి నిరుత్సాహం ఏర్పడదా? ఆ రచయితల రచనలవల్ల కలిగే విఘాతంకంటే—ఇటువంటి శిక్షలవల్ల సామ్యవాద వ్యవస్థకు తట్టుకోజాలని మర్మాఘాతం అవుతుంది కదా? అసలు ఇటువంటి అసహన ప్రవర్తన కమ్యూనిస్టు సిద్ధాంతానికే సహజమా? ఆ రచయితల పైన ఆరోపింపబడిన నేరాల వివరాలు, ఆ నేరాలను ఎట్లా విచారించారు, ఇచ్చిన తీర్పు ఎట్లా ఉన్నది—ఇవి పరిశీలిస్తే— పై ప్రశ్నలకు సమాధానాలు లభిస్తాయి.

అబ్రాం టెర్ట్జ్ (Abram Tertz) అనే పేరు ప్రపంచ సాహిత్య భావుకులకు చాలా పరిచితమైనది. అతని పుస్తకాలు పశ్చిమదేశాల్లో—దాదాపు ఇరవై భాషలలో—ప్రకటింపబడ్డాయి. అతడు

1959 వ సంవత్సరంలో ప్రకటించిన "సామ్యవాదంలో వాస్తవికత" (On Socialist realism) అనే తాత్త్వికరచన జగద్విఖ్యాతి చేకూర్చి పెట్టింది. రష్యాలో కళామర్మ రసజ్ఞాన విషయికంగా (Aesthetic) ప్రభుత్వంవారి అభిప్రాయాలకు విరుద్ధమైన ఊహలు ఎన్నో ఉన్నాయి ఈ తాత్త్విక రచనలో. అతనికిఊహా ప్రవల్లికా శైలిలో (Phantasma gorie) న్నూ, జీవితాన్ని వ్యాఖ్యానించేటప్పుడు వికారమైన (Grotesque) వర్ణనలు కాకుండా వాస్తవికతకు సన్నిహితంగా ఉండ లనే సిద్ధాంతంలోనూ, నమ్మకాలు ఉన్నట్లు ఆ తాత్త్విక రచనవల్ల విద్యమానం అవుతున్నది. అతని యీ నమ్మకాలు అతని చిన్నకథలలోనూ, నవలలలోనూ నవలికలలోనూ ప్రస్ఫుటంగా కన్పడుతున్నాయి. "విచారణ ప్రారంభమౌతున్నది" (The trial begins) "శాంతికోసం ప్రయోగం" (The make peace experiment.) "మంచుకడ్డీ" (The Icicle) మొదలైన అతని రచనలలో—అతని ఊహలు, అతని సిద్ధాంతాలు కథాసందర్భంగా సునిశితంగా మలచబడ్డాయి. అతని రచనలు, మనోహరమైన శైలికి, సుమధురమైన చమత్కారానికి, వినూతన వర్ణనాదక్షతకూ ఖ్యాతిని గడించాయి. స్టాలిన్ హయాము (1920) ముందునుంచీ ఇప్పటివరకు వచ్చిన ఉత్తమ రష్యా సాహిత్యంలో—అతనికి సుస్థిరమైన—ప్రథమశ్రేణి స్థానం ఉన్నదని సాహిత్య భావుకులు అంగీకరిస్తున్నారు.

ఊహాగానంలో అతడు లెస్కోవ్ (Leskov)తో సరితూగగలడనీ, వ్యంగ్యరచనలో గోగోల్ (Gogol)తో సమానుడనీ, వైచిత్రిలో కఫ్కా (Kafka) కంటె పైచెయ్యి అనీ విద్వాంసులు అభిప్రాయాలు వెలిబుచ్చారు. మానవ జీవితాన్ని మధురం చెయ్యాలనీ—మానవ హృదయాన్ని ప్రేమాహింసలకు స్థావరం చెయ్యాలనీ—అతడు వెలిబుచ్చిన వేదన, విశ్వవిఖ్యాతి గడించిన డొస్టొవిస్కీ (Dostoevski) రచనల్ని జ్ఞాపకం తెసాయి. ఖండాంతరాలలో అతని కీర్తి కిరణాలు వెన్నెలలు కాసినై. కాకపోతే టాల్స్టాయి లాగా, ఛెకోవ్ లాగా, డొస్టొవిస్కీలాగా అతడు పక్వమై పండిన (Maturity) రచనలు చేశాడా? అనే ప్రశ్నకు సమాధానం చెప్పడం కష్టమే. అయినా అతని రచనలలో ఒక వైయక్తిక వ్యగ్రత, నవ్యత్వం, సిద్ధహస్తం, కన్పడుతూనే ఉన్నాయి. అతని రచనలలో వ్యంగ్యవైభవం ఉన్నత శిఖరాలు చేరుకున్నప్పటికీ—అతడు మానవ ద్వేషి అనిగాని, అతడు పుట్టి పెరిగిన అతను చుట్టూ వున్న సంఘంమీద అతనికి ప్రబలమైన ద్వేషం ఉన్నదనిగాని—చెప్పటానికి ఆస్కారం కనిపించడంలేదు.

రష్యాలో ఉన్న కొన్ని సిద్ధాంతాల్ని తీవ్రంగా విమర్శించి—ఈమధ్యకాలంలో రష్యాలోనే ప్రకటించిన వాళ్ళూ వున్నారు. అటువంటి రచనల్ని ప్రభుత్వంవారు పట్టించుకోనూలేదు. కాని ఇతని రచనలలో ఉన్న అతి నిశిత మాధుర్యమైన వ్యంగ్యధోరణి, అతివాస్తవికతగా భావించే శయ్యావైభవమూ—ప్రభుత్వానికి తలనొప్పి తీసుకువచ్చి ఉండటంలో ఆశ్చర్య కారణం లేదు. ఇతని రచనలు రష్యాలో ప్రకటింపబడటానికి ప్రభుత్వంవారి అనుమతి ఎప్పటికీ లభించదు. అతని వ్యంగ్యస్ఫూర్తి అంత తీవ్రంగాఉంటుంది.

అబ్రాం టెర్ట్జ్ (Abram Tertz) ఉత్తమ రచయిత. అతడు కీర్తి విస్తారుడు. కాని అతని అసలుపేరు ఇదికాదు. అతని నిజమైనపేరు ఆంద్రి సినియవాస్కి (Andrei Siniavski). ఇతడు రష్యా దేశంలో ఉత్తముడైన, అగ్రశ్రేణి సాహిత్య విమర్శకుడుగా ఖ్యాతి గడించాడు. ఆపేరు మొన్న మొన్నటి దాకా రష్యాదేశం దాటి బయట తెలియనే తెలియదు.

ఆంద్రిసినియవాస్కి 1923 వ సంవత్సరంలో జన్మించాడు. రెండవ ప్రపంచయుద్ధం వచ్చేటప్పటికి అతని వయస్సు 16 సంవత్సరాలు. రష్యా యుద్ధ రంగంలో ప్రవేశించిన తర్వాత అతడు సైన్యంలో

చేరవలసి వచ్చింది. యుద్ధానంతరం అతడు తిరిగి మాస్కో విశ్వవిద్యాలయంలో చేరి విద్యాభ్యాసం చేశాడు. ఆరోజుల్లో—స్టాలిన్ కూతురు స్వెత్లనా (Svetlana) అతనికి సహాధ్యాయిగా ఉండేది. అతడు 1950 వ సంవత్సరంలో (తన 27 వ ఏట) మాస్కో విశ్వవిద్యాలయంలో సాహిత్యంలో డాక్టరేటు పుచ్చుకున్నాడు. అతడు డాక్టరేటు తీసుగున్నప్పుడు వ్రాసిన వ్యాసవివరణం—మాక్సింగోర్కీ (Maxim Gorky) ని గురించి అనీ—ముఖ్యంగా గోర్కీ వ్రాసిన దీర్ఘ, అసంపూర్ణ నవల క్లిం సంగిన్ (Klim Samgin) గురించి అనీ తెలుస్తున్నది. మాస్కో విశ్వవిద్యాలయంలో డాక్టరేటుకోసం ప్రయత్నం చేసే టప్పుడే—అతను కొంత అధ్యాపక వృత్తిని చేపట్టి నట్లూ, వ్యాసాలూ, గ్రంథవిమర్శలూ వ్రాసినట్లూ భోగట్టా తెలుస్తున్నది. ఆ తర్వాత తర్వాత అతడు మాస్కో విశ్వవిద్యాలయ ప్రాంగణంలో మేధావులలో అగ్రగణ్యుడుగా గౌరవం సంపాదించాడు. ఆంద్రి సినియవాస్కీ పేరు చెప్పగానే, సాహిత్యపరిచయం ఉన్న రష్యా దేశస్థుడెవరైనా—"పాస్టర్‌నాక్ శిష్యుడు" (Disciple of Boris Pasternak) అని చెప్పే స్తాడు. డాక్టరు ఝివాగో (Zhivago) అనే నవలతో నోబులు బహుమానం గడించి—రష్యా ప్రభుత్వంవారి ఒత్తిడిని భరించలేక—ఆ బహుమానాన్ని తిరస్క రించిన బోరిస్ పాస్టర్‌నాక్ కీర్తి అన్నిఖండాలలోనూ ఉన్నది.

పాస్టర్‌నాక్ కవితాసంకలనం ప్రభుత్వం వారి కత్తిరింపులకు లోబడి రష్యాలో 1961 లో వెలు వడింది. అందులో అనేక ఉత్తమ కవితా ఖండికలకు స్థానం లభించలేదు. ఈకవితా సంకలనాన్ని 1962 వ సంవత్సరంలో (మార్చి) నొవ్యిమిర్ (Novyimir) అనే పత్రికలో సినియవాస్కీ సమీక్షచేశాడు. ఈ నొవ్యిమిర్ పత్రిక రష్యాలో స్వేచ్ఛా భావవాదు లకు ఆటపట్టుగా ఉంటున్నది. ఆ సమీక్ష చాలా ఉత్తమస్థాయిలో వున్నది. ఆ సంకలనం అసంపూర్తిగా ఉన్నదనీ, ఎన్నో ఉత్తమరచనలు దానిలో నిరోధింపబడినాయనీ—అలజడి చేసి—ప్రభుత్వంవారి సమ్మతితో 1965 సంవత్సరంలో ఇంకో సంకలనం ప్రకటింపబడింది. ఈ నూతన సంకలనానికి సినియ వాస్కీ సంపాదకుడు. ఈరెండో సంకలనానికి సంపాద కుడుగా అతడు వ్రాసిన పీఠిక రష్యాభాషలో సాహిత్య విమర్శ శాఖలో పరాకాష్ఠ స్థితి చేరినట్లు పండితులు ప్రశంసించారు. సాహిత్యవిలువలు తెలిసిన భావుకుల దృష్టిలో ఈ పీఠిక ప్రపంచ సాహిత్యంలోనే మౌళిక రచనగా పరిగణింపబడుతున్నది.

నిత్యజీవితంలో అతిసామాన్య సంఘటనలు తీసుకొని వుత్పన్న గంభీరమైన కవితారచనలు పాస్టర్‌నాక్ చేశాడని సినియవాస్కీ సుదీర్ఘమైన వివరణ వ్రాశాడు. సినియవాస్కీ దృష్టిలో అమెరికా వాస్తవ్యుడైన ప్రఖ్యాత కవి రాబర్ట్ ఫ్రాస్ట్ (Robert Frost) కున్నూ, పాస్టర్‌నాక్‌కున్నూ — కొన్ని సామాన్యలక్షణాలు ఉన్నట్లు వివరించాడు. మన జవహర్‌లాల్ నెహ్రూగారికిన్నీ —అమెరికాలో అజరా మరుడైన కెన్నెడీగారికిన్నీ — ఈ ఫ్రాస్ట్ చాలా అభిమాన కవి. అమెరికా ప్రభుత్వంవారు ఫ్రాస్ట్‌కు లోకోత్తరమైన గౌరవాన్ని చెయ్యడం— అద్యతన చరిత్రకు సంబంధించిన విషయం.

సినియవాస్కీ 1964 వ సం. లో (జనవరి) నొవ్యిమిర్ పత్రికలో రాబర్ట్ ఫ్రాస్ట్ కవిత్వాన్ని గురించి ప్రశంసా పాత్రమైన వ్యాసం వ్రాశాడు. సినియవాస్కీ విమర్శలు అతని విద్వత్తును అతినిశిత సాహిత్య దృష్టినీ ప్రస్ఫుటం చేసేవిగా ఉన్నాయి.

సినియవాస్కీకి ప్రభుత్వవర్గాలలో చాల రోజుల నుంచీ మంచిపేరు లేనేలేదు. ప్రభుత్వ వర్గాలలో పిడివాదంతోయుక్తినిరపేక్షమైన మూఢనమ్మకాలను అంటిపెట్టుకునివున్న వాళ్లను (Dogmatists) విమర్శిస్తూ అతను అనేక రచనలు చేశాడు. అట్టు వంటి రచనలలో ప్రముఖమైనవి—పిడివాదులు— జన్మలో మరచిపోవడానికి వీలులేనివి చాలా ఉన్నాయి.

నోవ్యిమిర్ పత్రిక 1964 డిసెంబరు సంచికలో అతడు ది బ్లైట్ (The Blight) అనే నవలను (By Ivan Shevtsov—కర్త ఐవాన్ షెవత్‌సోవ్) సమీక్షచేస్తూ వ్రాసిన వాక్యాలు అగ్ని వర్షంలాగానే పనిచేశాయి. పిడివాదాన్ని నిరసించే—భావస్వేచ్ఛావాదులైన సోవియట్ రచయితలనీ—కళాకారుల్నీ—ఆ నవల పరమనైచ్యంగా, నేరస్థులుగా, అతిహీనులుగా చిత్రించింది. భావస్వేచ్ఛావాదులు పరమదుర్మార్గులనీ—వాళ్ళు ప్రభుత్వాన్ని కూల ద్రోయటానికి గూఢపుతానీ చేస్తున్నారనీ—నిసలైన సిద్ధాంత వాదులైన ఉత్తములు నిస్సహాయస్థితిలో పడిపోతున్నారనీ ఈ నవల చిత్రించింది. సినియవాస్కీ ఈ నవలపై చేసిన సమీక్ష సోవియట్ సాహిత్య కారులలో ఉదారభావ స్వేచ్ఛావాదులకూ—పురాతన రూఢ మార్గవాదులకూ—జరిగిన సంఘర్షణలలో ఒక ఘట్టంగా భావించవలసి ఉంటుంది. సినియ వాస్కీ సమీక్ష చాలా ఉదారంగానూ—నాగరకం గనూ ఉన్నదనీ—అతని ఉత్తమ సంస్కృతిని ప్రతిబింబించేటట్లుగానూ ఉన్నదని తెలిసినవాళ్ళు అభిప్రాయపడుతున్నారు. సోవియట్ సాహిత్య విమర్శలను ఇతర అభ్యుదయ భాషలలో ఉన్నట్లుగా ఒక నాగరిక సాహిత్య శాఖగా రూపొందించడంలో సినియవాస్కీ కృషి అనల్పమైనదే.

పురాతన రూఢమార్గవాదులతో అతడు ఎన్నో తలపట్లు పట్టాడు. సంక్షిప్తసాహిత్యకోశము (Concise Literary Encyclopedia) లో విప్లవ పూర్వ కవితా రచనలపై (Pre-revolutionary Poetic School) అతడు వ్రాసిన వ్యాసాన్ని—సోవియట్‌రష్యా సాహిత్య చరిత్ర మూడవ సంపుటంలో అనౌచిత్య యుద్ధవీర గాథలపై అతడు వ్రాసిన విమర్శనూ—పురాతన రూఢ మార్గవాదులు తీవ్రంగా నిరసించారు. సంక్షిప్త సాహిత్యకోశంలో ప్రకటింప బడిన అతని వ్యాసం—అపరిపక్వబుద్ధికి నిదర్శనమనీ సాహిత్యచరిత్రలో అతని వ్యాసం—వినాశహేతువుగా ఉన్నదనీ—వాళ్ళు ఆక్రోశాన్ని వెళ్ళబోశారు. వాళ్ళకు సినియవాస్కీ సమాధానాలు ఇచ్చాడు. ఆ సందర్భంలో అతని వాక్యాలు కొంత దురుసుగానే ఉన్నవని చెప్ప వచ్చును.

అతిస్వేచ్ఛావాదులైన నవ్యకవులలో వోజ్నె సెన్‌స్కీ (Voznesenski) యెవ్‌తు షెంకో (Yevtu shenko) అఖ్మాదులీనా (Akhmadulina) మొదలైన వాళ్ళ కవితాఖండికలని ప్రశంసిస్తూ సినియవాస్కీ వ్రాసిన వ్యాసం (For Poetic Activity) కమ్యూ నిస్టుపార్టీలో సాహిత్యపరిశీలనా శాఖకు "కంపరాయ మానం" అయింది.

విప్లవం వచ్చిన తొలిరోజుల్లో (1917—20) సోవియట్ భూమిలో ప్రాదుర్భవించిన కవిత్వంపై సినియవాస్కీ రచించిన ఉద్గ్రంథం ప్రపంచ భాషలలో ఈమధ్య వెలువడిన ఉత్తమ గ్రంథంగా ప్రస్తుతింపబడింది. ఈ గ్రంథం సంపాదించిన కీర్తి కూడా అతని ప్రత్యర్థులకు సహింపరానిదే అయింది. సాహిత్యంలో యుక్తి నిరపేక్షమైన పిడివాదదృష్టి ఉండరాదనీ—భావస్వాతంత్ర్యం ఉండాలనీ—అతని నిశ్చిత మైన అభిప్రాయాలు.

ప్రఖ్యాత చిత్రకారుడైన పబ్లో పికాసో (Pablo Picasso) ను గురించి, అతని చిత్రకళలో గల ఔన్నత్యాన్నిగురించి, ప్రత్యేకతనుగురించి—సినియవాస్కీ ఒక చక్కని గ్రంథం వ్రాశాడు. అది లక్షకాపీలు అమ్ముడుపోయింది.

బహువిధాల మేధావుల భావస్వాతంత్ర్యం కోసం—రూఢమార్గంనుంచి కళను సముద్ధరించడం కోసం—అతడు గణ్యమానమైన కృషిచేశాడు.

కాబట్టి అతణ్ణి నేరస్థునిగా నిర్ణయించి పట్టుగున్నారని వినగానే రష్యాభూమిలో ఉంటున్న ఉదారభావ స్వేచ్ఛా ప్రియత్వంగల మేధావివర్గం—హాహాకారాలు చేసింది. ఇది సాహిత్యంలో భావస్వాతం

త్యానికే అశనిపాతమని మేధావివర్గం విలపించింది. వాళ్ల విలాపం అరణ్యరోదనమే అయింది.

సినియవాస్కీ అంతర్ప్రసిద్ధుడుకాడు రెండో నేరస్తుడు. స్లావ్, ఇడ్డిష్, కాకేషియన్‌భాషలనుండి కవిత్వాన్ని రష్యాభాషలోకి అనువదించాడు డేనియల్.

అనువాదాలు ఉత్తమస్థాయిలో ఉన్నాయని విజ్ఞులు భావించారు. ఒక సంతృప్త ప్రభుత్వం—ఒకరోజు హంతకుల స్వేచ్ఛాదినంగా ప్రకటించి ఇష్టం వచ్చినట్లు హత్యలు చెయ్యవచ్చునంటే— దేశం ఏమౌతుంది—అనేభావాన్ని నిరూపిస్తూ ఊహాగానంగా "మాస్కో మాటాడుతున్నది" (This is Moscow Speaking) అనే విభ్రాంతి కల్పనా రచన చేశాడు డేనియల్. ఒక శాస్త్రవిద్యార్థి ధ్యానైక దృష్టిని సంపాదించి—గర్భస్థ శిశువు పురుష శిశువో—స్త్రీ శిశువో—తప్పులేకుండా చెప్పగలుగుతున్నాట్ట. ఆ విద్యార్థి ధ్యానిస్తున్నది కారల్‌మార్క్సును. అతడు రచించిన "The man from Minap" అన్న కథలో ఉన్న విషయమిది. అతడు అవలంబించిన గుప్త నామం అర్జాక్ (Arzhak.)

ఈ రచయిత లిద్దరూ క్షమింపరాని దేశ ద్రోహం చేశారని భావించి అరెస్టు చేయబడ్డారు. న్యాయస్థానంలో విచారింపబడ్డారు.

సోవియట్ చట్టం ప్రకారం ఒక రచయిత తన రచనల వ్రాత ప్రతిని—విదేశాలకు పంపడం—నేరం కానేకాదు. "డాక్టరు ఝివాగో" నవల వ్రాత ప్రతిని ఇటలీదేశానికి పంపినందుకు పాస్టర్‌నాక్‌ను రష్యా ప్రభుత్వంవారు దండించలేదు. 'ఏడవ వార్డు' (Ward 7) అనే నవల వ్రాతప్రతిని విదేశాలకు పంపినందుకు వేలరీ టార్సిస్ (Valery Tarsis) ఏ శిక్షా అనుభవించలేదు. సినియవాస్కీ సంగతి సాహిత్య చరిత్రలోనే అపూర్వమైన సన్నివేశం. అతడు రెండు భిన్న నామాలతో—భిన్నభిన్న సాహిత్య శాఖలను తీసుకొని వాటిలో ఉన్నత శిఖరాలు చేరుకున్నాడు. ఈ భిన్ననామాలతో చేసిన రచనలు భిన్నమైన శైలిలతో ఉన్నాయి. వాక్యవిన్యాసం, భాషా వివృతి—భిన్నభిన్నంగా ఉన్నాయి. ఈ రెండూ—ఏక హస్త సంజనితాలనీ—ఏక కపోల కల్పితాలనీ భావించ డానికి వీలులేకుండా వున్నాయి. అయినా ఒక నామంతో ప్రతిపాదించిన సిద్ధాంతాల గాఢత్వమే—రెండో నామంతో కల్పనచేసిన కథలలోనూ నవలలలోనూ ప్రస్ఫుటంగా విద్యమానం అవుతున్నది. అసలా సిద్ధాంతాలకు కల్పనాసాహిత్య రూపమే ఈ కథలూ, నవలలూ.

పాస్టర్‌నాక్ రచించిన 'డాక్టర్ ఝివాగో'నవలకు నోబులు బహుమానం వచ్చినప్పుడు రష్యా ప్రభుత్వం వారు—బహుమతి ప్రదాన సంఘాన్ని దుమ్మెత్తి పోశారు. ప్రభుత్వంవారి ఒత్తిడిని భరించలేక పాస్టర్‌నాక్ బహుమానాన్ని తిరస్కరించాడు. మొన్న మొన్ననే ఇంకో సోవియట్ రచయితకు నోబులు బహుమానం వచ్చింది. షోలొఖోవ్ (Sholokhov) రచించిన (The Quiet Don) (ప్రశాంతమైన డాన్ నది) అనే నవలకు. ఈసారి సోవియట్ ప్రభుత్వం వారు బహుమతి ప్రధాన సంఘాన్ని దూషించలేదు. సోవియట్ ప్రజలు, పత్రికలు, ప్రభుత్వము హర్షించారు. సాహిత్యవిషయంలో సోవియట్ ప్రభుత్వం వారి దృష్టి కొంత మృదుత్వాన్ని సంతరించుకున్నదని సాహిత్యప్రియులు సంతోషించారు. ఇంతలోనే ఈ సినియవాస్కీ—డేవియల్ అరెస్టు, విచారణ, కఠిన శిక్షలు—ఇవి యావత్ప్రపంచంలోనూ సాహిత్యవీధులలో దిగ్భ్రాంతిని కలిగించాయి.

ఈ రచయితలపైన ఆరోపింపబడిన నేరం—"దేశద్రోహం".సోవియట్ శిక్షాస్మృతి 64 వ సూత్రము ప్రకారం (Article 64 of the R F S R Criminal Code) ఈ నేరానికి శిక్ష—పదిపదిహేను సంవత్సరాల కారాగారవాసంనుంచి మరణదండనవరకూ ఉన్నది.

కథలలోనూ, నవలలలోనూ వెలిబుచ్చిన అభిప్రాయాలను—అభిప్రాయాలతోనే ఎదుర్కోవలసి

ఉన్నదిగాని, రక్షకభటులకూ, న్యాయస్థానాలకూ అనంతశక్తిగల అభిప్రాయాలని రూపుమాపు చెయ్యడం సాధ్యమా?

కీ. శే. మైఖేల్ జోష్చెంకో—పూర్వం స్టాలిన్ కాలంలో—ఒక హాస్యకథ వ్రాశాడు. అది ఒక కోతియొక్క సాహస కృత్యాలనుగురించి. ఆ కథవల్ల ఆ రచయితకు సోవియట్ జీవితవిధానంమీద నిరాదరణ ఉన్నదని నిర్ణయింపబడి—ఆ రచయిత తిరిగి ఏ రచనా ప్రకటించడానికి వీలులేకుండా చెయ్యబడ్డాడు. అయితే అది స్టాలిన్ కాలంలో జరిగింది. స్టాలిన్ మరణించి దాదాపు 13 సం.లు జరిగినవి. అప్పుడు రచయితకు కారాగారశిక్ష విధింపబడలేదు. ఇప్పుడు చెఱసాల. సోవియట్ ప్రభుత్వం రచయితల విషయం లోనే ఇంతకఠినంగా ఉంటే—దృష్టిలో మార్పులు తెచ్చుకోవడం అంటూ లేనేలేదని శాంతివాదులు భయవిస్మయాల్ని వెలిబుచ్చుతున్నారు.

స్టాలిన్ మరణానంతరం రష్యాలో అనేక మార్పులు వచ్చిన మాట వాస్తవమే. నేరవిచారణా విధానంలో కూడా అనేకమార్పులు వచ్చినమాట యధార్థమే. నేరం ఋజువు అయ్యేదాకా నేరస్థుడు నిర్దోషిగా భావింపబడవలసిన (Presumption of innocence) దనీ, నేరస్థునికి న్యాయవాది సాహాయ్యము లభింపచేయవలసి ఉంటుందనీ (Right to Counsel)—నేరస్థునికి కూడా అనేకమైన హక్కులు వున్నాయు (Rights of the Accused) నీ నాగరక మైన న్యాయసూత్రాలు సోవియట్ న్యాయవిచారణా విధానంలో ఈమధ్య కాలంలోనే స్థానాన్ని చేకూర్చు కున్నాయి.

స్టాలిన్ మరణానంతరం గత పదిసంవత్సరాల లోనూ వచ్చిన న్యాయవిచారణా విధానంలో మార్పుల వల్లనూ—దేశంలోవున్న సౌమ్య రాజకీయ వాతావరణం వల్లనూ—సినియవాస్కీ—డేనియల్‌లకు—ఏదో ఒక విధమైన విచారణ అంటూ లభించింది. వాళ్ళు చేసిన ప్రతివాద ప్రసంగాలు పట్టించుకున్నవాళ్లు లేక పోయినా—న్యాయస్థానంలో—ధైర్యంగా ప్రతివాదం చెయ్యడానికి సావకాశం లభించింది. సోవియట్‌దేశంలో న్యాయవిచారణ చరిత్రను పరిశీలిస్తే—ఇది చెప్పుకోతగిన మార్పే. హర్షింపదగిన వృద్ధుత్వమే. గణనీయమైన నాగరక గుణమే.

న్యాయస్థానంలో నేరారోపణ చేసినది సోవియట్ రచయితల సంఘంవారు. ఆ సంఘంవారు చెబు తున్న మాటలనుబట్టి—ఈ రచయితలు తమకు ఇష్టమైన రచనాసంవిధానం అవలంబించినందుకు కాదు—నేరం మోపబడింది. సోవియట్ ప్రభుత్వాన్ని, సోవియట్ ప్రజలను, సోవియట్ జీవన విధానాన్ని, కమ్యూనిస్టుపార్టీని—వ్యంగ్యదూషణలమూలంగా అప నిందలపాలు చేసినందుకు. ఏ ప్రభుత్వమైనా—తన్ను దూషించేవారినుండి తన్ను కూలద్రోసేవారినుండి— రక్షించుకుంటుందికదా! సోవియట్ ప్రభుత్వం కూడా అంతే చేసింది.

ఈ రచయితల విచారణలో అవలంబించిన న్యాయ సూత్రాలు శ్లాఘనీయంగా ఉన్నాయనీ—ఉదారమైన సోవియట్ న్యాయ చట్టాన్ని శిరసావహించినవిగా ఉన్నాయనీ—సోవియట్ రచయితలేకాకుండా ఇతర వృత్తి వర్గాలవారు కూడా అభిప్రాయపడుతున్నారు.

ఐతే సోవియట్ భూమిమీద శిఖరాగ్రస్థాయిలో ఉన్న మహామేధావులు ఎవ్వరూ—ఈ విచారణా సంద ర్భంలో నోరు విప్పలేదు. కీర్తిప్రతిష్ఠలుగల ఏమేధావీ—ఈ రచయితలకు అనుకూలంగాకాని ప్రతి కూలంగాకాని మాట్లాడలేదు.

మనదేశంలో ఏదైనా ఒక కేసు కోర్టు విచారణలో ఉండగా దానిలోఉన్న న్యాయాన్యాయాల్ని గురించి మాట్లాడకూడదు. సర్వసర్వంసహాధికారం గలిగిన లోకసభకూడా ఆ విషయాన్ని చర్చించదు. అట్లా చెయ్యడంవల్ల నేరస్థునికి అన్యాయం జరుగ వచ్చునని (Subjudice) మనం అభిప్రాయపడతాము.

ఈ రచయితల విచారణ సందర్భంలో సోవియట్ పత్రికలూ, ప్రభుత్వమూ, ఈ నిగ్రహాన్ని అవలం

బించలేదు. కేసు విచారణ ప్రారంభం కాకముందే రేడియోలోనూ—ప్రభుత్వంవారి పత్రికలలోనూ—ఈ రచయితలమీద దూషణ దుమారం రేగింది. రెండు ముఖాల రాక్షసులనీ—సోవియట్ ప్రభుత్వానికి, మాతృభూమికి, సోవియట్ సాహిత్యానికీ మహాద్రోహం చేసినవాళ్లనీ—అల్పమైన మలినమైన రోతపుట్టించే క్రూరతనపు ఊహలనుంచి—దేశద్రోహందాకా, వీళ్లు చెయ్యనిది లేదనీ—ప్రచారాలు సాగినవి.

విచారణ ప్రారంభం అయింది. సోవియట్ రచయితల సంఘంవారి తరఫున శ్రీమతి కేద్రినా (Kedrina), అర్కాడి యన్. వాస్సిలెవ్ (Arkadi N. Vassilev) పిర్యాదులుగా (Prosecutors) వ్యవహరించారు. నేరస్థులుగా ఎంచబడిన ప్రతివాది రచయితల తరఫున కూడా వాదించడానికి న్యాయవాదుల్ని నిర్ణయించడం జరిగింది.

విచారణ తొలిదశలో—ఎన్నో నేరాలు మోపబడ్డాయి. కాని చివరకు మిగిలినవి మాత్రం రెండే. సోవియట్ ప్రజలను వ్యంగ్య చిత్రణం మూలంగా పహాస్యంచేసిఅపనిందలపాలుచేసినట్లు, తమ రచనలలో రష్యాదేశంలో కూడా జర్మనీలోవలె యూదు జాతీయులను ద్వేషించడం ఉన్నట్లుగా చిత్రించి—అసత్యాన్ని ప్రచారం చెయ్యడం, (నిజానికి వాళ్ల రచనలవల్ల వాళ్లే యూదుజాతి ద్వేషం కలవాళ్లని కన్పడుతూన్నదట)—ఇది వాళ్లు చేసినట్లుగా చెప్పబడిన ముఖ్యమైన నేరాలు.

సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకమైన ప్రచార సాహిత్యం తయారుచేసినా—దగ్గరవుంచుకున్నా—పంచిపెట్టినా — (సోవియట్ శిక్షాస్మృతి 70 వ సూత్రం) ఏడు సంవత్సరాలు కఠినశిక్షా— అయిదు సంవత్సరాలు బహిష్కారమూ—ఉన్నది గనుక విచారణ మొదలుపెట్టిన సమయానికే—ఈ రచయితలకు శిక్షలు తప్పవని అందరికీ తెలుసు. కాని న్యాయస్థానంలో ఈ రచయితలు చూపించిన

ధైర్యం, ప్రసంగ చాతుర్యం, హుందాతనం—ఏభాషా సాహిత్య చరిత్రకైనా అలంకారప్రాయంగా ఉన్నాయి.

యూదు జాతి విద్వేషాన్ని గురించిన నేరం విచారణలో నిలువలేదు. నిజానికి అది అసంగతమే. సినియవొస్కీ రచించిన నవలలో కొన్నిపాత్రలు ఆ అభిప్రాయాలు వెలిబుచ్చినా—వాటిని మరికొన్ని పాత్రలు ఖండించాయి. చెలియలికట్ట నవలలో రంగారావు అభిప్రాయాలనుబట్టి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు సనాతన మత విరోధి అని ప్రచారం చేసినట్లుగా ఉన్నది ఆ నేరారోపణ.ఆ ఆరోపణ ఉపసంహరించుకోబడింది. ఇక మిగిలిందిమొదటి నేరమే.

సోవియట్ రచయితల సంఘం తరఫున ఫిర్యాదులుగా వ్యవహరించిన ఇద్దరు రచయితలు కాకుండా—వాళ్లకు సహాయంగా ఒక న్యాయవాది కూడా ఉన్నాడు. ఆయన పేరు ఒలెగ్ టెముష్కిన్ (Oleg Temushkin). విచారణ జరిపిన న్యాయాధిపతుల అధ్యక్షుడు స్మిర్నోవ్ (Judge Smirnov.)

న్యాయస్థానంలో డేనియల్ విచారణ సందర్భంగా జరిగిన సంభాషణ పరిశీలింప తగినదిగా ఉన్నది. దీనిని ప్రముఖ పాశ్చాత్యపత్రికలు యిదివరకే ప్రకటించాయి.

ఫిర్యాది టెముష్కిన్: ప్రతివాది డేనియల్! నువ్వు 'మాస్కో మాటాడుతున్నది' (Moscow Speaking) అన్న రచనలో వ్యక్తం చెయ్యదలచుకున్న అభిప్రాయాలు ఏమిటి?

డేనియల్: ఒక విచిత్ర పరిస్థితిలో ఉన్న జనానీకంయొక్క మానసిక పరిస్థితిని (Psychology) అభివ్యక్తం చెయ్యడానికి నేను ప్రయత్నించాను. దానికి రాజకీయమైన ఊహలు అంటకట్టరాదు.అదిమానసిక శాస్త్ర దృష్ట్యా చెయ్యబడిన వ్యంగ్య చిత్రణం మాత్రమే. మీరు గ్రహించి ఉంటారు—నేనొక విచిత్ర పరిస్థితిని కల్పించి—ఆ పరిస్థితిలో మానవ మానసిక స్థితిని అభివ్యక్తం చెయ్యడానికి ప్రయత్నించాను. నిజంగా అది భ్రాంతిపూర్ణమైన ప్రహేళిక.

టెముష్కిన్: అట్లా అయితే కథాస్థలంగా ఇంకో నగరం దొరకకపోయిందా? ఉదాహరణకు పురాతన నగరం బాబిలోన్ పనికిరాదా? ఒట్టి భ్రాంతుల చిత్రణతో స్వజనాన్ని అపహాస్యం చెయ్యడం దేనికి?

డేనియల్: అది కళా శిల్పం.

న్యాయాధిపతి స్మిర్నోవ్: సోవియట్ ప్రభుత్వం యథేచ్ఛగా హత్యలు చెయ్యడానికి హంతకులకు ఒక స్వేచ్ఛాదినం ప్రకటిస్తుందని ఎవ్వరు నమ్ముతారు?

డేనియల్: ఎవ్వరూ నమ్మరని నిర్ధారణ అయినప్పుడు—ఈ వ్యంగ్య చిత్రణంతో ఎవ్వరినో అపహాస్యం చేస్తున్నట్లూ, అపనిందలపాలు చేస్తున్నట్లూ అనుకోవడానికి ఆస్కారం లేదు.

న్యాయాధిపతి స్మిర్నోవ్: అపనిందల పాలు చెయ్యడమంటే (Slander) తప్పుడుమైన అభూత కల్పనలు ప్రచారం చెయ్యడమే. అనగా నువ్వు చేసిన రచన అపనిందాకరంగా ఉన్నదన్నమాట.

డేనియల్: కాదు. అది కళాత్మకమైన అతిశయోక్తి అలంకారము మాత్రమే.

న్యాయస్థానంలో జరిగిన ఈ సంభాషణ వ్యాఖ్యానాపేక్ష లేకుండా అవగాహన అవుతూనే ఉన్నది.

న్యాయాధిపతులు మాత్రం—ప్రతివాదుల పట్ల గౌరవమూ, మర్యాదా చూపించినట్లున్నూ, చివరి దాకా శాంతి సహనాలతో ప్రవర్తించినట్లున్నూ కన్పడుతున్నది. ప్రావదా, ఇతర ప్రభుత్వ, ప్రభుత్వేతర పత్రికలూ, ఈ సహనాన్ని ప్రతిఫలించలేదు. అవి ఈ రచయితలపైన కించిదభిమానాన్ని కూడా చూపించలేదు. వాళ్ల అభిప్రాయాలు ఏమిటో—అవి ఎందుకు నేరంగా భావింపబడుతున్నాయో విశదీకరించడానికి ప్రయత్నమూ చెయ్యలేదు.

న్యాయస్థానంలో ప్రతివాదులు నేరం చేసినట్లు అంగీకరించలేదు. న్యాయాధిపతి వర్గానికి అధ్యక్షుడు (Chairman of the Court) ప్రశ్నించగా, ప్రతివాదుల్ని

తాము నేరం చేసినట్లుగాని, తాము సోవియట్ రేకమైన ప్రచారం చేసినట్లుగాని, తమ రచనలు రష్యాదేశానికి వ్యతిరేకంగా ఉపయోగబడవచ్చుననిగాని అంగీకరించలేదు.

ఈ రచయితలపైన విచారణా, శిక్షా, ఇట్లా ఉండగా—ఈ తతంగాన్ని తీవ్రంగా అధిక్షేపణ చేస్తూ, ప్రభుత్వ వ్యతిరేక కవి, యెసెనిన్ వోల్పిన్ (Yesenin Volpin) కావించిన ప్రసంగాన్ని ప్రభుత్వ పత్రికలు ప్రకటించాయి. ఈ రచయితలకంటె ప్రముఖుడైన వేలరీ టార్సిస్‌ను ప్రభుత్వంవారు ఇంగ్లాండు వెళ్లి పోవనిచ్చారు.

రష్యాలో పుట్టి, రష్యాలో పెరిగి, రష్యాలోనే విద్యాబుద్ధులు నేర్చి రష్యా ప్రజలతో పెనవేసుకు పోయిన రక్తబాంధవ్యాలు కలిగి—ఈ రచయితలు రష్యా వ్యతిరేకమైన సాహిత్య-సృష్టికి ఎందుకు పూను కున్నారు? అసలు వాళ్లు కల్పించిన సాహిత్యం ఎంత వరకు సోవియట్ వ్యతిరేకమైనది? ఈ ప్రశ్నలకు సంపూర్ణమైన సమాధానాలు—అందరికీ తృప్తిని కలిగించేవి—చెప్పడం కష్టమే.

రష్యాదేశంలో జనసామాన్యం—ఈ రచయితల రచనలలో అభివ్యక్తం చేయబడిన అభిప్రాయాలను తెలిసిన వాళ్లేననీ—ఆ అభిప్రాయాలు సోవియట్ ప్రజలకు గౌరవాస్పదంగాలేవని అంగీకరిస్తారనీ ఒప్పుకోకతప్పదు. కాని అంతమాత్రంచేత ఆ జనసామాన్యానికి ఈ రచయితలమీద హేయభావం లేదు. అభిమానం కూడా ఉన్నది. వాళ్ల ధైర్యానికీ, హుందతనానికీ మెచ్చుకోలు కూడా ఉన్నది. అయితే వాళ్ల అభిప్రాయాలతో అంగీకారం లేనేలేదు.

ఇంతకూ ఈ విచారణ, ఈ తీర్పు—ఈ తంతు, యావత్తూ సోవియట్ భూమిలో ఉన్న పరిస్థితుల్ని ప్రతిబింబించేదిగా ఉన్నదని చెటితేమాత్రం నిర్వివాద విషయం. అటూ ఇటూ ఇన్ని వివరాలు, విశదీకరణాలు, పరిశీలించిన తర్వాత మనం ఫిర్యాదుల పైన గాని, ప్రతివాదుల పైనగాని ఆగ్రహం పడటం సమంజసం కాదు. ఇటువంటి సన్నివేశాలలో కోపం—అల్పమైన అమేధా విలక్షణమే (Cheap anti-Intellectualism) అవుతుంది.

ఈ వ్యాసానికి ముగింపుగా ఏవైనా ముక్తాయింపు మాటలు కావాలనుకుంటే—ఇట్లా అనుకుందాము. కళాకారుల ఆవేశాత్మక సృష్టిని తీవ్ర పరిశీలన చెయ్యకుండా—అది అతని తాత్త్వికభావనా ప్రతిబింబమనిగాని—రాజకీయ సిద్ధాంత చింతనా స్వరూపమనిగాని—చెప్పడానికి సాహసం చెయ్యకూడదు. అతృప్తితో బాధపడుతున్న, ఏదో అన్యాయానికి తాము గురి అయిపోయినట్లు వెతచెందుతున్న కళాకారులూ, రచయితలూ, అన్నిదేశాలలోనూ అన్ని వ్యవస్థలలోనూ, అన్ని రాజకీయ సిద్ధాంతాల క్రిందా—ఉంటూనే ఉంటారు. అదే మానవసృష్టి సహజత్వం.



# అష్టభాషలు

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

తెలుగుకవులు ప్రాకృత భాషలలో పాండిత్యము సంపాదించిన వెనుక, అష్టభాషలనునవి ప్రచారములోనికి వచ్చినవి. నన్నయ కాలమునగాని, తిక్కన కాలమునగాని ఉభయభాషలనియే కాని, అష్టభాషలను వ్యవహారములేదు. క్రీ. శ. పదునాల్గవ శతాబ్ది ప్రారంభము నుండియు అష్టభాషా వ్యవహారము వచ్చినది. ఇదియే—చారిత్రకముగా, సమంజసముగా నున్నది. ఏలయనగా—ఉభయభాషలనగా, సంస్కృతము, తెలుగు—అనునవి—రెండు. వీనితో గూడ, ప్రాకృత భాషాభేదము లాఱింటిని—చేర్చి అష్టభాషలని లాక్షణికుల మతము. అప్పకవి వీనినిట్లు వివరించినాడు.

> గీ. సంస్కృతము, ప్రాకృతంబును శౌరసేని
> జగతిపై మాగధియును బైశాచికయును
> జూళికయు నపభ్రంశంబు సొరిదినంధ్ర
> భాషయును నివి చను నష్టభాషలనఁగ.

1. సంస్కృతము, 2. ప్రాకృతము 3. శౌరసేని 4. మాగధి 5. పైశాచిక 6. చూళిక 7. అపభ్రంశము 8. ఆంధ్రభాష—ఇవి అష్టభాషలు.

ప్రాచీనకవులలో భాస్కర రామాయణ రచయితలలో నొకడును, భాస్కర కవిపుత్రుడును అగు మల్లికార్జునభట్టు గద్యలో "శ్రీమ దష్టభాషా కవిమిత్ర కుల పవిత్ర భాస్కర సత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన" అని అష్టభాషా విషయము ప్రస్తావించినాడు. అట్లే వెన్నెలకంటి అన్నయయు షోడశ కుమార చరిత్రమున "అష్టభాషల మధు రాశు విస్తర చిత్ర కవితల—(6—13) అని వ్రాసియున్నాడు.

క్రీ. శ. 1656 సంవత్సరమున అప్పకవి పై విభాగము చెప్పియున్నను—నంతకుముందే ప్రాకృత భాషా భేదములలో భేదమున్నట్లు తెలియుచున్నది.

క్రీ. శ. 1537 లో తాళ్ళపాక అన్నమాచార్యుల మనమడు—చినతిరుమలాచార్యుడు— అష్టభాషా దండకము అనునొక దండకము—ఎనిమిది భాషలలో రచియించి యున్నాడు. అది ముద్రితమైనది.[1] మూలము—రాగిరేకుల పైని వ్రాయబడి యున్నది.

అందున్న భాషలు—

1. సంస్కృతభాష 2. ప్రాకృతభాష 3. శూరసేన భాష 4. మాగధభాషా 5. పైశాచభాష—అపభ్రంశభాష 6. ప్రాచీభాషా 7. అవంతీభాషా 8. సార్వదేశీభాష—లేక నాగరభాష.

కాని యివి అప్పకవి యిచ్చిన వానికంటె భేదించుచున్నవి. విశదముగా నుండుటకై వారిచ్చిన పేళ్లను ఎదురెదురుగా నిచ్చుచున్నాను.

| అప్పకవి | తాళ్ళపాక చిన |
|---|---|
| 1. సంస్కృతము | సంస్కృతము |
| 2. ప్రాకృతము | ప్రాకృతము |
| 3. శౌరసేని | శూరసేనభాష |
| 4. మాగధి | మగధభాష |
| 5. పైశాచిక | పైశాచ—అపభ్రంశభాష |
| 6. చూళిక | ప్రాచీభాష |
| 7. అపభ్రంశము | అవంతిభాష |
| 8. ఆంధ్రభాష | సార్వదేశిభాష. |

అప్పకవి కన్న 130 యేండ్లు పూర్వుడగు చినతిరుమలాచార్యుడు చెప్పిన వానికిని—అప్పకవి చెప్పిన దానికి ప్రాకృత భాషలలోనే భేదమున్నది. అప్పకవి ఆంధ్రభాషను చేర్చియున్నాడు. అపభ్రంశము

1 Minor works of Tallapakam Poets, T. T. Davastanam Publication—పుటలు. 151—156.

దీని సరియగు ఇంగ్లీషు తేది—7-11-1537.

వేఱుగానిచ్చినాడు. చినతిరుమలయ్యప్రకారము—ఆంధ్ర భాష—ప్రాకృతములోలేదు. కాని సార్వదేశి—అను దానిలో ఆంధ్రభాష పరిగణితమైనట్లు గ్రహింప వచ్చును. ఏలయనగా దానిని 'నాగరభాష' అని కూడ యీతడు వ్యవహరించి యున్నాడు.

తాళ్లపాక వారి కృతులతో పరిచయమున్న అప్పకవి2 ప్రాకృతభాషా విషయమున నిట్టి భేదము లను వివరించుటకు గల కారణము దురూహ్యముగా నున్నది.

క్రీ. శ. 1550 ప్రాంతము వాడగు దోనూరి కోనేరు నాథకవి తాను "సీ. భాసుర సంస్కృత ప్రాకృతాదిక శాస్త్రభాషా కవిత్వ సౌభాగ్యనిపుణు" అనియు "వినుతాష్ట భాషాకవిత్వ ప్రచండు" అని చెప్పుకొన్నాడు.

హంసవింశతిలో అయ్యలరాజు నారాయణా మాత్యుడు అప్పకవి చెప్పిన అష్టభాషలు పేర్కొన్నాడు. (3—127).

ధరణీదేవుల రామమంత్రి దశావతార చరిత్రలో—

సీ. శ్రీరామ కరుణా రసారూఢ సంస్కృత
ప్రాకృతాద్యష్ట భాషాకవిత్వ
తత్త్వసంవేది" అని (1—26) లో

చెప్పుకొన్నాడు.

శ్రేష్టలూరి వెంకటార్యుడు శ్రీనివాస విలాస సేవధిలో "ధర సంస్కృత ప్రాకృత ముఖ భాషలను ద్రవిడాంధ్రముల ప్రబంధము లెన్నియైన" (అవతారిక) అని తన పాకృతభాషా పరిచయము తెలుపు కొన్నాడు.

## దక్షిణాంధ్ర వాఙ్మయము

దక్షిణాంధ్ర వాఙ్మయమున వెలసిన సాహిత్యము లో ప్రాకృతభాషా ప్రసక్తి యున్నది. క్రీ. శ. 1614—1633 వఱకు తంజావూరిని పాలించిన రఘునాథనాయకునికాలమున—అష్టాభాషలలో సమస్యా పూరణము జరిగినట్లు యజ్ఞనారాయణ దీక్షితుడు సాహిత్యరత్నాకరము ౧౧ సర్గ 34 వ శ్లోకములో చెప్పియున్నాడు. ఆ సమస్యలను బట్టి ఆకాలమున "అష్టభాషలు" అనగా, సంస్కృతము, ప్రాకృతము శౌరసేని, మాగధి, పైశాచి, చూళికా పైశాచి, అప భ్రంశము, ఆంధ్రము (తెలుగు) అని స్పష్టమగు చున్నది. ఇవి అప్పకవి యిచ్చిన వివరణముతో సరిపోవు చున్నవి. కాని క్రీ. శ. 1633—1673 ప్రాంత మున విజయరాఘవుని కాలములోనున్న రంగాజమ్మ తన మన్నారుదాసవిలాసమున నీ ప్రాకృత భాషలను, వేఱుగా పేర్కొన్నది.

1. చూళిక 2. అపభ్రంశము 3. ప్రాకృతము 4. పైశాచి 5. శౌరసేని 6. మాగధి 7. దేశి 8. సంస్కృతము—ఇవిగాక, "భాండీరభాషా" అని యొక ప్రాకృతభాషా భేదము పేర్కొనబడినది. దాని లక్షణము.

### భాండీరభాష

"కాంభోజా మాగధీ గౌడీ మహారాష్ట్రీ కళింగజా
గైర్వాణీ మిశ్రితాభాషా భాండీరీతి ప్రకీర్తితా"

ఈ భాషోదాహరణము చూచిన నిది 'సార్వదేశి' అగును.

శ్రీకృష్ణ నానందకరు
తుహ మన్నారుదాసరె
తుమహ మానంద కరుహే
రాయ గోప్పాళు చె సయా.

రఘునాథనాయకునికాలమున—మధురవాణి—ప్రాకృతభాషా కవయిత్రి అని తెలియవచ్చు చున్నది. కాని ఆమె రచనలు కానరాలేదు. ఇక, దక్షిణాంధ్ర వాఙ్మయమున వెలసిన ప్రాకృత రచనల నొకచో చూపినచో, ప్రాకృత భాషావేత్తలయిన విద్వాంసులు, ఆయా భాషాభేదములను గుర్తింతురని యిచ్చుట వానిని వివరించుచున్నాను.

విజయరాఘవుని కాలమున మధురకవి యిచ్చిన ప్రాకృత సమస్యలను సకల విద్యా సార్వభౌముడు పూరించినవి.

### సమస్య

ప్రాకృతము—జయుఁయి సయా వియయక్కీరాహవో
రాయా

"వయణ రుయి వియియ చందో

---

2. 'రేఫ ఱకార నిర్ణయముపట్ల—"తాళ్లపా కాన్వయోదధి ధవళధీధితి పెద తిరుమల దేశికుండు"— అని తాళ్లపాక పెదతిరుమలయ్యగారి రేఫ ఱకార నిర్ణయమును—పేర్కొన్నాడు.

వయణ విలాసోహినందియాయరియో
జావయాజణణ సమయణో
జయుంయి సయా వియయు రాహవో రాయా

శౌరసేని—స. కుహప్పదావో తమోహరది
"సుయ్యోభవం మహందో
మణ్ణారుదాస భమావాళ
జాత్తణ్ణి మంఖుదాణిం
తుహప్పదావో తమోహరది"

మాగధి—స. వియయుపదాళూడ శాహవే జయది
"శోహణ బంహణ శంఖం
లుకండె లజ్జలంఖ్కణో వేదో
అన్నాళియ మహిమనిహీ
వియయ పవాళూఢ శాహవే జయది"

పైశాచి—స. తురుఖు సమోనద్ది భూతలంమికయా
"మన్నలతాసోకు నాది బూమిపంయా
వెన్నుసరిఛోవిజ్జె
పున్నమ చందొద్దిదంసనం మితుమం
దహునాధ తమాయ పునో
తురుఖుసమోనద్ది బూతలమ్మికయా.',

చూళికాపైశాచి-స. మన్నలుతాసోకునాదికోబూవిపంయా
"దవతి వన్నె దమ్మెతేతి
తుచాతినకంకితాయింపలాయిం
బత్తాసనాహిలాదో
మన్నలుతాసోకనాదికోబూమిపంయా

అపభ్రంశము—స. రావూవియయురాహవూ
"వెణ్ణపావుపయోజాద
భమరికియుమానసు
సయా జయది తంకేసు
రావూవియయు రాహ వో
మన్నారుదాస విలాసము

చూళిక.

ఖమళ విళోచణ మధణే
యాచక ఋణ ధొవ్వపాధపో యేసో
బాహోబళ బళపద్దో
ఆరవికారాయ వియయురాఘవో వియయు".

అపభ్రంశము

పుణుకావిగోడితుంహే
డత్ప్టాణమణేణ్ణ రూవు అసమాణు
తాయియ నిర్భర విరహ
ప్పహోవు మణ్ణారుదాసు భూపాళు.

ప్రాకృతము.

భద్దం దేయు పుణేతుహా
చంపయు రణ్ణప్ప యేన సంచాళో
హొరిద్దణంయితడుజ్జ్వలి
మందిర విహంయాయ రాయగోపాళో

పైశాచి.

సేవజ్యో గునవంతో,
బమ్మన హచ్చాను పూళ నద్ద మహదానో
నార్యవెన్నపసమానో
లోకవిళోకస్స పుణ్ణో నిమ చందో"

శౌరసేని.

విదద యసో వత్తదిసో
జయుంయి సుహద్దణ్ని యేసో
కణ్ణపదభత్తిసీళో
మణ్ణరుదాసో మహీపాళో

మాగధి.

పుశుప శరాశన శరిశే
రూవేణ హరియ్యు మహిమాయే
దాణేహిం రాహేయే
వియయుంయి రహుణాహశావి సంతానే

తిహువణకర్తారుతుమం
ధణేసుదాతారు గాణ బయుకారు
సమర హళబ్బొళ దునెదారు
మహోదారు మన్నారు.

ఈ శ్లో [ప్రాకృతము లేడింటితో—సంస్కృతము కలిపిన—అష్టభాష లగుచున్నవి. ఇవి అష్టభాషా దండక భాషలతో సరిపోల్చిన ఇట్లుండును.

| తిరుమలాచార్యుడు | రంగాజమ్మ |
|---|---|
| సంస్కృతము | సంస్కృతము |
| ప్రాకృతము | ప్రాకృతము |

3. గ్రంధ విస్తర భీతిచేత నీ ప్రాకృతములకు సంస్కృత ఛ్ఛాయలనీయలేదు. వాని సంపూర్ణ వివరణ మునకు నా "దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము" 'సాహిత్య సమీక్ష' చూడనగును.

| | |
|---|---|
| శూరసేని | శూరసేని |
| మగధభాష | మాగధీ |
| పైశాచి— | పైశాచి |
| ప్రాచీభాష | చూళిక |
| అవంతిభాష | |
| సార్వదేశి | దేశి |

దీనినిబట్టి—చూళిక—ప్రాచీభాష — అపభ్రంశము—అవంతి భాష యని సమన్వయింప వచ్చునేమో ప్రాకృతభాషా విద్వాంసులు—విచారణ సేయుదురుగాక.

## 19 వ శతాబ్ది

ప్రాకృతమున మనకు పై విధముగా నెనిమిది భేదము లగుపడుచున్నను, అప్పకవి చెప్పిన రీతిని ఆఱు ప్రాకృతముల నుండి తద్భవము లేర్పడినవని. మామిడి వెంకయ్య—అను పండితుడు (1764—1834) తన ఆంధ్రదీపికానిఘంటువు అవతారిక4 యందిట్లు వివరించియున్నాడు.

### ప్రాకృతము

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు |
|---|---|---|
| చక్రవాకః | చకవాయో | జక్కవ |
| ఉపాధ్యాయః | ఒజ్ఝావో | ఒజ్జ |
| ద్వీప | దివా | |
| బ్రహ్మ | బమ్హ | బొమ్మ |
| కాంస్యమ్ | కంసో | కంచు |
| యశః | యసో | అసము |

### శౌరసేనీ

| సంస్కృతము | శౌరసేని | తెలుగు |
|---|---|---|
| యజ్ఞోపవీతమ్ | జన్నిదామ్ | జన్నిదము |
| ప్రతిజ్ఞాతమ్ | పదిన్నదమ్ | పన్నిదము |
| హింతాల | | ఈఁదు |
| హరిదాళః | హరిదళో | అరిదళము |
| ధాతు | దాదు | జాదు |

### మాగధీ

| సంస్కృతము | మాగధీ | తెలుగు |
|---|---|---|
| నేదిష్టమ్ | నేదిష్టమ్ | నేస్తము |
| గేహస్థః | గేహస్థ | గేస్తు |
| కష్టమ్ | కష్టమ్ | కస్తి |
| రామా | లామా | లేమ |

### పైశాచి

| సంస్కృతము | పైశాచి | తెలుగు |
|---|---|---|
| అలక్తః | అలత్తొ | లత్తుక |
| శష్కులి | శకులి | చక్కిలము |
| ఊర్ణ | ఉన్న | ఉన్ని |
| త్రిలింగః | తిలింగో | తెలుంగు, తెలుగు, తెనుంగు. |
| స్వర్ణమ్ | సన్నమ్ | సొన్న |
| నిశ్రేణి | నిసేన | నిచ్చెన |

### చూళిక

| సంస్కృతము | చూళిక | తెలుగు |
|---|---|---|
| బృంద | పుండొ | పిండు |
| బుద్ధ | పుద్దొ | పెద్ద |
| స్వర్ణమ్ | పానో | పొన్ను |
| మృగః | మెకొ | మెకము |
| బ్రధ్నః | పద్దో | ప్రొద్దు, పొద్దు |

### అపభ్రంశము

| సంస్కృతము | అపభ్రంశము | తెలుగు |
|---|---|---|
| బ్రాహ్మణుడు | బాహ్మడు | బాపడు |
| అబద్ధమ్ | అబడ్డన్ | బడ్డు |
| స నమ్ | తను | నను |
| శ్రుతమ్ | సూడు | చదువు |

పై భాషలు వ్యవహారమునన్న దేశములు—

| | | |
|---|---|---|
| ప్రాకృతము | మహారాష్ట్రదేశము | దక్షిణము-పశ్చిమను |
| శౌరసేని | శూరసేన | ఉత్తరదేశము మధురా ప్రాంతము |
| మాగధి | మగధ | ,, బీహారురాష్ట్రము |
| పైశాచి | పాండ్యకేకయ | దక్షిణ—ఉత్తరములు |
| చూళిక | గాంధార,నేపాళ, కుంతల- | ఉత్తర – దక్షిణములు |
| అపభ్రంశము | ఆభీరదేశము | దక్షిణ—పశ్చిమము |

పైశాచిభాష పై దేశములందేకాక బాహ్లిక, సహ్య, సుదేష్ణ, భోట, హైవ, కన్నోజ దేశములందు వ్యాప్తిలోనున్నది. అప్పకవీయము (1—81)

---

4. ఆంధ్రదీపిక అవతారిక అముద్రితము. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార వివరణ సంపుటి. 5. గ్రంథ సంఖ్య 44.

### ప్రాకృత సాహిత్యము

ప్రాకృతభాషలు మాటాడు పై ప్రదేశములు పదిహేనింటిలో పైశాచి, చూళికాపైశాచి మాట్లాడు ప్రదేశములే హెచ్చుగా నున్నవి. అవి పదనొకొండు—వానిలో—రెండు—పాండ్య—కుంతల అనునవి దక్షిణమున గలవు. తక్కిన తొమ్మిదియు ఉత్తర హిందూస్థానమునకు సంబంధించినవే. మిగిలిన నాల్గింటిలోను—మహారాష్ట్రము—అభీరము రెండు దక్షిణమున గలవు. తక్కిన రెండును ఉత్తరభారతమునకు సంబంధించినవి.

ప్రాకృతము కంటె, పైశాచీ భాష మాటలాడు ప్రదేశములే హెచ్చుగానున్నను, తెలుగువారికి సన్నిహితమైనదీ, వారు పరిశ్రమ చేసినదీ మహారాష్ట్ర దేశీయ ప్రాకృతమేయని నిశ్చయముగా చెప్పవచ్చును. తెలుగు దేశమునకు పశ్చిమదేశమున నుండుటయే గాక ఆంధ్రరాజధాని—మహరాష్ట్రములోనే యున్నది. ఇంతేకాక ప్రాకృత భాషలన్నింటిలో సారస్వత మున్నది, మహారాష్ట్ర ప్రాకృతభాషలోనే యగుటయు నీ విషయము ధృఢపఱచుచున్నది.

పై భాషలో కూడ, తెలుగు కవులు పరిశ్రమ చేసినట్లీవరకే చూపితిని. కాని ఆ పరిశ్రమ, అయా కవుల భాషా పరిజ్ఞానమే తెలుపునుగాని తెలుగుభాషకు, ఆ ప్రాకృత భాషలకు జన్యజనక సంబంధమున్నదని యెంతమాత్రము నిరూపింపజాలదు.

పై ప్రాకృతములలో— అప్పకవి చెప్పక, తక్కిన తెలుగుకవుల ప్రాకృత రచనలలో, 'దేశి' అను ప్రాకృత భేదము మనకు చాలముఖ్యమైనది. ఈ 'దేశి' అనునది ప్రాకృత భాషలోనే, అవ్యుత్పన్నము అను నర్థము గలది. కాబట్టి ఆ దేశి పదములు, ప్రాకృతమున వ్యవహారమున నున్నను, వాని వ్యుత్పత్తి నెఱుగుట దుస్సాధ్యమగుటచేత హేమచంద్రాచార్యుడు ఆ పదములను ప్రత్యేకముగ విడదీసి, వాని కొరకు నిఘంటువు రచించి యున్నాడు. 'దేశినామమాలా' అని దాని పేరు. దానిలోని కొన్ని పదములు, తెలుగులో దేశికి మూలము లనదగినవి కలవు.

ప్రాకృత కావ్యమైన గాథాసప్తశతి యందే స్పష్టముగా తెలుగు పదములని చెప్పదగినవి యుండుటచేత—తెలుగు, ప్రాకృతభాష లేర్పడు నాటికి ముందు కాలముననే వ్యాప్తిలో నున్నట్లు నిశ్చయింపవచ్చును.

ప్రాకృత సాహిత్యమున గల శాలివాహన సప్తశతియే ప్రధానముగా తెలుగులోనికి వచ్చినది. దీని వివరము :

1. శాలివాహన సప్తశతి—శ్రీనాథకృతము— అలభ్యము

"నూనూగు మీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి" అను వాక్యము దీని కాధారము. మూడు పద్యములు దక్కినవి. వానిని మూలప్రాకృతముతో నుదాహరించుచున్నాను.

1. గాథ:—

విక్కిణఇ మాహమాసమ్మి
పామరో పాఇుడింవలీయేణ
ణిద్ధూమ ముమ్మురచ్చిఅ
సామలియధణో పడిచ్ఛన్తో

ఛాయ —

విక్రీణీతే మాఘమాసే
పామరః ప్రావరణం బలీవర్దేన
నిర్ధూమముర్మురనిభౌ
శ్యామల్యాస్తనౌ పశ్యన్ (3—88)

తెలుగు. మాఘమాసంబు పులివలె మలయు చుండ
బచ్చడం బమ్మ కొన్నాడు పసరమునకు
ముదిత చన్నులు పొగలేని ముర్మురములు
చలికి నారగోయు కే లుండు నైరికుండు.
(క్రీడా. 262.

2. గాథ—

ఝఞ్ఝావా ఉత్తణిఏ
ఘరమ్మి రోఊణ ణీసహ ణిసణ్ణమ్
దావేఇవ గఅవఇఅం
విజ్జుజ్జోఓ జలహరాణం

ఛాయ—

ఝఞ్ఝావాతోత్త
గృహేరుదిత్వా నిస్సహనిషణ్ణామ్
దర్శయతీవ గతపతికాం
విద్యుదుద్యోతోజలధరాణామ్. (4—15)

తెలుగు. పటుఝుంఝూపవనోత్త్రుణాలయములో
భద్రంబునం బట్టెకం
కటిపై ముచ్చముడింగి నిర్భర వియోగగ్లాని
శోషించి యె
క్కటి నిద్రించుచున్న పాంథవనితన్
గర్జా వచః ప్రౌఢిమన్
దటిదుద్యోతము చూపునట్టినడురే
ధారాధరశ్రేణికిన్. (క్రీడా 60)

పై రెండు పద్యములు క్రీడాభిరామములోనివి.

3. గాథ—

కన్న వ ణహోఇ రోసో
దట్ఠూణపి ఆఇ సవ్వణం అహరం
సభమర పడమగ్ఘాఇణి
వారిఆ వామే సహసు ఏణ్హిం.

ఛాయ. కన్యావానభవతి రోషోదృష్ట్వా
ప్రియాయా స్స్రవణ మధరం
సభ్రమర పద్మాఘ్రాయిణి
వారిత దామే సహస్వేదానీమ్. (7—34)

తెలుగు.

వారణసేయు దావగోనవా? నవవారిజమందు తేటి క్రొ
వ్వారుచు నుంట నీవెరుగవా ప్రియువా తెఱగంటిఁగంటికె
వ్వారికిఁ గెంపురాదె తగవా మగవారలదూఱ నీ విభుం
డారసి నీ నిజం బెఱుగునంతకు నంతకు నోర్వునెచ్చెలీ.

పై పద్యము శ్రీనాథుని సప్తశతిలోనిదని— తొలుత కీ. శే. మానవల్లి రామకృష్ణ కవిగార ప్రకటించిరి[5] వారిచ్చిన పదములో 'క్రొవ్వారుచు నుంట" అనుటకు బదులు "క్రొవ్వారుచు నంట" అనియు, "నీ వెఱుఁగవాప్రియ వాతెఱగంటి"అనుటకు బదులు"నీ వెఱుఁగవాప్రియ హా తెఱగంటి" అనియు పాఠ భేదములు కలవు. వీని నీ తరువాతి విమర్శకులు గుర్తించినట్లులేదు. ఇది ఏ లక్షణ గ్రంథము నుండి గ్రహింపబడినదో తెలియ లేదు. 73 వ పుటలోనే పుట యడుగున "శ్రీనాథుని సప్తశతి అ. ౪" అని కలదు. దీనిని బట్టి శ్రీనాథుని సప్తశతి వారికిపూర్తిగ లభ్యమైనదని తెలియుచున్నది. అది నాల్గాశ్వాసముల కృతికానోపును. ఏలయనఁగా పై గాథ 7 వ శతకము 34 వది. ఇదివరలో అందఱుదాహరించినది-యీ పద్యోదాహరణము ననుస రించియే యని తెలియనగును.

## ఆంధ్రీకరణములు

తెలుగున సప్తశతికి భాషాంతరీకరణములు తిరిగి ఇరువదవ శతాబ్దము నందనియే చెప్పవచ్చును. వానిలో నొకటియే సమగ్రము. తక్కినవి కొన్ని గాథల కనువాదములు మాత్రమే.

1. కీర్తిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రి గారు కొన్ని గాథలను తెలిగించిరి. ఇది క్రీ. శ. 1925 ప్రాంతము కావున. ప్రథమము.[6]

2. శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారు– శతకమునకు 14 గాథల చొప్పున ఏడు శతకముల నుండి 98 ఆద్యంత శివస్తుతులు రెండును కలిపి నూఱు గాథలను తెలుగు చేసిరి.

3. శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు-'గాథా సప్తశతీసారము' అనుపేర నిందలి గాథలను— 400—తెలిగించిరి.

4. సప్తశతీసారము. క్రీ. శ. 1410 ప్రాంత మున పెదకోమటి వేమభూపాలుడు రచియించిన నూటనాల్గు గాథల సంస్కృత వ్యాఖ్యానుసారముగ తెలుగులో వెలసినది. దీని రచయిత దిగుమర్తి సీతారామస్వామి ఎమ్. ఏ.[7]

---

5. కుమార సంభవము. ప్రథమ ముద్ర ణము. ప్రథమభాగము పుట 73. ఈ పద్యమును గూర్చిన సమగ్ర విచారణ శ్రీ తిమ్మావఝ్ఝలు కోదండ రామయ్య గారి 'తెలుగు మరుగుల'లో గలదు.

6. పరిశోధన సం. 1. సం. 3. ఆగస్టు సెప్టెంబరు 1954. శ్రీ ప్రభాకర స్మరణ సంచిక పుట 56.

7. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారిచే క్రీ. శ. 1951 లో ముద్రితమైనది.

5. గాథాసప్తశతి సంపూర్ణానువాదము[8]-ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి.

సేతుబంధము

దండి మహాకవి కీర్తించిన ప్రవరసేనుని సేతు బంధ కావ్యమును సంపూర్ణముగా శ్రీ మేడేపల్లి వెంకటరమణాచార్యులు గారు తెలిగించిరి.

క్రీ. శ. 1620 ప్రాంతములో నున్న తంజా వూరి రఘునాథ నాయకుని రామాయణమున సముద్ర వర్ణన సందర్భమున సేతుబంధమునగల వర్ణనలకు ఛాయలున్నవి.

ఆద్యతన యుగమున ప్రాకృతభాషా వాఙ్మ యములను గూర్చి గ్రంథము, వ్యాసములు ప్రక టితములైనవి. వ్యాసములలో ఒక్కటి తప్ప తక్కినవి కేవలము భాషా విషయుకమైనవే.

1. ప్రాకృత భాషోత్పత్తి[9] క్రీ.శే. శ్రీ మేడేపల్లి వెంకటరమణాచార్యులుగారు.

2. ప్రాకృత గ్రంథకర్తలూ ప్రజాసేవానూ— ఇది ప్రాకృత వాఙ్మయ స్వరూపమును తెలుపు నేకైక వ్యాసము. క్రీ. శే. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారిది.

ఇది వ్యాస సంగ్రహము— అను సంపుటమున ప్రకటితమైనది.

(గిడుగు రామమూర్తి సప్తతితమ సమ్మాన సంపుటము) 1933; పుటలు 145—226; 18 పుటల వ్యాసము.

దీనిని ప్రత్యేక గ్రంథముగా ముద్రించిన— ఇందలి విషయములు వెల్లడి కాగలవు.

3. కీ. శే. శ్రీ పరవస్తు రామానుజస్వామిగారు. ప్రాకృత భాషావ్యాసములు[10]-వీరాంగ్లేయ భాషలోను - తెలుగునను గ్రంథములు వ్యాసములు వ్రాసియున్నారు. వారి ప్రాకృత భాషా సేవ నిరుపమానము.

వాని వివరములు. ఇంగ్లీషు—గ్రంథములు.

| | |
|---|---|
| దేశినామమాల — | ఆచార్య హేమచంద్రుని నిఘంటువు వీరి సంపాదకత్వమున ప్రకటిత మైనది. |
| త్రివిక్రమ వ్యాకరణమున కుపోద్ఘాతము | డాక్టరు లడ్డూ పండితుడు జర్మను భాషలో వెలయించిన త్రివిక్రమ వ్యాకరణము యొక్క విపులోపోద్ఘాతమునకు ఇంగ్లీషు అనువాదము. |

వ్యా స ము లు

| | |
|---|---|
| 1. భానుని ప్రాకృతము— | వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయపత్రిక |
| 2. ప్రాకృత భాషాకళా పరిణామము | |
| 3. ప్రాకృత వ్యాకరణము లందలి మతద్వయము | విజయనగర మహారాజ కళాశాలా పత్రిక |
| 4. ప్రాకృతభాషా విభాగములు | (1922—1925) |
| 5. కుందమాలలో ప్రాకృతము | (గ్రియర్సను సమ్మాన సంపుటము) |

తె లు గు

సంస్కృత ప్రాకృత భాషలు—భారతి—1930

గాథాసప్తశతిలోని తెలుగు పదాలు— శ్రీ తిరుమలరామచంద్ర

ఇది ప్రశస్తమగు వ్యాసము. తొలిసారిగా ప్రాకృతభాష యందలి తెలుగుపదములను వెలుగు లోనికి తెచ్చినది.[11] విపుల ప్రచారము గావించినది.

ఇట్లు తెలుగున నన్నయ నాటినుండి నిన్నటి వఱకును గల తెలుగు ప్రాకృత సంబంధముల పరిశీల నము వలన తేలిన యంశము.

1. తెలుగుభాష, ప్రాకృతభాష లవతరించు నాటికి ముందే తెలుగునాట వ్యవహారములో నున్నది.

2. ప్రాకృతభాష తద్భవము లేర్పడుటకు సహకరించినది.

3. తద్భవ ప్రక్రియకు తప్ప, తక్కిన వ్యాకరణ కార్యముల కేవిధమైన సంబంధము లేకపోవుట చేత తెలుగున 10 వ శతాబ్దికిపూర్వము వ్యాకరణ

---

8. సమగ్ర ఆంధ్రసాహిత్యం నాలుగవ సంపుటం రెడ్డిరాజుల యుగం, శ్రీనాథుడు, పుట 134 లో యిట్లు వ్రాయుట సరికాదు.

"శ్రీనాథుని తరువాత ఈ గాథా సప్తశతి నిధి జోలికి అనంత కృష్ణ శర్మగారు తప్ప ఇంకెవరూ పోలేదు" పై భాషాంతరములన్నియు ఈ గ్రంథ రచనకు ముందువే గదా!

9. ఆంధ్రసాహిత్యపరిషత్తు వారిచే ప్రకటితము.

10. భారతి. నవంబరు—1930.

11. భారతి. సం. 29. సం. 3.

రచయితలు లక్షణ గ్రంథకర్తలు ఎవ్వరునూ తెలుగు వ్యాకరణములలో ప్రాకృత భాషాప్రసక్తిని తెచ్చినవారు కారు.

4. తద్భవ ప్రక్రియలు నిరూపించునపుడైన తెలుగు లాక్షణికులు ప్రాకృత ప్రకృతులను చూపనే లేదు. ఈ కారణము చేతనే వర్ణసమామ్నాయమును వివరించు సందర్భమున వారు సంస్కృత వర్ణ సమామ్నాయమును, ప్రాకృత వర్ణసమామ్నాయము విడదీయలేదు.

5. దీనిని బట్టి సంస్కృత ప్రాకృత వర్ణ సమామ్నాయములనువిడదీసిన ఆంధ్రశబ్ద చింతామణి 16 వ శతాబ్దిని రచితమైనదని స్పష్టము.

6. ప్రాకృత భాషలో రచన చేసిన తెలుగు కవులను వ్రేళ్ల పైని లెక్కింపవచ్చును.

అష్టభాషా దండకము రచించిన తాళ్లపాక చిన తిరుమలాచార్యుడు.

అష్టవిధ పార్వతములలో రచనచేసిన రంగాజమ్మ.

ప్రాకృత భాషలో కవిత చెప్పిన క్రీ. శే. పేరి కాశీనాథశాస్త్రి పీఠికాపురాస్థానకవులు. వేంకట రామకృష్ణ కవులు. (1856—1918).

7. భాషావిషయమున—ఆయా ప్రాకృతముల నుండి యేర్పడిన తద్భవములను—ఏ భాషా చరిత్రకారులును వైయాకరణులు చూపలేదు. క్రీ. శ. 1750 ప్రాంతమున మంచెళ్ల వాసుదేవ కవి వ్రాసిన వైకృత చంద్రికలో కొన్ని వందల ప్రాకృత తద్భవములను చూపియున్నాడు. ఆ గ్రంథమును గూర్చిన ప్రశంసయే నేటి భాషా విష యిక చర్చలలో (శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య గారి రచనలలో తప్ప) కానరాదు.

8. తెలుగులో తద్భవములను గూర్చి యింత వఱకు పరిశ్రమ జరుగలేనేదు.[12] సంస్కృత ప్రకృతు లను తద్భవములను చూపుచు 'వైకృతచంద్రిక' అను పేర కీర్తిశేషులు బహుజనపల్లి సీతారామా చార్యులు గారు క్రీ. శ. 1888 లో రచించిరి. ఇందు 2400 పదములు గలవు. క్రీ. శ. 1918 లో నాదెళ్ల పురుషోత్తమ కవీయము అనుపేర నొక గ్రంథము వచ్చినది. ఇందు 2500 పదములు గలవు. ఇందు పీఠికలో ధ్వనిసూత్రములు కొన్నిగలవు.

భాషా పరిశోధన ప్రారంభము కాగానే ఆధునిక భాషాశాస్త్ర పద్ధతులను ధ్వనిశాస్త్రమును ననుస రించి తద్భవములను గూర్చి పరిశ్రమ జరగవలసి యుండెను. కాని భాషాశాస్త్రమునుగూర్చి పరిశ్రమ చేసిన వారట్టి పనికిపూనుకొనలేదు. తెనుగు భాషా తత్త్వమును నిరూపించుటకు తద్భవ పరిజ్ఞాన మత్యంతావశ్యకము. ఏలననగా, తద్భవములతో పాటు, దేశి, అచ్చ తెనుగు విభాగములు వ్యాకరణమున నున్నవి. ఇవియు తద్భవ లక్షణములు గలిగియున్నవి. క్రమ క్రమముగా, దేశి, తద్భవములు నొకదానితో నొకటి కలిసిపోయినవి. పూర్వవైయాకరణులు దేశి అవ్యుత్పన్న మన్నారు. ఆనాడు, దేశి శబ్దములేవో, తద్భవములేవో తెలుసుకొనుట కాధారములేదు. దేశి శబ్దములుగా వ్యాకరణములలో నిరూపితమైనవి, ప్రాకృతములుగా నేడు కానవచ్చుచున్నవి. ఉదా. కరణి, నవలా, సరస ఇట్టివి దేశ్యములుగావు. ఇవి కరణి, వలయా, సరస (సదృశ) అను ప్రాకృతములు[13]. ఇట్లు భాషలోని ప్రతి తద్భవమును పరిశీలించి శబ్దస్వరూప నిర్ణ యము గావింపవలసి యున్నది. ప్రాకృత భాషా పదములనిచ్చి ధ్వనిసూత్రముల ననుసరించి వాని వ్యుత్పత్తులను చూపవలసి యున్నది. ఇట్టి కోశ నిర్మాణము జరిగిన యెడల తెలుగు ప్రాకృతముల సంబంధము, సువ్యక్తమగును.

ఇట్టి కోశమేగాక, ప్రాకృత కావ్యములైన గాథా సప్తశతి, సేతుబంధము, గౌడవహో మున్నగునవి తెలుగు లిపిలో, సంస్కృత చ్ఛాయతో ముద్రితములు కావలెను. వానికి టీకాతాత్పర్య శాబ్దిక విశేషములతో విపులమైన వ్యాఖ్యానము రచితము కావలెను.

కేవలము, చారిత్రకమైన పరిశ్రమకన్న— శబ్దమును గూర్చి పరిశ్రమ చేసిన, తెలుగున తద్భవ స్వరూపమే గాక, ప్రాకృత భాష తెలుగుభాషావికాసమున కెట్లు తోడ్పడినదో, అను విషయము ద్యోత మానమగును.

---

12. మదరాసు విశ్వవిద్యాలయమున ప్రాచ్య భాషా పరిశోధన సంస్థ నెలకొల్పబడుటకు పూర్వము— ద్రవిడ భాషా శాస్త్రోపన్యాసకులుగా తొలుత నియ మితులైన కీ. శే. డాక్టరు బుర్రా శేషగిరిరావుగారు, తమ నియమిత కాలమున (క్రీ. శ. 1914—1917) తద్భవములను గూర్చి ప్రస్తవనీయమైన పరిశ్రమ చేసిరి.

13. చూడుడు. శబ్దరత్నాకరానుబంధము.

# 'వరణఏన్డి' తామ్రశాసనము: తుల్యభాగానది

శ్రీ ముసునూరి సాంబశివరామమూ

1965 ఏప్రియల్ "భారతి" మాసపత్రిక యందునాచే ప్రచురింపబడిన "వరణ ఏన్డి" తామ్ర శాసనమున "ఔలివాయి" అనబడు "తుల్యానది" గలదు (29 పుట 1 కా.)అని వివరించితిని. అందుపై 1965 నవంబరు "భారతి" మాసపత్రిక 91—92 పేజీలలో శ్రీ వి. ఆర్. మేడపాటిగారు "ఔలివాయి ఏది?"అని ప్రశ్నించుచు ఔలివాయి = తుల్యభాగానది కాదేమో యను సందేహమును వెలిబుచ్చిరి. ఆ పైని 1966 సం. మార్చి"భారతి" మాసపత్రిక 67—71 పేజీలలో "సిరియూరు (కడలి) తామ్రశాసనము దానస్థల నిర్ణయము" అనువ్యాసమున"..."ఇట్లనే వారు లోగడ "వరణ ఏన్డి" శాసనము ప్రకటించుచు అందుదాహృతమైన "ఔలివాయిని గుర్తించుటలో గూడ డోలాయమానస్థితికి లోనైరి" అని యుదాహరించుట మూలమున నా విధ్యుక్తమును ప్రబోధించిన వారైరి. కావున నేనిపుడీ ప్రత్యుత్తరమున నాయెఱపి నంతవరకు బాధ్యతాయుతముగఁ దెలుపవలసినవాడనైతిని. కారణాంతరముల వలన కలిగిన యీ ఆలస్యమునకు మాత్రము మన్నింపగోరుచున్నాను.

భీమఖండములోని నదులను వివరింపవలెనన్నచో బ్రహ్మాండ పురాణాంతర్గతమైన గౌతమీ మాహాత్మ్యము, స్కాందపురాణాంతర్గతమైన భీమ ఖండము, శ్రీనాథభట్టసుకవి భీమేశ్వరపురాణము, ఏనుగ లక్ష్మణకవి తుల్యామాహాత్మ్యము, వండూరి బాపయమంత్రి గౌతమీ మాహాత్మ్యము మొదలగు వాటి నెన్నిటినో పరిశీలింపవలసి యున్నది. అంతియెగాక వేఱ్వేరు కాలములందలి శాసనములను బరిశీలింపవలసి యున్నది.

శ్రీ వి. ఆర్. మేడపాటిగారు క్రీ. శ. 1390 లోని అనపోతారెడ్డి "అనుపఱ్తి" శాసనమున్ను; క్రీ. శ. 1434 లోని అల్లయవేముని "అల్లాడ రెడ్డి వేమవరము" శాసనమున్ను; శ్రీనాథభట్టసుకవి భీమేశ్వరపురాణమును ఉదాహరించుచు పై సందర్భములందు వారందరు "తుల్యభగానది" అని పేర్కొనియుండగా ఈ శాసనమందలి "ఔలివాయి'ని సుప్రసిద్ధమగు "తుల్యభాగానది"తో సంబంధమొనగూర్చుట కట్టుకథగా ఉన్నదని వ్రాసియున్నారు. అందుకు గల కారణము "ఔలివాయి"యే "తుల్యభాగానది" యైనచో పై సందర్భములందు వారు "తుల్యభాగానది" యని యేల వాడిరి? "ఔలివాయి" అని యేల వాడియుండలేదు? అని వారి సందేహము. అనగా పదియవ శతాబ్దమునందే తూర్పుచాళుక్యులు వాడిన యీ "ఔలివాయి" పదమును మరి నాలుగు శతాబ్దముల పిమ్మట (౧౪ వ శతాబ్దమున) రెడ్డి రాజులును, వారి కవులును అనుయాయులును వాడియుండలేదు. కావుననే ఆ విషయము సరికాదు అను నిరూపణమునకు ప్రమాణముగ గైకొనిరి. అయితే వారు అందుదాహరించిన విషయములే వారి వ్యాసమునకు బలహీనత చేకూర్చుచున్నవి. ఏమన —

1. ఈ 'వరణఏన్డి" తామ్రశాసనము దొరకిన మురమండ ప్రాంతమందే చరిత్ర (పురాణ) ప్రసిద్ధి

గన్న తుల్యభాగానది యున్నదనుట వాస్తవమే అని యుదాహరించుట.

2. ఈ తుల్యభాగానదినే జానపదులు (నిరక్షరాస్యులు) ఔొలివాయి, తొలిబాయి—తొలేభాయి అని వ్యవహరింతురని పేర్కొనుట.

3. ఔొలివాయి = తుల్యభాగానది కాదనినప్పుడు అదియేది (నది) యో నిరూపింపకుండుట.

4. ఈ "ఔొలివాయి" "తుల్యభాగా అను పదముల వ్యుత్పత్తులను వివరింపకుండుట.

ఇంతకును ఈ "ఔొలివాయి" అను పదము నందలి 'ఔ' కారము కేవలము శకటరేఫము మాత్రమే కాదనియు పూర్వ శాసనములలో నిది బహుళాక్షర సమన్వయమనియు గుర్తింపకుండుటయే ఈ భ్రమ ప్రవాదములకు మూలకారణమగు చున్నది. ఈ శాసన వ్యాసమునందే (25 పుట) "విశేషాక్షరములు" అను శీర్షికలో "ఱ, ర, డ, ద, ళ, ల"అను అక్షరములకు బదులుగా "ఔ" అక్షరము వాడబడినదని సప్రమాణముగా నిరూపించియుంటిని. 28, 29 పేజీలలో "తొలివాయి" "ఔొలివాయి" = అని చదువవలెను. అనగా "గోదావరి" అనబడు గౌతమీ నదియొక్క మొదటి పాయి అని వివరణ. ఇందుకు ప్రమాణము "తుల్యాఽత్రేయీ, భరద్వాజీ, గౌతమీ, వృద్ధగౌతమీ, కౌశికీచ వసిష్ఠాచ సప్తధాః పరికీర్తితాః". గౌతమీ మాహాత్మ్యం సప్తసాగర మాహాత్మ్యే. తుల్యాసాగర సంగమ మాహాత్మ్యం. అనగా(గౌతమీ) గోదావరియొక్క యేడు పాయలలోను మొదటిపాయి (తొలివాయి) తుల్యానదియే యనుట నిశ్చయము. ఈ తుల్యానదినే సంస్కృత, ఆంధ్ర (తెలుగు) కవులు కూడ "తుల్యానది", "తుల్యభాగానది" అను రెండు పేర్లతోను వ్యవహరించియున్నారు. కావున తుల్యానది, తుల్యభాగానదియు నొక్కటే యనుట గూడ నిస్సందేహము. ఈ తుల్యానదినే జానపదులు "తొలిపాయి—తొలివాయి—తొలిభాయి, తొలేభాయి" అను పేర్లతో గూడ వ్యవహరించుచున్నారు అని 1965 నవంబరు "భారతి" 92 పే.లో వారే యుదాహరించియున్నారు.

అయితే ఆ వెనువెంటనే ఆఖరు పేరాయందు తిరిగి ఆ విషయమునందే "ఔొలివాయి—తుల్యభాగా సంబంధము ఒక కట్టుకథగా తోచుచున్నది" అని వ్రాసినారు. అనగా "తుల్య, తుల్యభాగానది" అనబడు నది "తొలిపాయి, తొలిభాయి" అని అంగీకరించి యున్నను అయ్యదియే "ఔొలివాయి" అనునిర్ధారణయే ఈ సంశయ విచ్ఛేదమునకు కావలసిన ముఖ్యాంశము.

"ఔొలివాయి" పదములోని "ఔ"అను యక్షరము కేవలము భాషా సాంప్రదాయమైన శకట రేఫము మాత్రమే కాదనియు; పూర్వశాసన లిపి యుందిది బహుళాక్షర సమన్వయమనియు గదా చెప్పితిని.

1965ఏప్రియల్ "భారతి" 25 పేజీలోని "విశేషాక్షరములు"అను శీర్షికయందు ఆ శాసనములోనే యేయే రేకులలో ఏయే పంకి యందు ఏయే పదములో ఏయే అక్షరముగా వాడబడినదో తేటతెల్లము గావించియున్నాను.

అంతేగాక పూర్వశాసనముల బరిక్షింప ఈ "ఔ" అను అక్షరము సంస్కృత శబ్దములందలి "ట, ఠ, త, ర, ళ"అను కన్నడమునందు "ఔ" అను అక్షరము వాడిన దనుటకుదాహరణముగా ప్రతిహస్త=పరిహత్తాన్, ప్రతిహారిన్ = పఱిహారి, పడిహారి, పఱిహారి, ప్రతిపాదిక = పఱివాపుగె. ఈ రీతిగ సంస్కృత శబ్దములకు "త" కారమునకు బదులుగ "ఔ" అను అక్షరము వాడబడినటుల గోచరించు చున్నది. ఇటులనే పూర్వశాసనములందలి "గ, ట, డ, త, ద, న, మ, య, ర, ఱ, ల, వ, స, ళ" అను ధ్వనుల యందు తెనుగున సందర్భానుసారముగ "ఔ" అను అక్షరము గానవచ్చుచున్నది. కావున ఈ "ఔొలివాయి" పదమునందలి "ఔ" అక్షరమునకు ప్రాతిపదకమైన "త" కారమైనపు డాపదము 'ఔొలివాయి" అనుటకు మారుగా "తొలివాయి" అగును. ఇదియే క్రమక్రమముగా జానపదులందు "తొలివాయి, తొలేభాయి"గా వాడుకబడినది. అందుచే "తొలేబాయి" అను పదము "తుల్యభాగ" అను పదమునుండి వచ్చినదనుట కంటె "తొలివాయి" అను పదము నుండియే కలిగినదనుట సమంజసమై యుండును.

"వాయి" అను పదమునకు "బావి, కొలను, నది, గ్రామము" లకు ప్రయోగింపబడినది. అందు కుదాహరణముగా "రాళ్లవాయుక, వాయి గ్రామము"

అను పదములు గ్రామనామములుగా వాడబడినట్లు ప్రాచీన కాలమందు గుప్తశకమున దామోదర శాసనమున నున్నట్లు తెలియవచ్చుచున్నది. శతకములలో కలువాయి శతకము, ఇంటిపేర్లలో "కపిలవాయి" శబ్దము లున్నవి. అనంతపురము జిల్లాలో "బరువాయి, పాలవాయి, మేళవాయి" గ్రామములున్నట్లు తెలియుచున్నది. అయితే ఇందీ "ఒ్రీలివాయి" అను పదము గ్రామనామముగా గాక నదీవాచకముగా నుపయోగింపబడినది. అందుకు ప్రమాణముగ ఈ పదము గ్రామ సరిహద్దుగా నీయక 'క్షేత్రసీమ' సరిహద్దుగా వ్రాయబడినది. "క్షేత్రసీమ" అను పదము పూర్వ శాసనములలో పంటపొలములకు వాడబడి యున్నది. కావున "వరుణ ఏన్డి" అను గ్రామమందలి "క్షేత్ర సీమ" 'పంట పొలమున' కు పడమటి సరిహద్దున "ఒ్రీలివాయి" = తొలివాయి, లేక తొలివాయి అని రూఢి గావించుచున్నది. కావున ఇది "నదీ" వాచకము గానే ఉపయోగింపబడినది. దీనికి అనుకూలముగా జానపదులైన ఊడ్పుకత్తెలు "ఎలేమూరు తొలేబాయి మామయ్యో తొలిచూపున వలపు నిలిపి కులుకుజెందితి—మామయ్యో— కులుకు జెం అని వరవశించి పాడుచుండుటయు గలదు. ఈ "తుల్యానది" "తుల్యభాగ"ను "తోలేబాయి" అని పాటక జనులు వాడుదురని వారే వ్రాసియున్నారు. అందుచే ఎన్నివిధముల యోజించినను ఈ "ఒ్రీలివాయి"అను పదము "తొలివాయి" అగుటచే (గౌతమీ) గోదావరి యొక్క మొదటిభాగమైన తుల్యానది (తుల్యభాగానది) యే గాని వేరకాదని ధృవపడుచున్నది.

ఇక వారి సందేహము:— ఈ "ఒ్రీలివాయి" తుల్యానదియైనచో ఈ శాసనమునకు తరువాతి (4 శతాబ్దములకు) రెడ్డిరాజుల కాలమున ఆ శాసన కర్తలుగాని ఆ పౌరాణికులుగాని "ఒ్రీలివాయి" పదమునే వాడక "తుల్యభాగానది"యని వాడియున్నారు అనునది.

ఇది యొక మహాసముద్రమువలె నుండును. అంచు దరిగానరాదు. ఈ తుల్యానదిని గూర్చి తెలుపుటలో బ్రహ్మాండపురాణాంతర్గతమైన "తుల్యామాహాత్మ్యమే" మూలాధారమైనట్లు కానవచ్చుచున్నది. అయితే దానినే ఆధారముగ గొన్న ఆంధ్ర (తెనుగు) కవులు ఆ తుల్యకు గల ప్రాతిపదక నామమునందు విభిన్నమార్గముల ననుసరించిరి.

"సప్తధావ్యభజన్ గంగాంవృషయస్త్ర నారద... జామదగ్నితు పాశ్చాత్యావ్యపదిష్టా తు సప్తధా; తైస్సప్త ఋషిభిస్త్రయుష్టుమిష్టైర్మహాత్మభిః"అనుగౌతమీ మాహాత్మ్య వచనానుసారమున తొలుదొల్త నీ తుల్యానది "జామదగ్ని"గా నుదాహరింపబడియున్నది. కాని ఆ వెనువెంటనే నురియొక యధ్యాయమున "షడ్భిర్భాగైః ఫలైస్తుల్యా స్వసామర్థ్యస్సమాగతా ప్రవిష్టా సాగరే తేన తుల్యభాగేతి కీర్తితా" అని ఆ తుల్య సార్థకనామముగ నుగ్గడింపబడినది. ఆంధ్రకవులును ఆ విషయమునే సమర్థించుచు "తుల్యా, తుల్యభాగా" అను సార్థకనామములనే వాడుచువచ్చిరి. అందుచే "తుల్య,తుల్యభాగా"అనుపేర్లు జన్మతః(పుట్టుకతోనే) ఉన్న పేరునకు సాటిరాదు కలుగబోదనుట సర్వసామాన్యమే.

అయితే "సప్తర్షీణాంచనామ్నాతా సప్తగంగా స్తులోవిదన్" అనియు "తేషాంనామాని మునిభిః నిర్దిష్టాని స్వనామభిః" అనియు నుదహరించుచు "తుల్యాత్రేయీ భరద్వాజీ గౌతమీ వృద్ధగౌతమీ కౌశికాచ, వసిష్ఠాచ సప్తభాగాః ప్రకీర్తితా" అను దానిననుసరించి తొలుదొల్తదైనతుల్యానది తుల్యుడను మహర్షిచే కొనిరాబడియున్నదని చెప్పవలసి యున్నది. కాని వెనువెంటనే నారదుడు "తుల్యా కేనాహృతాపూర్వం కేనతుల్యాఽభవత్పురా" అని యొక చోటను "లోకే కేనాహృతా పూర్వం కేన తుల్యా భవత్పురా" అనియు ప్రశ్నించెను. అనగా (గౌతమీ), గోదావరి యొక్క యితర వాయిలన్నిటివలెనే యీ మొదటి వాయిని గూడ "తుల్యుడను" మహర్షియే తన పేర తీసికొని వచ్చినచో ఈ ప్రశ్నకు తావెక్కడిది? ఆ విషయమునకు భిన్నముగా ఇట్టి ప్రశ్న కలుగుటచేతనే ఈ విషయమున "తుల్య" "తుల్యభాగ" అను పేర్లు సర్వసామాన్యముగాక వైశేషిక మార్గమును సూచించుచున్నవని గోచరించును. అందువలననే కాబోలు "సా గౌతమ్యాం మహానద్యాం దానవానాం తరంగిణీం పూర్వకాలే సముత్పన్నా సమానీతా మహాత్మనా తుల్యభాగాభిధానే దానవేన తపస్వినా" అని ఐతిహాసికులపై భారము మోపుచు గౌతమీ మాహాత్మ్య మూలాతిక్రమమైన ఈ నూతన విధానము స్కాందపురాణాంతర్గతమైన భీమఖండమునందు తలెత్తినది. దానిని బలిష్ఠము చేయుచు "సతుల్యభాగో

దైత్యాపి సతతం సాధువర్త్మకః పరాత్మతత్త్వవిజ్ఞాతా పక్షపాతవివర్జితః సురాసురాణాం కలహం నివారయతి మధ్యగః'' ''తుల్య భాగ సమర్థిత్వా—త్వద్దైత్యే స్వర్ణనామకః తస్యనామ్నైవమేకన్యాం తుల్యభాగేతి కీర్తితాః పూర్వగౌతమకన్యాయాః కన్యకా సా తరంగిణీ'' అనుచు తుల్యభాగుని, తుల్యభాగానదిని ప్రశంసించుచు (పూర్వము) తొల్లి గౌతమకన్యక (గౌతమి)కు కన్యకయైన ఆనది నాటి నుండియు ఆ తుల్యభాగుని పేర ప్రసిద్ధమయ్యెను—అనుటచే ఆ తుల్యభాగుని ప్రసన్నతచే పునఃపునీతమై ''తుల్యభాగ'' యని పిలువబడెననియేగాని తుల్యభాగుడను బుషిచే తీసికొని రాబడెనని ధృవము కాలేదు. అందువల్లనే శ్రీనాథ కవిసార్వభౌములు ''అసురులకు నాశ్రయంబైన—యాస్రవంతి తుల్యభాగాహ్వయుడు దైత్యుండు తేర బూర్వమున గౌతమీగంగ బుట్టివచ్చె నందు రితిహాస తత్త్వజ్ఞులైన బుధులు'' అని తెనిగించినారు. అనగా భీమఖండములోని ''సమానీతా'' అను శబ్దమును ''తేర'' అను పదముతో నాంధ్రీకరించి వైశేషిక మార్గమును గోచరింపజేసెను. అనగా (పుట్టెను) ''తీసికొనివచ్చెను'' అనుటకు ఒప్పుకొనక ''ప్రసన్నత నొందెను పునఃపునీతమయ్యెను'' అను యర్థమున పుష్టి గావించెను. అందుచే తుల్యభాగునిచే ప్రఖ్యాతి నందిన యీ తుల్యభాగానది అంతకుబూర్వమే గౌతమీనదినుండి పుట్టియుండెననియు దానికి ప్రాతిపదకమైన వేరొక పేరుగలదనియు తేటతెల్లమగుచున్నది. అపుడు ''షడ్భిర్భాగై ఫలైస్తుల్యా స్వసామర్థ్యాత్సమాగతా ప్రవిష్టా సాగరే తేన తుల్యభాగేతి కీర్తితా'' అనియున్నను తొలుదొల్త గౌతమి నుండి తీసికొని వచ్చిన బుషి పేర నుండవలెను. ఆ ప్రాతిపదక నామమునే పరిశీలింపవలెను. అందుకు ''వాసిష్టా దక్షిణా చ స్యా ద్వైశ్వామిత్రీ తదుత్తరా వామదేవ్యాపరాజ్ఞేయా గౌతమీ మధ్యమా శుభా భారద్వాజీ పరాజ్ఞేయా ఆత్రేయీతు తతఃపరా జామదగ్నీతు పాశ్చాత్యా వ్యపదిష్టాతుసప్తధా తైస్సప్తబుషిభిఃసప్తయుష్మమిష్టైర్మహాత్మభిః'' అని యుండుటచే గౌతమి (గోదావరినది) యొక్క అన్ని పాయలలోను పైనున్న (తొలిపాయి) ''తుల్య'' అనబడు దాని యొక్క ప్రాతిపదకము ''జామదగ్ని'' అని వెల్లడియగుచున్నది. అంతేగాక ''ఆత్రేయీ కౌశికీ కణ్వా గౌతమీ వృద్ధగౌతమీ'' అని వేరొక అధ్యాయమున బేర్కొనబడెను. ఇందు ''వామదేవ్యాపరాజ్ఞేయా'' అన్నచోట ''వృద్ధగౌతమీ'' యని వాడెను. ''తుల్యాత్రేయీ'' అను దాని యందు గూడ ''వామదేవిని'' ''వృద్ధగౌతమి''గానే వాడియుండెను. అయితే మిగిలిన ఆఱువాయలలోను 'తుల్య'' అని సార్థకనామము గను ''జామదగ్ని'' అని ప్రాతిపదక నామముగను వాడిన ఆ తొలిపాయిను మాత్రము ఈ పై చోటున ''కణ్వా'' అని యుదాహరించెను. అందుచే ఈ''తుల్య'' అన బడు ''జామదగ్నియు'' కణ్వనదియు ఒకేచోటున (దగ్గరగ) పుట్టి,సొడవునను చాల సమీపముగ (సమానాంతరముగ) ప్రవహించుచు మధ్యమధ్య మళుపుల యందు కలిసిపోవు చుండెనేమో యను సంశయము కలుగుచున్నది. అందు కనుకూలముగా శ్రీనాథకవి సార్వభౌములు తమ కాశీఖండము నందు —

> అంతః ప్రవాహియై యావిర్భవించె నే
> ధరణీధరముపొంత తల్లిబావి।
> పాఱె నేశైలంబు పాదమూలంబున
> గల్లేటితో వృద్ధగంగవాసి।
> యుదయించె నేకొండ యుత్తరాశా రసా
> తలకుక్షి సప్తగోదావరంబు।
> జనియించె నేశైలోచ్చయము దక్షిణమున
> గణ్వవాహిని యుప్పుకడలికొమ్మ।
> పద్మగిరి తోడబుట్టు వే పర్వతంబు।
> బలిసియుండె నేయద్రికి బంచలింగి।
> యుట్టి వీరభద్రాఖ్యమహాచలమున।
> కరుగుదెంచె వింధ్యమదాపహారి॥

అని నుడివియుండెను. కావున యీ కణ్వనది సప్తగోదావరి యుత్పత్తిస్థానమగు వీరభద్రశైలము నందే అనగా గోదావరి యొక్క అన్ని పాయలకును పైనే బుట్టి ఉప్పుటేరుగా మారి సముద్రమున గలియుచున్నదని తేటతెల్లము గావించుచున్నది. అందుకు తోడుగానే శ్రీనాథకవిసార్వభౌముల భీమేశ్వర పురాణము నందును ''తుల్యభాగా తరంగిణి తోడుగాగ। గణ్వవాహినితో గూడ—గనకరత్న దివ్య పరిధాన సహితంబు—దేవభర్త। ధరణి భీమేశ్వరున కిచ్చి ధారవోసె'' నని వక్కాణించెను.

కావున దీని సారాంశమేమన ''జామదగ్ని, తుల్య, తుల్యభాగ, తొలివాయి, తొలిపాయి, తొలి బాయి, తోలేభాయి'' అనబడునది మార్కండేయ

క్షేత్రమునకు దిగువనను, కణ్వనది ఆ మార్కండేయ క్షేత్రమునకు ఎగువను బట్టి, సమానాంతరముగా ప్రవహించి సముద్రమును చేరినవనుట యుదార్థము. అందుచే కణ్వ పుట్టినది మొదలు కలియు వరకును తుల్యకు యుత్తరమునసే ప్రవహించినది.

ఇక నీ తుల్యనదీ విషయమును ఆంధ్రకవు లనుసరించిన మార్గముల నవలోకింతము. గౌతమి (గోదావరి)నుండి ఏడుగురు మహర్షులును తమ తమ పేర్లతో తమ తమ ఆశ్రమముల మీదుగా సాగర సంగమము గావించిరని గదా పై నుదాహరింప బడినది. ఆ సప్తమహర్షు లెవ్వరు? "కశ్య ప్రాత్రి విశ్వామిత్ర—గౌతములును, వినుభరద్వాజ జమదగ్ను లును వసిష్టుడనం జగంబుల నెల్ల—చేర్కనిన బుషులు; వారి సప్తర్షి గణముండ్రు— కౌరవేంద్ర" అని భారతమున గలదు. దాని కనుగుణముగానే కవి సార్వభౌమ శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి వారును తమ గౌతమీ మాహాత్మ్యమున "కశ్య, ప్రాత్రి భర ద్వాజ కౌశికులును, జామదగ్ని, వసిష్టులు స్వప్ర దేశములకు గంగ గొంపోవచ్చి మునిని గంగ ప్రార్థ నముజేసిరి రమ్మిర—మ్మనుచు భక్తి" అనిరి. అందు కనుగుణముగానే ఏనుగు లక్ష్మణామాత్యుడును తమ "తుల్యామాహాత్మ్యము"నందు"తుల్యయు,ఆత్రేయయు భరద్వాజియు, గౌతమియు, కాశ్యపి యను వృద్ధయు, కౌశికియు, వశిష్టయు ననందగి పూర్వపరంబున..." అని నుడివియున్నాడు. దీని సారాంశమేమనగా గోదా వరి నేడువాయిలుగా దీసికొని వచ్చిన మహర్షులలో "వశిష్టుడు, కౌశికుడు,(విశ్వామిత్రుడు), గౌతముడు, భారద్వాజుడు, అత్రి" అను అయిదుగురు మహర్షులు అన్నివిధముల స్థిరీకరుణులై యున్నారు. వారి పేర్లతోనే గోదావరి అయిదు పాయిలును ప్రసిద్ధ ములై యున్నవి. వీటి విషయ మేసందేహమును లేదు. కాగా మిగిలినది "తుల్యా, వృద్ధగౌతమీ" అను రెండు పాయిలను మాత్రము విమర్శింపవలసి యున్నది. ఈ తుల్యుడును, వృద్ధగౌతముడును మాత్రము సప్తర్షులలో బేర్కొనబడలేదు. అందు వల్లనే ఆంధ్రకవులు ఆంగ్లీకరించుటలో యీ విభిన్నమార్గముల ననుసరింప మూలకారణమై యున్నది.

ఇందు మొదటిదైన తుల్యానదిని గురించి యోజించుటలోను "తేషాంనామాని మునిభిః నిర్దిష్టాని స్వనామభిః సప్తర్షీణాంచనామ్నాతా సప్త గంగాస్తతోవిదన్" అని యుదాహరించుటచే "తుల్యాత్రేయీ, భారద్వాజీ। గౌతమీ, వృద్ధగౌతమీ। కౌశి చైవవాసిష్టా। సప్తభాగాః ప్రకీర్తితా అని యుదాహరించినను, సప్తర్షులలోలేని "తుల్యా వృద్ధ గౌతములు" తలజూపుటయు, సుప్రసిద్ధులైన "కాశ్యప, జమదగ్నులు" అదృశ్యులగుటయు గమనింపవలసినది. దీనికి తోడుగా "ఆత్రేయా, కౌశికీ, కణ్వా, గౌతమీ, వృద్ధగౌతమీ, భారద్వాజీచ, వాసిష్టా సప్తభేదేతి గౌతమీ" అనుటతో "తుల్య"యు సదృశ్యమై "కణ్వ" వెలయుటయు గమనింపవలసిన విషయమే. అంతతో సరిపోక "తుల్యాకేనాహ్వాతా పూర్వం కేనతుల్యాభవత్పురా" అను ప్రశ్నయు తార్కాణమగుచున్నవి. అందుచే ఈ "తుల్య, వృద్ధ గౌతములు" సార్ధకనామములు కాని కేవలం జన్మజనిత నామములు కావు. అందువల్లనే "సా గౌతమ్యాం మహానద్యాం దానవానాం తరంగిణీ। పూర్వకాలేసముత్పన్నా సమానీతా మహాత్మనా। తుల్యభాగాభిధానేన । దానవేన తపస్వినా ఇతీతిహాస తత్త్వజ్ఞా ప్రవదంతి మనీషిణః" అనియు "తన్యనామ్నైవమేకన్యాం । తుల్యభాగేతి కీర్తితా పూర్వం గౌతమకన్యాయాః కన్యకాసాతరంగిణీ" అనియు "తుల్యా, తుల్యభాగా" నామధేయము సార్ధకనామములుగ సమర్థింపబడినవి. అన్యగా తొల్లి గౌతమ కన్యకయైన గౌతమీ నది యొక్క పాయి యగు నీ నది తుల్యభాగుని పేరను(తిరిగి)ప్రసిద్ధినొంది నది వక్కాణించెను. అయితే ఏనుగ లచ్చయామాత్యుని తుల్యా మాహాత్మ్యములో మాత్రము తుల్యుడను"ముని మిగుల సంతోష మొదవ। గౌతముని వేడినను మెచ్చి గంగరీతి। నతని వెనువెంట నేగి తూల్యాఖ్య గాంచి క్షిప్రగతి సాగరముప్రవేశించెనంత" అనియును దెలుప బడెను. ఇందు "క్షిప్రగతి సాగరము ప్రవేశించె నంత" అని యుండుటచే ఆతుల్యునిచే గౌతముని వేడి (తుల్యానది నుండియై యుండనోవు) యొక్క పాయి తీసికొని వెళ్లెననియు, అదియు తుల్య పేరితోనే చీలి సముద్రమును చేరెనని గోచరించు చున్నది. కాని శ్రీ వి. ఆర్. మేడపాటి గారు తమ వ్యాసములో "గౌతముని అనుమతి లేకుండ తుల్యుడను

మహర్షి ఈ నదిని తొలుత దీసికొని వచ్చినట్లును "యిది అంతర్వాహిని అయిపోవునట్లుగా శపింపబడినట్లును ఒక గాథ కలదు" అని వ్రాసిరి. పై నుదాహరించిన ప్రకారము తుల్యామాహాత్మ్యములో తెలుపబడి యుండుటచే తుల్యుడు తుల్యను గౌతమిని వేడి తెచ్చెనేకాని అనుమతి లేకుండ అపహరింపలేదు. కావున తుల్యకు గౌతముని శాపము లేదు. (వసిష్ఠుని యనుమతి లేకుండ వైనతేయుడు "వైనతేయు" అను శాఖను అపహరించి గొంపోవుటచే ఆ వైనతేయకు వసిష్ఠుని శాపమున్నట్లు గౌతమీ మాహాత్మ్య సాగరసంగకథనము నందుదాహృతమై యున్నది.) కాని ఆ వెనువెంటనే సముద్రమువలె పుణ్యదినములు, ఆదివారములు తప్ప యితర దినములంత ప్రాముఖ్యము లేకబోవుట కిదియే కారణమై యుండును అని వ్రాసియున్నారు. అనగా ఒక నది అంతర్వాహిని యగుటయు తిరిగి ఒక నది ప్రాముఖ్యము జెందుటయు పునఃపునీతమగుటయు వారెఱిగిన విషయమే యయ్యును వారు దానిని అన్యవిధమున మలుపులు సాగించిరి. ఎట్లన "సప్తర్షిర్మునివర్యైస్తా। మానీతా పుణ్యవాహినీం। తే దానవాశ్చ రియం। శుష్కతోయా భవతీతి।। తతస్తేషాందానవానాం। తేచపుణ్య తరంగిణీ। దేవర్షయస్సప్తశేపు। రపుజ్యేయం భవత్యితి" అను శాప కథన గాథయును "ఇత్యుక్తో దైత్యమునయ। స్తదాచక్రుః ప్రసాదతః। అంతః ప్రవాహీం సప్తర్షి ప్రవరానీత వాహినీం సప్తర్షయశ్చ తటినీం। తేషాం తపస్వినాం। అయనద్వయ చంద్రార్క గ్రహణాది దినాదిషు పుణ్యకాలేషు చక్రుః। ప్రీత్యాక్షయ ఫలప్రదాం।స్నానదాన జపశ్రాద్ధ హోమదేవార్చనాదిః।" అని స్కాందమున చెప్పారనిరి. దీనినే శ్రీనాథ కవిసార్వభౌములు ...దానవులు సప్తర్షి సమానీత మైన యవ్వాహిని శుష్కతోయ మయ్యెడు మనియును; మునులు దానవులకు సమాశ్రయంబైన పుణ్యవాహిని యపూజ్యయై యస్పృశ్య యయ్యెడునని యును శపించిరి. రాక్షసులు సప్తముని సింధువునకు నంతః ప్రవాహంబును, మునులు తుల్యభాగనుత్తరాయణ దక్షిణాయన పుణ్యకాలంబులను, సూర్య చంద్ర గ్రహణంబులను, ప్రతి భానువారంబునను దర్శ పౌర్ణమాసీ ప్రభృతి మహాపర్వకాలంబులను సంక్రమణంబులు మొదలైన విశేష కాలంబులను స్నాన దాన జప తప హోమ శ్రాద్ధ దేవార్చనా విధంబు లక్షయఫలంబగునట్లుగాను — బతిసవేతంబుగా సతికి రజస్వలాత్వాదంతరాయంబు లేక యుధశ్శయన బ్రాహ్మచర్యోపవాస నియమంబుతో భానువార చతుష్టయంబు స్నానంబు సిద్ధించిన సంతాన ప్రాప్తియౌనట్లుగాను వరంబు ప్రసాదించిరి" అని యాంధ్రీకరించిరి. అందుచే "సప్తగోదావరి" దానవ ఋషులచే శుష్కతోయ మగునటు శపింపబడి, తుల్యభాగుని తీర్పుచే తిరిగి అంతఃప్రవాహిని యగునటుల పునరుద్ధరింపబడెను కావున అంతః ప్రవాహిని యైనది "సప్తగోదావరి" కాని "తుల్యభాగానది" కానేరదు. అయితే తుల్య (తుల్యభాగానది) మాత్రము దేవర్షులచే అపూజ్యయు, అస్పృశ్యయు కానటుల శపింపబడి తుల్యభాగుని తీర్పు ననుసరించి పర్వకాల విశేష పవిత్రతయు, వంశోద్ధారక సంతాన ప్రదాతయునై పునరుద్ధరింపబడినది. ఈ విషయము వారెరుగనిదికాదు. అయితే వారేలనో పొరపడియట్లుల్లేఖించిరని భావింపవలసి వచ్చును.

తుల్యా—తుల్యభాగానదికి ప్రాతిపదకమైన జన్మజనిత నామమును దెల్పుటలో కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు 'కశ్యపాత్రి విశ్వామిత్ర' అను ప్రమాణమునే గైకొనుట "కశ్యపాత్రి భరద్వాజ కౌశికులును జామదగ్ని వసిష్ఠులు స్వప్రదేశములకు గంగగొంపోవచ్చి— మునిని గంగ—బ్రార్థనముజేసిరి రమ్మెర—మ్మనుచు భక్తి" అని తెలిగించుచు ఆపైని "కశ్యపమౌనిజుష్టమయి— కంధినిబొందిన వాక— దేవతా—వశ్యము నెల్లవాకలకు—బాయనితుల్యఫలంబు నిచ్చుటన్—గాశ్యపి తుల్యభాగయని కశ్యపు డాడకు దోడితెచ్చుటన్ గాశ్యపి యందు నామములు—గొల్చు నఘంబుల సేవకాళికిన్"అని తమ గౌతమీమాహాత్మ్యము నందును, అందు కనుగుణముగా "...గశ్యప, వసిష్ఠ, విశ్వామిత్రాది తాపసోత్తము లగ్గోదావరి ననేక ప్రకారంబుల నుగ్గడింపుచు నల్లన గౌతమముని వల్లభునిజేరి యిట్లనిరి. "తొలుతం గశ్యపుడను మునితిలకుడు గొని గోంపోయి గంగ—తీర్థంబులు పెక్కులు వెలయుగ జలనిధిలో గలిపెం దుల్యయన నదియే—కాదె తనర్చున్" అని శ్రీ మధిర సుబ్బన్న దీక్షితులుగారు తమ సప్త సాగరసంగమాహాత్మ్యమున సమర్థించినారు. అయితే ఏనుగు లక్ష్మణమాత్యులు

మాత్రము తమ తుల్యామాహాత్మ్యమున 'తుల్యయు ఆత్రేయయు, భరద్వాజియు, గౌతమియు, కాశ్యపి యను వృద్ధయు,కౌశికియు, వసిష్ఠయు ననందగిన'' అని యుగ్గడించిన ప్రకారము గోదావరి (గౌతమి) తొలిపాయి ''తుల్య'' ''తుల్యభాగా'' నదియే కాని, ''కాశ్యపి'' కాదనియు, 'కాశ్యపి' యనునది ''వామదేవి'' యగు వృద్ధగౌతమి యనియు నిర్ధారణయాచున్నది. అట్టి తఱి ''తుల్య'' ''షడ్భిర్భాగై ఫలైస్తుల్యా స్వసామర్థ్యాత్సమాగతా ప్రవిష్టాసాగరే తేనా తుల్యభాగేతి కీర్తితా'' అను గౌతమీ మాహాత్మ్య ప్రమాణము చేతను, ''సా గౌతమ్యాం మహానద్యాం దానవానాం తరంగిణీం పూర్వకాలే సముత్పన్నా సమానీతా మహాత్మనా తుల్యభాగాభిధానేన దానవేన తపస్వినా ఇతీతిహాస తత్త్వజ్ఞాః ప్రవదంతి మనీషిణః'' ''తస్యనామ్నైవ మేకన్యాం తుల్యభాగేతి కీర్తితా పూర్వం గౌతమ కన్యాయాః కన్యకా సా తరంగిణీ'' అను స్కాందపురాణాం తర్గత భీమఖండ ప్రవచనము చేతను తన సార్థక నామము చేతనే ప్రసిద్ధి కెక్కెను. కావున దాని జన్మజనిత నామధేయమును తెలిసికొనవలయును గదా? గౌతమీ మాహాత్మ్యము, భీమఖండము, భీమే శ్వర పురాణము, తుల్యామాహాత్మ్యము మొదలగునన్నిటి యందును (గౌతమి) గోదావరి యేడు పాయల నుదాహ రించుటలో ''తొలిపాయి'' ''తుల్య'' అని యుదాహ రింపబడుటచే దానికిక సందేహమేలేదు. ఇక దాని జన్మజనిత నామ నిర్ధారణకై బరికింపగా ''వాసిష్ఠా దక్షిణాచస్యాద్వైశామిత్రీ తదుత్తరా వామదే వ్యాపరాజ్ఞేయా ఆత్రేయీతు తతోపరా జామదగ్నీతు పాశ్చాత్యా వ్యపదిష్టాతు సప్తధాః'' ''తైస్సప్తఋషిభి స్తత్ర యష్టుమిష్టై_ర్మహాత్మభిః'' అని బ్రహ్మాండ పురాణాంతర్గతమైన గౌతమీ మాహాత్మ్యమున నుగ్గ డింపుటచేలోకులు ''తుల్య'',''తుల్యభాగ'' నామములచే వ్యవహరించుచున్నయీనదికి జన్మజనిత నామము''జామ దగ్ని'' యని నిర్ధారణ యగుచున్నది. అందువలన 'తుల్య, తుల్యభాగ' నామములు సార్థక నామము లనియు, దానికి ''జామదగ్ని'' అనునది ప్రాతిపదిక మైన నామమనియు గ్రహింపవలసి యున్నను దానిని లోకమే విస్మరించినది. అందువలననే కాబోలు సుప్ర సిద్ధాంధ్ర కవులును ఈ తుల్యను ''కాశ్యపి'' అని కొందరును, మఱికొందరు ఈ సందిగ్ధమున కాలిడ నిచ్చగింపకయు తమ కావ్యముల బూర్తి జేసికొనిరని తోచుచున్నది. ఆ కారణముననే మహాకవులు మొదలు సామాన్యుల వరకును సందిగ్ధ కారణమైన ''కాశ్యపి'' ''జామదగ్ని'' పదముల వదలి సార్థక నామములైన ''తుల్యా, తుల్యభాగా'' నామములనే వాడుచున్నారు. అంతేగాక జానపదులు (నిరక్షరాస్యులైన పాటక జనులు) ఈ ''తుల్యభాగా'' నామధేయమును గూడ వదలి ప్రకృతి సంబంధమైన ''తొలివాయి, తొలి పాయి'' రానురాను (క్రమక్రమముగ) ''తొలేభాయి, తొలేబాయి''గా వాడజొచ్చిరి.దానినే ఆనాటి (పూర్వపు) శాసనాక్షరములలోనిదగు ''ఈా'' అను అక్షరముగా వ్రాసియున్నను భాషాధ్వన్యనుసారముగ ''తొ'' అను అక్షరముగా మార్చి చదువునప్పు డది ''తొలివాయి'' అగుటచే అయ్యది అన్నివిధముల చేతను ఈ వరణపిన్ని శాసనమందలి ''ఈాలివాయి'' ''తొలివాయి'' అయిన ''తుల్యా, తుల్యభాగా'' నదియేగాని వేఱుకాదు. కావున దానికింక సందేహింప నవసరములేదు.

ఇంకొక సందేహము:—తుల్యభాగకు ౧౦ వ శతాబ్దమునందే (తూర్పు చాళుక్యుల కాలముననే) ''ఈాలివాయి = తొలివాయి'' అను పేరు వాడుక యందున్నచో అంతకుముందున గాని, ఆ తరువాత మఱి నాలుగు శతాబ్దములకు (౧౪—౧౫శతాబ్దములు) రెడ్డిరాజుల కాలమున కవులుగాని, శాసనకర్తలుగాని ఆ''ఈాలివాయి—తొలివాయి''పదమునే ఉపయోగింపక ''తుల్యభాగ'' అని యేల వాడిరి అని ప్రశ్నయున్నది గదా. స్థల, జల సంబంధమైన నామములు కాలాను సరణముగ మారుచుండుట సర్వసామాన్యము. లోక విదతము. సహజము. అందువల్లనే కదా నాటి భరత ఖండము నేడు భారతదేశము, హిందూదేశము, ఇండియా అను పేర్లతో మార్పుజెందినది. అటులనే ఎన్నో పట్టణములు, గ్రామములు, నదులు, సరస్సులు మొదలగు వానిపేర్లు నిత్యము కాలానుసరణ ముగ మారుచునే యున్నవి. నేటి ద్రాక్షారామము ఒకప్పుడు డాకిరేమి, పెదడాకిరేమి, దక్షవాటిక, దచ్చారామ, అనంతారామ, దార్వికనగరము అను పలుపేర్లతో పిలువబడినది. అట్లే అమరావతిని అమరడాలు, ధాన్యకటాది నామములతో వాడియున్నారు. నిన్నటివరకును బెజవాడ యని నేడు దానినే విజయ వాటిక యనుచున్నారు గదా. ఇట్లెన్ని మారుట

లేదు. అఖండ గౌతమి నుండి వీడి ద్రాక్షారామము వరకున్న "సప్తగోదావరి" నదిని నేడు ద్రాక్షారావు మందున్న యొక్క కోనేరునే అ సప్తగోదావరిగా వాడుటలేదా? అట్లే "గౌతమి" నేవుఱచి "గోదావరి" అను సార్థకనామమునే సుప్రసిద్ధ నామము గావింపలేదా? అంతమాత్రమున గోదావరి గౌతమి గాకుండునా? అట్లే ప్రాతిపదకమైన (జన్మజనిత మైన = పుట్టుకతో వచ్చిన) "జామదగ్ని"యే సర్వలోక విదితమైన, సార్థకనామమగు "తుల్య—తుల్యభాగ" అను పేర్లతోనే సుప్రసిద్ధి గాంచినది. ప్రకృతి సిద్ధమైన అన్వర్థనామముగ "తొలివాయి = తొలిపాయి"గా సర్వసామాన్యులచే వాడబడినది. శాసనాక్షర సాంప్రదాయానుసారముగ నాడు ఆ "తొలివాయి"యే "తొలివాయి" అని వ్రాయబడినది. అంతేగాక దేనినైనను ఒక నామధేయముచే బిలువబడిన దానిని సందర్భానుసారముగను, కాలానుగుణ్యముగను వేరొక ప్రతినామముచేబిలువగూడదను విధినిషేధములు గాన్పింపవు. లేక ఒక్కప్పుడొక పేరుచే వాడ బడిన దానిని మరియొక్కప్పుడు దేశ కాల పాత్రతల ననుసరించి వేరొక (ప్రకృతి, సార్థకాది నామముల) పేరు వాడబడినంతమాత్రమున ప్రాతిపదకమైన లేక పూర్వప్రయోగ దక్షితమైన నామధేయము సరిగాదు తప్పని వక్కాణింప నెవ్వరు సాహసింప గలరు?

ఈ తుల్యకు గల నామములను పురాణాను సారముగ నుదాహరించితిమి. ఇక శాసనమార్గముల వివరింతుము. ౧౪—౧౫ శతాబ్దముల అనపోతారెడ్డి "అనుపత్తి" శాసనమున, అల్లాడ వేమారెడ్డి "అల్లాడ రెడ్డి వేమవర" శాసనమున ఆ "తుల్యభాగ" నామధేయమునే ఉగ్గడించిరి. అయితే ఆ తుల్యా నదినే అంతకు బూర్వము ౭ వ శతాబ్ద ముననే విష్ణుకుండిన జనాశ్రయ మాధవవర్మ తన పులింబూరు తామ్రశాసనమందు "దళియవాయి" అని వాడియుండెను. ఇపుడా "దళియవాయి"శబ్దము వాడబడుట లేదు సరిగదాచారిత్రకులకు దప్ప ఇతరులకా శబ్దమున్నట్లే గోచరించుటలేదు. అందువల్ల ఆనాడు ఈ తుల్యానదికి ఆనాడు "దళియవాయి" అనుపేరు లేదనియు, దళయవాయి వేరు అనియు నిరూపింప వీలుగలుగునా? నాటి పులింబూరు నేటి పొలమూరు కాని, నాటి మైందలివాటిక నేటి మహేంద్రవాడ కాని కాదని నిరూపింపగలమా? అట్లే "వెలుంబలి" వెలంపాలెముగాను 'ఏఱుపల్లి "ఎఱుం బలి' గాను ఎన్నో మాఱుచునే యున్నవి. ఇందుకు తార్కాణముగా ఈ తామ్రశాసన దాన స్థలమగు నాటి "వరణఏన్డి"గ్రామము నేడు "మురమండ"గ్రామము ఇంతకుముందు "మునుమండ"గను అంతకుముందు వేడిమంగళముగాను కాలానుసరణముగా మార్పులు జెందినది.

పై విషయములు బాగుగా గమనించి ఈ శాసనమందలి "తొలివాయి"గా లిఖింప బడినది "తొలివాయి"గా సేకరించి, అయ్యదియే నేటి తుల్యగా తుల్యభాగగా నంగీకరింతురని నమ్ముచున్నాను. అంతేగాని విమర్శనాత్మకమైన యీ వర్తమాన యుగమందు శాసనమందలి "తొలివాయి"కి సుప్రసిద్ధమైన "తుల్య భాగానది" సంబంధము జతగూర్చి కట్టుకథల గల్పించితినని భ్రమించవలదని కోరిక. అట్టి (కల్పిత గాథల) కట్టుకథలతోనే నిల్చిన, దానిని ఉత్తరించు టకు వలయు కవిలి కట్టలెన్నియో సమకూరక బోవునను భయమును లేని సాహసమునకును పాల్పడు వాడను కానని మనవి చేయుచు, యదార్థమునే స్వీక రింతురని నమ్ముచున్నాను.



# రూపాయి విలువ తగ్గింపు

శ్రీ "ఆంగీరస్"

**1966** జూన్ ఐదవ తేదీనాడు రూపాయి యొక్క మారకపు రేటు తగ్గించబడింది. 1949 లో కూడా ఒకసారి ఇట్లానే తగ్గించారు. అప్పుడు ఈ విలువ 30 శాతం తగ్గించబడింది. అయితే ఆ రోజులలో బ్రిటన్ మొదలైన దేశాలు కూడా ఇదేవిధంగా చేశాయి. అందువల్ల పెద్ద బాధలేకపోయింది. ఇప్పుడు అట్లాకాదు. మనం ఒక్కళ్లమే తగ్గించాము. ఈ తగ్గింపు 36.5 శాతం. ఈ 36.5 శాతం మదింపు చేసిన పద్ధతి ఇది. పూర్వం రూపాయి ఒకటికి విలువ 0.186621 గ్రాము బంగారంగా నిర్ణయం అయి వుంది. ఇప్పుడు ఈ విలువ మార్పిడిలో 0.118516 గ్రాముగా నిర్ణయించారు. అంటే 36.5 శాతం రూపాయి యొక్క విలువను తగ్గించారని అర్థం.

రూపాయి విలువను ఒక్క బంగారం - రూపంలోనే గాక ఇతరదేశాల ద్రవ్యాల దృష్ట్యా గూడా మదింపు చేయవలసి వుంటుంది గనుక, మనం వ్యాపార రీత్యా ముఖ్యంగా పరిగణించే ద్రవ్యాలు డాలరున్నూ, పౌండు స్టెర్లింగున్నూ గనుక, ఆ ద్రవ్యాలకు అంతర్జాతీయమైన చలామణి వున్నది గనుక, ఎన్ని రూపాయలు అయితే ఒక డాలరు, లేక ఒక పౌండు స్టెర్లింగ్‌తో సమానమో గూడా ప్రభుత్వంవారు ఈ సందర్భంలో నిర్ణయించారు. దీనివలన పూర్వంవున్న ఈ రకం విలువలు లేక రేట్లు మారిపోయినాయి. పూర్వం 4.76 రూపాయలు అంటే ఒక డాలరుగా వుండేది. ఇప్పుడు 7.50 రూపాయలు అయితేనేగాని ఒక డాలరు కాదు. అదేవిధంగా పూర్వం 13.33 రూపాయలుగా వుండే పౌండు స్టెర్లింగుకు ఇప్పుడు 21 రూపాయలు రేటుగా నిర్ణయించారు.

ఈ రకమైన మార్పును, లేక విలువ తగ్గింపును ఇంగ్లీషులో Devaluation అంటారు.

ఇప్పుడు రూపాయి విలువను ఎందుకు యీ విధంగా తగ్గించవలసివచ్చింది? ఇందుకు ఆర్థికమంత్రి చెప్పిన సమాధానం యీవిధంగా వుంది: "భారతదేశంలో వస్తువుల ధరలు పెరిగిపోయినాయి. పది సంవత్సరాల క్రిందటి ధరలకు, ఇప్పటి ధరలకు యేవిధమైన పొత్తుగాని లేదు. ఈ పదిసంవత్సరాలలో ధరలస్థాయి 80 శాతం పెరిగింది. రూపాయి ధర పెరగలేదు. 1949 నుంచి ఒకేవిధంగా వుంటున్నది. ఇతరదేశాల సంగతి తీసుకుచూస్తే, ఆ దేశాలలో ధరలు ఇంతటి ఎత్తున పెరిగిన జాడ కన్పించదు. ఈ కారణంచేత భారతదేశపు సరుకులు విదేశముల మార్కెట్లలోనికి ఎక్కడం కష్టం అయిపోతున్నది." అనగా ఈ కారణం చేత ఎగుమతులు తగ్గిపోతున్నాయని, అందుకు కారణం మనదేశంలో వస్తువులయొక్క ధరలయొక్క ఆధిక్యమే కారణమని ఇప్పుడు రూపాయి విలువను తగ్గించినందువల్ల ఈ ధరలు అంతర్జాతీయ విపణులలో సమస్థితికి వచ్చి, ఎగుమతులు అధికం కావచ్చునని ఆర్థికమంత్రి భావిస్తున్నారు.

రూపాయి విలువను ఇట్లా మార్చడానికి ముందు చాలాకాలంగా ఎగుమతుల అభివృద్ధికిగాను ప్రభుత్వం అనేక విధాలయిన చర్యలు అవలంబిస్తూ వచ్చింది. ఎగుమతులకు సబ్సిడీలు ఇచ్చింది. ఇంపోర్ట్ ఎన్‌టైటిల్‌మెంటు సౌకర్యాలు సమకూర్చింది. పన్ను పరపతి సర్టిఫికేట్ల పద్ధతిని అమలు పరచింది. అయితే ఈ చర్యలు కొంతవరకే పని చేయగల్గాయి గాని, అనుకున్నమేరకు పని చేయలేదు. మరి భారతదేశానికి వున్న కష్టాలు తాత్కాలికమైనవి కావు. ప్రాతిపదికము, మౌలికము అయినటువంటివి. ఇప్పుడు దేశంలో ధరలు వున్నాయి. ఈధరలను తగ్గిస్తే, కనీసం ఐదు సంవత్సరాల క్రిందటి స్థాయికి తగ్గిస్తే సరిపోతుంది గదా అని వాదించవచ్చు. కాని అది కుదరే విషయమా?

ఆర్థికమంత్రి ఇట్లా సమాధానం చెప్పారు. "ఇప్పుడు ధరలను ఐదు సంవత్సరాల క్రిందటి స్థాయికి తగ్గించ గల్గడమనేది అత్యంతము అసాధ్యమైన విషయము. ఇప్పుడు ఈ ధరలను వున్న స్థాయిలో వుంచగల్గడమే పెద్ద విషయం. ఎంతో బ్రహ్మప్రయత్నం వంటి ప్రయత్నం చేయగల్గినప్పుడే ఇది అయినా సాధ్యం అవుతుంది."

ఈ ధరలు ఒక్కటే గాక, ఇప్పుడు రూపాయి మారకపు రేటును, లేక విలువను తగ్గించడానికి ఇతర మైన కారణాలు కూడా కొన్నివున్నాయి. విదేశీద్రవ్యపు సమస్య వుంది. ఆ విదేశీద్రవ్యం పెద్ద పెద్ద మొత్తాలలో లభ్యం అయితేనేగాని, మనం ఆర్థిక క్లిష్ట స్థితి నుంచి బయటపడలేని స్థితి ఏర్పడిపోయింది. దిగుమతులపై నిర్బంధాల మూలంగా పరిశ్రమలలో ఉత్పత్తి దెబ్బ తింది. 1965 సంవత్సరం అంతటిమీదను పారిశ్రామి కోత్పత్తి 4 శాతం మాత్రమే పెరిగింది. ఇక వ్యవ సాయరంగం సంగతి చూస్తే, అదీ విషమంగా వుంది. వెంటనే ఎరువులను దిగుమతి చేసుకుంటేనే గాని, దేశంలో వ్యవసాయ కార్యక్రమాలు సుష్టుగా నడిచే పరిస్థితిలేదు. వ్యవసాయంలో స్తంభనవల్ల ఆర్థిక రంగంలో ద్రవ్యోల్బణం అధికం అవుతుంది. ఇతర దేశాలకు మనం చెల్లించవలసి వున్న బాకీలు చూస్తే అవి అధికంగా వున్నాయి. లభ్యమై అందుబాటుకు వచ్చే ఆర్థిక సహాయం ఆట్టేలేదు. కాబట్టి కొత్త సహాయం పుట్టనిదే పని జరగని పరిస్థితి ఏర్పడిపోయింది.

ఈ అన్నింటి కన్నా ముఖ్యమైన విషయం ఎగుమతులకు సంబంధించింది. ఇవి ఇప్పడే అంతంత మాత్రంగా వున్నాయి. ఈ జరుగుతున్న ఎగుమతుల వలన లభ్యం అవుతున్న ఆర్జన కూడా ఇతరత్రా వినియోగం అవుతున్నది. ఇందుమూలంగా విదేశాలతో మన వ్యాపారపు లావాదేవీలలో లోటును తట్టుకొనడం కష్టమూ, భారమూ అయిపోతున్నది. ఇప్పుడు అనుస రిస్తున్న విధానాలు మారితే అది ఒక పద్ధతి; మార్చక పోవడం అంటే పని జరగదు. అందువల్ల మన విధానాలను మార్చుకొనక తప్పని పరిస్థితి, రూపాయి విలువను తగ్గించక తప్పని పరిస్థితి ఏర్పడిపోయినాయి.

ఇప్పుడు మనకు విదేశాలనుంచి సహాయం లభించాలి. ఆ సహాయం లభించాలంటే, కొన్ని పనులు చెయ్యాలి. ఎగుమతులను అధికం చేసుకోగలమని, మన ఆర్థిక పరిస్థితిని చక్కబెట్టుకోవాలన్న కృతనిశ్చ యత్వం మనకు వున్నదని ఈ సహాయం చేస్తున్న దేశాల వారికి అనిపించాలి. కాదు నమ్మకం కల్గాలి. ఇప్పుడు మనం ఒకదశలో వున్నాము. ఒకస్థాయిని అందుకున్నాము. పాత అప్పులను తీర్చడానికి కొత్త అప్పులను చేయక తప్పనిపరిస్థితి ఇది. ఇతరదేశాలవలన మనకు లభించే సహాయం ఇంత, అది ఇట్లా వుంటుంది అని తెలియకుండా నాల్గవ ప్రణాళికను వేసుకొనడమే కష్టం అయిపోతుంది.ఇతరదేశాల సహాయం లేకుండాను, లేక కొద్దిమాత్రపు సహాయంతోను ప్రణా ళికను రచించుకుంటామా? అటువంటి "అర్థకుసు" ప్రణాళికవలన ఏమీ లాభంలేదు. మన అవస రాలు తీరవు. అటువంటి భగ్న ప్రణాళిక మూలంగా మన ఆర్థిక సమస్యలు ఎంతమాత్రము తీరవు. ఆర్థిక పరిస్థితి బాగుపడదు. దేశంలో ఏదో విధంగా కావలసిన ధనాన్ని సేకరించగలమే అనుకుందాము. అప్పుడు కూడా విదేశీద్రవ్యం సహాయం లేకుండా అభి వృద్ధి అన్నది ఒక్క అడుగు కూడా ముందుకు సాగదు. దెబ్బతింటుంది. ఇప్పుడు గనుక తాత్కాలికమైన లాభాన్ని మాత్రమే పాటించి దీర్ఘకాలికమైన లక్ష్యా లను బలిచేసుకుంటే, అప్పుడు ప్రజాస్వామ్య ధర్మ వ్యవస్థలో ప్రణాళికా పద్ధతిని అభివృద్ధి సాధించ వచ్చును అన్న మూలసూత్రానికి కూడా మోసం వస్తుంది. మరి యీ పద్ధతి, అనగా ప్రజాస్వామ్య ధర్మంలో ప్రణాళికా పద్ధతిని అభివృద్ధిని సాధించ గల్గడం అన్న పద్ధతి జయప్రదం కానిపక్షంలో భారతదేశమే దెబ్బతినిపోవచ్చు. అప్పుడు ఇతరదేశాలతో కూడా మనకు ప్రశక్తి అన్నది లుప్తం అయిపోతుంది.

ఇప్పుడు రూపాయి విలువను తగ్గించము అను కుందాము; అందువల్ల మనం సాధించగల్గిన విశేషం ఏమన్నా వున్నదా? మన ఆర్థిక పరిస్థితి బాగుపడు తుందా? ఇప్పుడే గనుక ఈ పని చేయని పక్షంలో ముందుముందు మన పరిస్థితి ఇంతకన్నాహీనము ఇంతకన్నాఘోరము అయిపోవచ్చు. అప్పుడు ఇతర దేశాలతో ఏమి మాట్లాడాలన్నా మనకు మనకే సిగ్గుగా వుండే పరిస్థితి తటస్థం అయినా కావచ్చు.

ఇన్ని కారణాలను పురస్కరించుకొని భారత ప్రభుత్వం రూపాయి యొక్క విలువను తగ్గించింది. ఇంతకీ రూపాయి విలువ తగ్గించడం అంటే ఏమిటి?

రూపాయికి కూడా ఒకధర అంటూ వుంటుంది. ఆ ధర విదేశీ ద్రవ్యాలతో సంబంధించింది. ఒక రూపాయి వున్న దంటే, ఆ రూపాయతో ఒక డాలరులో ఎంతభాగాన్ని కొనవచ్చు, ఒక పౌండు స్టెర్లింగులో ఎంత భాగాన్ని కొనవచ్చు అన్నది ఇచ్చట ధరగా ప్రతీతి చెందుతున్నది. అన్ని ధరలకు ఒక లక్షణం వుంది. అది ఒకస్థాయిలో వుండాలి. అప్పుడే జాతీయ ద్రవ్యాధారాలను సరిగ్గా కేటాయింపులు చేసుకోడానికి వీలు ఏర్పడుతుంది. ఇచ్చట దురభిమానాలు, వ్యర్థ ప్రతిష్ఠలు పెట్టు కొని లాభంలేదు. రూపాయి ధరను జాతీయ ప్రయో జనాల దృష్ట్యా, లక్ష్యాల దృష్ట్యా అది ఎట్లావుంటే బాగుంటుందో దానిని అట్లా నిర్ణయించవలసి వుంటుంది.

ప్రపంచంలో ఆర్థిక క్లిష్ట పరిస్థితినుంచి బయటపడడానికి ద్రవ్యపు విలువను తగ్గించిన దేశాలు ఇంకా కొన్ని వున్నాయి. ఇటీవల ఫ్రాన్సు, యుగోస్లా వియాలు ఇట్లా చేసి వున్నాయి. 1958 కి పూర్వం ఫ్రాన్సు దేశం ఆర్థిక స్థితి, రాజకీయ పరిస్థితి లాగానే, పరమ అధ్వాన్నంగావుండేది. ఆ తర్వాత జనరల్ డీగాల్ అధికారంలోనికి వచ్చారు. అంతకుముందు అధికారం నెరపిన ప్రభుత్వాలు విదేశాలతో వ్యాపారం వలన కల్గిన లావాదేవీల తట్టుకోడానికి అనేక రకాల చర్యలను తీసుకున్నాయి. 1957 లో యదార్థానికి ఫ్రాంకు విలువను ప్రభుత్వం తగ్గించింది. అయితే ఆ తగ్గింపునకు న్యాయస్థితిలో స్థితిలేదు. అనగా అది De-facto తగ్గింపు అన్నమాట. దానిని అప్పుడు "Operation 20 Percent" అన్నారు. ఇట్లా అనడానికి కారణంవుంది. ఫ్రాన్సు చేసుకుంటున్న అన్నిరకాల దిగుమతుల మీదను 20 శాతం చొప్పున సర్‌ఛార్జి విధింపబడింది. ఎగుమతిదారులకు 20 శాతం చొప్పున బోనస్ సమకూర్చబడింది. విదేశా లలో వారు అమ్మిన సరుకు విలువను బట్టి ఆ బోనస్ ఇచ్చారు. అంతేగాక విదేశీద్రవ్యాన్ని యాత్రికులద్వారా ఆకర్షించడానికి మార్పిడి రేటులో 20 శాతం "డిస్కౌంట్" ప్రకటింపబడింది. ఇవి అన్నీ ఏమీ పని చేయలేదు. దేశంలో ద్రవ్యోల్బణం యొక్క తీవ్రతముందు యీ "Operation 20 Percent" ఆగలేదు. అందుకు ఇది చాలలేదు. విదేశాల నుంచి ఎంత సహాయం లభ్యమైనా బడ్జెట్టు సమస్థితికి రాలేదు. డీగాల్ అధికారంలోనికి వచ్చి బంగారపు ఋణాన్ని జారీ చేశారు. అందువల్ల కూడా పరిస్థితి బాగుపడలేదు. మనదేశంలో బంగారపు బాండ్ల స్కీము మొదలైన ఆపత్కాల కార్యక్రమాలకు వలెనే ఆకాలంలో ఫ్రాన్సులో కూడా కొన్ని కొన్ని కార్య క్రమాలు అమలు జరుపబడినాయి. దిగుమతుల మీద సుంకాలు హెచ్చింపబడినాయి. ఎగుమతులకు సబ్సిడీలు ప్రకటింపబడినాయి. ఇవి అన్నీ ఫ్రాంకు యొక్క మారకపు రేటును తగ్గించకుండా వుందామని చేసిన పనులే. ఇచ్చట మనదేశంలో కూడా అటువంటి పనులే ఆచరింపబడినాయి. అవి ఇచ్చట కలిసిరాలేదు; అచ్చటా కలిసిరాలేదు. జనరల్ డీగాల్ అంతటితో ఒక నిర్ణయానికి వచ్చేశారు. ఫ్రాంకు యొక్క విలువను తగ్గించారు. ఆ తర్వాత ఫ్రెంచి ఆర్థిక వ్యవస్థ వెనక చూపు అంటూ లేకుండా ముందుపోయింది. 1958లో 100 కోట్ల డాలర్లుగా వున్న ఫ్రాన్సు యొక్క డాలర్ల నిల్వలు 1965 చివరికి 600 కోట్ల డాలర్లు అయినాయి.

ఇదే విధంగా మరో దేశం కూడా తన ద్రవ్యపు విలువను తగ్గించింది. దేశం పేరు ఏమో పైననే చెప్పి వున్నాము. అది యుగోస్లావియా. సోషలిస్టు దేశం. ఆ దేశం తన ద్రవ్యం విలువను తగ్గిం చడం మూలంగా ఆర్థికంగా ఎంతగానో తేరుకొన్నది. 1951 లో యుగోస్లావియా చిక్కుల్లో పడి పోయింది. ధరలు పూరికే పెరిగిపోయినాయి. కోమిన్ ఫారమ్ దేశాలు పెట్టిన తిప్పలు మూలంగా ఆదేశం ఆర్థిక పరిస్థితి అస్తినాస్తి స్థితిలో పడిపోయింది. యుగోస్లావియా చలామణీ ద్రవ్యాన్ని "దీనార్" అంటారు. దాని విలువను మార్షల్ టిటో, యీ ఆర్థిక వైక్లబ్యం నుంచి బయటపడటానికి, తగ్గించి వూరు కున్నారు. దేశంలో ధరలకు, ప్రపంచంలోని ధరలకు సామ్య నిష్పత్తిని అనుసంధానం చేశారు. ఈ పని చేయకపూర్వం ఒక్క డాలరుకు 50 దీనారులు ధర నిర్ణయింపబడి వుంది. ఆ పని చేసినప్పుడు ఒక్క డాలరుకు 300 దీనారులు రేటుగా నిర్ణయించారు. అది కూడా పరిస్థితిని చక్కబెట్టలేదు. 1960 లో "దీనార్" విలువ ఇంకోసారి తగ్గించబడింది. ఈసారి డాలరుకు 750 దీనారులుగా మార్పిడిరేటును నిర్ణ యించారు. ఈ రేటు కూడా నిలకడగా నిల్వలేదు. ౹రాల మీద దీనార్‌కు వేరు వేరు రేటు

ఏర్పడుతూ వచ్చాయి. అధికారికంగా డాలరు ఒకటికి 300 దీనారులు అని నిర్ణయించినప్పుడు కొన్ని సరుకులను ఎగుమతి చేసినప్పుడు యీ రేటు డాలరు 1 కి 1500 దీనారాలుగా కూడా వుంటూ వచ్చింది. ఇది అంతా గోలగా తయారైంది. అందువల్ల యుగోస్లావియా తిరిగి దీనార్ రేటును మార్చింది. ఇది గత జులైలో జరిగింది. ఇప్పుడు 1250 దీనారాలైతేగాని ఒక్కడాలరు కాదు. ఈ పనిచేస్తూ ఎగుమతులకు సబ్సిడీలు మొదలైన పద్ధతులను పూర్తిగా ఎత్తివేసింది.

ఇప్పుడు అటు ఫ్రాన్సు, ఇటు యుగోస్లావియా చేసిన పనులను చూస్తే, వానిలో ఎంతో సామ్యం గోచరిస్తుంది. చలామణి ద్రవ్యం విలువ తగ్గించడం, ఎగుమతులకు సబ్సిడీలను ఎత్తివేయడం, విదేశీ వ్యాపారంపై నిర్బంధాలను తొలగించడం, మిత్ర దేశాల నుంచి ఆర్థిక సహాయం పొందడం ఇవి అన్నీ అక్కడా, ఇక్కడా కూడా ఒకే పద్ధతిలో జరగడం గోచరిస్తుంది. ఇప్పుడు భారతదేశంలో కూడా అదే పద్ధతి అనుసరించబడుతున్నది.



అయితే ఇప్పుడు రూపాయి విలువ తగ్గించడం వల్ల ఇతరదేశాలలో భారతదేశం ప్రతిష్ఠ తగ్గిపోతుందని వాదించే వాళ్ళు లేకపోలేదు. అంతేగాక ఈ విలువ తగ్గింపు వలన దేశం ఎదుర్కొంటున్న ఆర్థిక సమస్యలు పరిష్కారంకావు అనేవాళ్ళు కూడా వున్నారు. ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధులే గాక, అమెరికా వంటి దేశంకూడా వత్తిడిచేయడంవల్ల ఇప్పుడు భారతదేశం రూపాయి విలువను తగ్గించిందని గోలచేస్తున్న వాళ్ళు కూడా వున్నారు. కమ్యూనిస్టుల వాదం ఇది. అయితే వీరు ఒక్కవిషయాన్ని గమనించడంలేదు. ఇతఃపూర్వమే యదార్థతః రూపాయి విలువ తగ్గిపోయింది. ఒక్కడాలరుకు, ఒక్కపౌనుకు— ఆ ద్రవ్యాలకు అధికార రీత్యా నిర్ణయించిన రూపాయలకన్నా ఎక్కువ రూపాయలు చీకటిబజారులలో ఇతరదేశాలలో లభ్యం అవుతూ వస్తున్నాయి. "ఇంపోర్టు ఎంటైటిల్‌మెంటు" మొదలైన స్కీముల వలన అధికార రీత్యా గూడా రూపాయి విలువ తగ్గినట్లుగుర్తించబడింది. ఇటువంటి స్కీములమూలంగా ఇతరదేశాలలో భారతదేశం అంటే విపరీతమైన అభిప్రాయాలు కల్గితే కల్గివుండవచ్చు. భారత ప్రభుత్వం పరిస్థితిని అదుపులో పెట్టలేని స్థితిలో పడిపోయిందన్న భావం అటువంటి పరిస్థితిలో ఆ దేశాలలో కల్గినా కల్గి వుంటుంది. ఇటువంటి దురభిప్రాయాన్ని తొలగ బెట్టడానికి మార్గం ఏమిటి? రూపాయికి తగినటువంటి మార్పిడిరేటును నిర్ణయించడం కన్నా ఇంకో పద్ధతి ఏమన్నా వున్నదా? ఒకసారి రూపాయికి తగిన విలువను నిర్ణయించిన అనంతరం అది తిరిగి పడిపోకుండా, దానిని సంరక్షించుకుంటూ రావడం కన్నా వేరుమార్గం అంటూ ఏమన్నా వున్నదా? రూపాయి విలువ తగ్గిస్తే బాగుంటుందని ప్రపంచబ్యాంకు మొదలైన ద్రవ్య సంస్థలు సలహా ఇచ్చిన మాట నిజమేనని ప్రభుత్వంవారు కూడా అంగీకరిస్తున్నారు. అయితే సలహా ఇచ్చినంతమాత్రంచేత ఒత్తిడి చేశారని విమర్శించడానికి వీలువున్నదా! చాలా దేశాలు చాలా దేశాలకు సలహాలు ఇస్తూ వుంటాయి. ఆ సలహాలు మంచివైతే, లేక తమ స్వప్రయోజన సాధనకు ఉపయోగపడేవి అయితే ఆ దేశాలు వానిని పాటిస్తాయి. లేకపోతే తిరస్కరిస్తాయి. ఇప్పుడు రూపాయి విలువ తగ్గింపు వ్యవహారంలో కూడా అల్లాగే జరిగి వుండవచ్చు. కాని ఇందులో బలవంతం వున్నదని, నిర్బంధం

వున్నదని అనలేము. ఒకప్పుడు రష్యాకు గూడా విదేశీ ద్రవ్యం అవసరం అయింది. ఇప్పుడు ఆ అవసరం లేదని కాదు. ఇప్పుడు కూడా రష్యా దాదాపు 29 దేశాల ద్రవ్యాలను ప్రత్యేకంగా సముపార్జించుకొనడానికి అనేక రకాలయిన ఏర్పాట్లు చేసుకుంటూ వుంది. విదేశాలతో రష్యా చేసే వ్యాపారం దాదాపుగా అంతా "వస్తుపరటా" పద్ధతిని సాగుతూ వుంటుంది. అయితే ఆదేశం కూడా రూబుల్ విలువను తగ్గించవలసి వచ్చింది. 1950 లో రూబుల్ విలువను బంగారం ప్రాతిపదికను నిర్ణయించినప్పుడు రూబులుకు నాల్గు డాలర్లు అధికారపు మార్పిడిరేటుగా నిర్ణయించడం జరిగింది. అయితే విదేశీ ద్రవ్యార్జన కోసం 1957 లో రష్యా "ప్రీమియం" లు ప్రకటించింది. కొన్ని కొన్ని దేశాల ద్రవ్యాలను రూబుళ్లలోనికి మార్చినప్పుడు యీ "ప్రీమియం" ఇస్తానన్నది. ఇవి కొన్నిసందర్భాలలో 150 శాతం దాకా కూడా వుంటూవచ్చాయి. ఆర్థికశాస్త్రంలో వేనిని "Invisible earnings" అంటారు. వానికి రష్యా యీ 'ప్రీమియమ్'లను ప్రకటించింది. అంతేకాదు. 1961 లో రష్యా కొత్త రూబుల్‌ను జారీ చేసింది. దేశంలో 10 పాతరూబుళ్లు ఒకకొత్త రూబులు అవుతుంది. ఇది రూబుల్ యొక్క ఆంతరంగికమైన విలువ. అయితే బయట దేశాల చలామణి ద్రవ్యాలకు సంబంధించినంతవరకు రూబులు విలువ వేరు. ఇచ్చట బంగారానికి రూబులుకు మధ్య వున్న నిష్పత్తి విలువ తగ్గించబడింది. కొత్త రూబులుకు దేశంలో నిర్ణయించిన విలువను బట్టి బంగారపు మదుపు కూడా 10 రెట్లు పెంచవలసి వుంది. పాత రూబులుకు పెట్టిన మదుపు 222 మిల్లిగ్రాములు. ఇప్పుడు కొత్త రూబులుకు నిర్ణయించిన మదుపు 987 మిల్లి గ్రాములు మాత్రమే. మన దేశంలోని కమ్యూనిస్టులు రష్యా యీపనిని ఎవ్వరో చెప్పడంవలన చేసిందంటారా? అదిపూర్తిగా అసంగతం. ఏ దేశం అయినా తన అవసరాన్ని బట్టి, తాను ఎదుర్కొంటున్న పరిస్థితిని బట్టి ఆ పరిస్థితిని తట్టుకోడానికి మాత్రమే ఇటువంటి పనిని చేస్తుంది. అయితే రూపాయి విలువను తగ్గించకుండా, ఆ విలువ తగ్గింపు అవసరాన్ని నివారించుకొనడానికి వీలుగా తగిన చర్యలు అవలంబించి వుంటే బాగుండేదని కొందరు వాదిస్తారు. వీరి అర్థం ఏమిటో అర్థం కాకుండా వుంది. అటువంటి పనులను ఇంతవరకు ప్రభుత్వం చేయలేదనా? ఒకదేశం తన చలామణీ ద్రవ్యంయొక్క మార్పిడిరేటును, లేక విలువను సంరక్షించుకొనడానికి ఎన్ని పనులు చేయవలసి వుంటుందో, అన్ని పనులను భారతప్రభుత్వం చేసింది. ఏమి చేసి వున్నదో పైన వివరించి వున్నాను. మళ్లీ ఇంకొకసారి చెప్పినా దోషంలేదు. దేశంలో ధరల స్థాయి పెరిగిపోయింది. ఎగుమతులు సాగడం కష్టం అయిపోయింది. ప్రపంచపు మార్కెట్టులో ఈ ధరలతో మన సరుకులు పోటీకి నిల్వడం కష్టం అయిపోయింది. వస్త్రాల వ్యాపారం తీసుకు చూస్తే ఇది ఎట్లా జరిగింది విశదం అవుతుంది. ఈ మన వస్త్రాల ధరలు విదేశాల వారికి సరసంగా కన్పించలేదు. ఇందుకు ప్రత్తి ధర, వేతనాలు కారణం కావచ్చు. ప్రభుత్వ విధానం కూడా ఇందుకు ఒక కారణం అయింది. దేశంలో ఉత్పత్తిని పెంచేందుకు ప్రభుత్వం వ్యవసాయ వస్తువులకు అధికమైన ధరలను నిర్ణయించింది. ఇప్పుడు ఈ ధరలను తగ్గించడం సాధ్యమా? Deflation ద్వారా ఆపని చేయవచ్చు. కాని అందువల్ల లాభం ఏమన్నా వుంటుందా? అప్పుడు అభివృద్ధికి సంబంధించిన అన్నిరకాల ఆశలను వదులుకోవలసి వుంటుంది. సరే, ఇటువంటి పని చేద్దాము అనుకుందాము. అప్పుడు రూపాయి విలువ రక్షింపబడుతుందా? Deflation ద్వారా ధరలను తగ్గించడానికి పూనుకుంటే, వేతనాలను, అర్జనలను కూడా తగ్గించవలసి వుంటుంది. ఇందువల్ల ఎటువంటి విపరిణామాలు కల్గుతాయో చెప్పనవసరంలేదు. మనం తగు విధమైన అభివృద్ధిని సాధించాలంటే, దిగుమతులు అధికం కావలసి వుంటుంది. దిగుమతులను అధికం చేసుకోవాలంటే ఎగుమతులను పెంచుకోవలసి వుంటుంది. కొంతకాలం పాటు ఇతరదేశాల వలన సహాయాన్ని పొందవచ్చు. అయితే ఇది ఎల్లకాలం జరిగే పనికాదు. కాబట్టి ఎగుమతులను పెంపొందించుకొనడం ఒక్కటే ఇక్కడ ప్రశస్తమైన మార్గంగా కన్పిస్తుంది. అందుకు రూపాయి మార్పిడి రేటులో మార్పు అవసరం అని వేరుగా చెప్పనవసరం లేదు. ఉత్పత్తిని పెంచకుండా, ఎగుమతులను అభివృద్ధి చేసుకోకుండా, రూపాయి విలువను పూర్వం స్థాయిలో వుంచి, దానిని సంరక్షించుకొనడానికి ద్రావిడ ప్రాణాయామాలు చేసి లాభంలేదు. ఫ్రాన్సుయేమి, జపాను ఏమి తమ తమ ద్రవ్యాల విలువను మార్చి

లోకోత్తరకమైన అభివృద్ధిని సాధించినపద్ధతి చరిత్రలో కన్పిస్తూనే వుంది. అందుచేత ఇప్పుడు రూపాయి విలువను తగ్గించినందువల్ల ఉరికే ఆయాసపడి లాభం లేదు.ఆ పని చేసినందువల్ల ఏర్పడిన పరిస్థితిని రాజకీయ ప్రయోజనాల నిమిత్తం ఉపయోగించుకుందామని చూసి అంతకన్నా లాభంలేదు. అది శాస్త్రదృష్టి కాదు.

ఇప్పుడు రూపాయి విలువను తగ్గించడం జరిగిపోయింది. ఇందువల్ల దేశంలో రూపాయి విలువలో ఏవిధమైన మార్పుగాని వుండదు. విదేశీ ద్రవ్యాలతో పోల్చినప్పుడు మాత్రమే ఈ విలువలో తేడా కన్పిస్తుంది. అయితే విదేశాల నుంచి దిగుమతి అయిన సరుకులను ఏయే వస్తువుల ఉత్పత్తిలో ఉపయోగించవలసి వస్తుందో, ఆ వస్తువుల ధరలు పెరగడానికి అవకాశం వుంది. ఈ విషయం ప్రభుత్వానికి కూడా తెలుసు. అందుకే అందుకు సంబంధించిన ఏర్పాట్లను కొన్నింటిని ప్రభుత్వం ప్రకటించింది. అయితే పూర్తిగా దేశంలో ఉత్పత్తి అయ్యే సరుకుల ధరలు పెరగవలసిన అవసరం కన్పించదు. అవి పెరుగుతున్నాయి అంటే, అందుకు యీ విలువ తగ్గింపు గాక ఇతరమైన కారణాలు వున్నాయి అని అర్థం. ఆకారణంచేత ప్రభుత్వం ఇప్పుడు దేశం ఆర్థిక పరిస్థితిని రెండు విధాలుగా చక్కబెట్టవలసి వుంది. (1) రూపాయి విలువను లేక మార్పిడిరేటును తగ్గించినందువల్ల ఏర్పడిన పరిస్థితిని చక్కబెట్టుకొనడం. (2) ధరల పెరుగుదలను అరికట్టడానికి తగు చర్యలు అవలంబించడం. ఇప్పుడు వీనిలో ఈ ధరల విషయంలో జాగ్రత్తపడని పక్షంలో రూపాయి విలువను తగ్గించడము మూలంగా ఏమి సాధిద్దామని ఆశించబడుతున్నదో, అది సాధ్యమైరాదు. 1949 లో రూపాయి విలువను తగ్గించిన అనంతరం అటువంటి జాగ్రత్తపడకపోయినందు వలన ఇప్పుడు యీ పరిస్థితిని మనం ఎదుర్కొనవలసి వచ్చిందన్న విషయాన్ని విస్మరించరాదు.

ఇప్పుడు రూపాయి విలువను తగ్గించడం మూలంగా కొన్ని కొన్ని లాభాలు ఒనగూడి రాగలవని ప్రభుత్వంవారు భావిస్తున్నారు. ముఖ్యంగా ఎగుమతులు పెరగగలవని, విదేశీద్రవ్యం వినియోగంలో అపసవ్యపు పద్ధతులు నివారణ కాగలవని, "పరోక్ష ద్రవ్యార్జన" అధికం కాగలదని ఆశించబడుతున్నది.అయితే కొందరు ఈ విలువ తగ్గింపు వలన ఎగుమతులు అనుకున్నంతగా పెరగకపోవచ్చునంటున్నారు. కాని ఈ వాదంలో పస వున్నట్లు కన్పించదు. పూర్వం రూపాయి విలువను పాక్షికంగానైనా తగ్గించినందువల్లనే మన ఎగుమతులు 800 కోట్ల రూపాయల స్థాయిలోనైనా నిల్వడం జరిగింది. ఇందుకు సబ్సిడీలు మొదలైనవి ఇవ్వవలసి వచ్చింది. ఇప్పుడు యీ సబ్సిడీలు వుండవు. అందుచేత ఎగుమతులు పడిపోవచ్చునని వాదిస్తున్నారు. ఇది సరికాదు. రూపాయి విలువను తగ్గించినందు వలన ప్రతిఒక్క విదేశీద్రవ్యము ఇప్పుడు పూర్వంకన్నా ఎక్కువ రూపాయలను పొందగలదు. అనగా ధరలు గనుక సరిగ్గా వుంటే, ఒక డాలరు, లేక ఒక పౌను ఎక్కువ సరుకులను ఈ దేశంలో కొనగల్గడానికి సమర్థం అవుతున్నది. రూపాయి రేటులో మార్పిడి వలన కలుతున్న లాభాలలో ఇది ఒకటి. ఇట్లా ఆలోచిస్తే, పూర్వంకన్నా ఇప్పుడు ఎక్కువ సరుకును ఎగుమతి చేయగలందులకు అవకాశం వుంది.

రూపాయి విలువను తగ్గించినందువలన ఇంకో మేలు కూడా కల్గుతున్నది. ఇప్పుడు దిగుమతుల ఖరీదు అవుతాయి. ఒక డాలరు విలువ చేసే సరుకును దిగుమతిచేసుకోవాలి అంటే, రూపాయి విలువను తగ్గించకముందు ఆ సరుకుకు అధికారికంగా నిర్ణయించిన రేటు ప్రకారం రు. 4.76 లు చెల్లించవలసి వుండినది. ఇప్పుడు అదే సరుకుకు రు. 7.50 లు చెల్లించవలసి వుంటుంది. ఇట్లాగే ఇతరదేశాల నుంచి దిగుమతుల విషయంలో కూడాను. ఆ కారణంచేత ఇప్పుడు దిగుమతులు తగ్గుతాయి. ముఖ్యంగా అనవసరమైన దిగుమతుల విధిగా తగ్గిపోవలసి వుంటుంది. ముఖ్యమైన సరుకుల దిగుమతులకు యేవిధమైన ఇబ్బందులను ప్రభుత్వం కల్పించదు. అటువంటి దిగుమతులను ప్రోద్బలపరుస్తుంది. అందుకు కూడా ప్రభుత్వం తగు చర్యలు అవలంబిస్తూ వున్నది.

దిగుమతులు ఖరీదైపోయినప్పుడు, వానికి ప్రత్యామ్నాయంగా దేశంలో అటువంటి సరుకులను ఉత్పత్తి చేసుకొనవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఆ ప్రత్యామ్నాయపు సరుకులను దేశంలో కనిపెట్టి ఉత్పత్తి చేసుకొనని పక్షంలో ఈ తగ్గింపువలన కల్గవలసిన ఒక ఫలితం కలగనిదైపోతుంది. అందువల్ల ఇప్పుడు శాస్త్రపరిశోధనకు, దిగుమతి సరుకులకు

ప్రత్యామ్నాయపు సరుకును ఉత్పత్తి చేయవలసివున్న కృషికి బ్రహ్మాండమైన ప్రోత్సాహం లభిస్తుంది. అనగా ఏవం విధమైన అనేక పరిశ్రమలు మనదేశంలో తల ఎత్తడానికి వీలు ఏర్పడి పరిశ్రమలరంగంలో నూతనో త్సాహం వెల్లివిరుస్తుంది.

ఇవి అన్నీ బాగానే వున్నాయి. కాని ఇచ్చట ప్రధానమైన విషయం ఒకటి వుంది. రూపాయి విలువను ఎందుకోసమని తగ్గించడం జరిగిందో, ఆ లక్ష్యాన్ని సాధించడానికి గాఢమైన కృషి జరగని పక్షంలో దేశం పూర్తిగా దెబ్బతినిపోతుంది. అందు చేతనే ఇప్పుడు వారు వీరు జరిగిపోయిన పనినిగురించి విమర్శలు చేస్తూ కూర్చొనడం పనికాదు. ఇప్పుడు ఏమి చేయవలసి వుంటుందో నిశ్చయించుకొని, ఆ ప్రకారం నడుచుకోవలసి వుంటుంది; ముఖ్యంగా వ్యవసాయరంగంలో తగు అభివృద్ధిని సాధించవలసి వుంటుంది. ఆహారధాన్యాల విషయంలో ఇతరదేశాల మీద ఆధారపడవలసి వున్న స్థితిని ఎంత త్వరగా నివారించుకుంటే అంత మంచిది. అన్నింటి కన్నా ముఖ్యం దేశంలో ద్రవ్యోల్బణ స్థితిని అరికట్టడం. ఆ పని చేయలేని పక్షంలో ధరలను అదుపులోనికి తీసుకునిరావడమే కష్టమైపోతుంది. ఇప్పుడు రూపాయి విలువను తగ్గించడంవలన ప్రభుత్వం తనపై అత్యంతము గురుతరమైన బాధ్యతను వేసుకున్నది. అది దేశాన్ని ప్రస్తుత ఆర్థిక దుస్థితినుంచి ఉద్ధరించడం. ఆ పనిని సాధించగల్గినప్పుడే ఇప్పుడు రూపాయి విలువను తగ్గించినందువలన ఆశించిన ప్రయోజనం లభ్యం అవుతుంది. దానిని సాధించనినాడు అంతా కష్టమే; అంతా నష్టమే.



## కలగూరగంప:

# తెలుగుపై ఉర్దూ సాహిత్య ప్రభావం

శ్రీ సదాశివ

తెలుగు వారికి ముసల్మానులతో సంపర్కం అల్లాయుద్దీన్ ఖిల్జి కాలంలో కలిగింది. అప్పటి ముసల్మానుల భాష పారసీ. అప్పట్లో తెలుగువారు కొన్ని పారసీ పదాలు వినివుంటారు.

తుగ్లకుల కాలంలో, దక్షిణాపథం చాలాభాగం ముసల్మానులకు వశమైనప్పుడు తెలుగు భాషలో పారసీ పదాలు కొన్ని చేరివుంటవి.

గోలకొండ, బీజాపూరుల సుల్తానుల కాలం నాటికి ఉర్దూ (దక్కనీ) భాష రూపొందింది. ఆ ప్రభువులు పారసీ ఉర్దూ సాహిత్యాలనే కాక ప్రాంతీయ భాషల సాహిత్యాలను పోషించారు. ఆదాన ప్రదాన రూపంలో, ఆనాడు పా[illegible] ఉర్దూ పదా[illegible]నేకం తెలుగులో కలిసిపోయినవి.

ఉర్దూలో అరబీ పారసీ పదాలు అధికంగా వుంటవి కనుక ఆ పదాలన్నిటినీ ఉర్దూ పదాలనే వ్యవహరించటం ప్రస్తుతానికి బాగుంటుంది.

తమకు అష్టభాషా పాండిత్యం వున్నదని చెప్పుకొనిన మన కవులు "అరబీభాష, తురుష్కభాష........" అన్నారు. తురుష్కభాష ఎన్నడూ మనదేశంలో ప్రచారం పొందినట్లులేదు—ఆ నాటి ముసల్మానుల భాషనే తురుష్క భాష అనివుంటారు మనవారు.

ఆనాడు ప్రభుత్వ వ్యవహారాలకు పనికి వచ్చే ఉర్దూ పదాలతో ప్రజకు పరిచయం కలగటం సహజము—ప్రజల వ్యవహారాల్ని స్వీకరించిన స్వతంత్ర బుద్ధిగల మహాకవులు, శ్రీనాథుడూ ఇతర ప్రబంధ కవులూ తమ కావ్యాల్లో ఉర్దూ పదాలను ఎక్కించారు.

ఇలా సారస్వతంలో చేరినవేకాక, ఆనాటి కవిలెలూ, కైఫీయత్తులూ, దస్తావేజులూ పరిశీలిస్తే తెలుగు వారి వ్యవహారంలో చేరిన ఉర్దూపదాలు అనేకం కన్పిస్తాయి.

ఈపదాలు చాలావరకు నిఘంటువుల కెక్కాయి. అయితే నిఘంటువుల్లో అనేకపదాలకు, అటు మూల భాషకు, ఇటు వ్యవహారానికీ సరిపడని అర్థాలీయబడిన వని మే 1962 భారతిలో నేను తెలిపి వున్నాను.

తెలుగువారి వ్యవహారంలో చేరిపోయిన ఈ అన్యదేశ్యాలు కొన్ని వున్నట్లే వున్నవి. కలము, కలముదాను, ఖజానా, జమీందారు, జాగీర్దారు, ఖుషి, గులాము ఆ కొన్నిటిలో కొన్ని.

మరికొన్ని రూపుమార్చుకున్నవి — కిటికీ (ఖిడ్కీ) కుర్చీ (కుర్సీ) కచేరీ (కచెహరీ) గలీబు (గిలాఫ్) గోరీ (గోర్) జుల్మానా (జుర్మానా) నగిషి (నఖ్ష్) ఆబోరు (ఆబ్రూ) ఫలానా, ఫలాని (ఫలాం) ఈ కొన్ని అలాటివి.

ఇంక కొన్ని విచిత్రంగా అర్థమే మార్చుకున్నవి. సంస్కృత పదాలు కూడా తెలుగులో అర్థం మార్చుకున్నవున్నవి. కనుక ఇది స్వాభావికమే. అలాటి పదాలు కొన్ని ఉదాహరిస్తాను.

1. గలభా—'గల్బా' అనే పదం నుండి యేర్పడిన పదమిది. మూలభాషలో దీనికి ఆధిక్యం అని అర్థం— మనం అల్లరికి వాడుతున్నాము.

2. తగాదా, తగాయిదా— దీనికి మూలం "తఖాజా" ఒత్తిడి చేయుట అని అర్థం. మనం ఘర్షణకు వాడుతున్నాము.

3. ఖావందు, ఖామందు— దీనికి మూలం "ఖావింద్" కావచ్చు—ఖావిం దంటే భర్త. మనం యజమాని, భూస్వామి అనే అర్థాలలో వాడుతున్నాము. ఉర్దూలోనూ దీనికి యజమాని అనే అర్థం వున్నప్పటికీ భర్తకొరకే రూఢి.

4. కులాసా—'ఖులాసా' అనే పదం దీనికి మూలం—సారాంశమని—అర్థం—మనం క్షేమానికి వాడుతున్నాము.

5. తిరకాసు--తిర్కస్ అంటే వంకరగా మూడు మూలాలు కలిగినది.

6. ఆజమాయిషీ—'అజ్‌మాయిషీ' అనే ఈ పదానికి మూలంలో పరీక్షార్థం అని అర్థం.

7. మోతుబరు—'మోతెబర్' అనగా నమ్మదగినవాడు.

8. కత్తు—'ఖద్' అనే పదానికి ఎత్తు అని అర్థం— 'అంతా ఒక కత్తువారే' అంటారు తెలంగాణాలో—అంటే అంతా ఒకే మోస్తరని తాత్పర్యం.

9. ఖాతరు—'ఖాతిర్' అనే పదానికి కొరకు గౌరవం అనే అర్థాలున్నవి. 'ఖాతిర్ మే లానా' అనే పదబంధానికి లక్ష్యం చేయుటమని అర్థం. మనం ఈ అర్థంలో మాత్రమే వాడుతున్నాము.

10. కౌలు—'ఖౌల్' అంటే మాట. తెలుగులోనే ఈ ప్రయోగం వున్నది. తెలుగులో భూసంబంధ వ్యవహారాలకే ఇది రూఢీ.

11. దేవిడీమన్నా—ఈ ప్రయోగమూ తెలుగులోనే వున్నది. దేవిడీ అంటే భవనం—మనా అంటే నిషేధం—భవనానికి రాకపోకలు నిషేధించటానికి ఈ పదబంధం వాడబడుతూ వున్నది.

12. పాంజేబులు. మన పదంవలె ఉన్న ఇది 'పాజేబ్' అనే పారసీ పదం. పా అంటే పాదం. జేబ్ అంటే భూషణం.

ఇలా తెలుగులో ఉర్దూ పదాలు పరశ్శతాలు కలిసిన మాట వాస్తవమే కాని తెలుగు కవితపై కాని ఇతర రచనలపై కాని నిన్నమొన్నటి వరకు ఉర్దూ సారస్వత ప్రభావం ఏమీ పడినట్లు కన్పించదు—

అందుకు కారణాలున్నవి.

ఉర్దూ కవిత ప్రారంభదశలో వున్నప్పుడే తెలుగు కవిత చాల పరిణతి చెందింది.

ఉర్దూ కవుల సమయసంప్రదాయములు విజాతీయమైనవి. కవితావస్తువు అట్టిదే--వారి శృంగారము, ప్రణయము, మనకు సరిపడనివి కనుక ఉర్దూ కవిత తెలుగు వారిని ప్రభావితుల చేయలేదప్పట్లో.

వారి ఉపమేయాల్లో చాలావరకు మనకు విరుద్ధమైనవి. వారి అలంకారాలు మన ఆలంకారాల ముందు నిలువజాలినవి కావు.

ఉర్దూ వచన రచన కూడ తెలుగు వారిపై ఏమీ ప్రభావం చూపలేదు.

నేడు ఉర్దూ ముషాయిరాల ప్రభావం వలన ఉర్దూ గజల్లపోకడలు పోతున్నారు మన కవులు కొందరు. అదీ అంత్యప్రాసవరకే.

నవలా రచనపై కథారచనపై, ప్రేమ్‌చంద్, కిషన్‌చందర్‌ల ప్రభావం కన్పిస్తున్నది.

అయినప్పటికీ, మహాకవులు ఎప్పటివారైనా, ఎక్కడివారైనా కొన్నిసందర్భాల్లో ఒకే తీరుగా ఆలోచిస్తారంటారు. కొందరు ఉర్దూకవుల భావాల్లో తెలుగుకవుల పోలికలున్నవి. అవి అనుసరణ అనటానికి ఎలాగూ అవకాశంలేదు.

"ప్రియురాలి విరహంలో నేను కృశించి ప్రాణావశిష్టుణ్ణయ్యాను. హితుల బలవంతం వలన ఆమె నన్ను చూడవచ్చినది. ఆమె రాక వలన కలిగిన నా ముఖవికాసాన్ని చూచి, "అతనికేమైంది? బాగానే వున్నాడంటుంది." అంటాడు గాలిబు.

"వారిజనాభ! నేనిపుడు వచ్చుచు నుండి
యలోకికాద్భుత
శ్రీరుచిరత్వదీయనగరీగిరిమాతిశయావలోక లీ
లా రస దూరధూత సకలవ్యథ చిత్తుడనై
యథా పురా
కారత నీకు దోచెదనొ కాని తనుద్యుతి
బాసితిం బుమా."

అంటాడు ఇంద్రుడు కృష్ణునితో, పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలో—

మర్సియా రచయితలు మీర్ అనీస్, మిర్జాదబీరుల గ్రీష్మఋతువర్ణనలో ఎర్రెన్నచోడుని పోలికలు కన్పిస్తవి కొన్ని—

అయినా ఇది అనుసరణకాదు, అనువాదమూ కాదు. ఒక భాషాప్రభావం ఇంకొక భాషపై పడిందనటానికి వీలులేదు.

"సంవాదినో మేధావినాం ఒద్దయః"

ఉర్దూ పదాలు తెలంగాణాప్రాంతపు తెలుగులో చాలా కన్పిస్తాయి— ఆదిలాబాద తెలుగులో మరీను. ఉర్దూ పదాలకే ఇంచుగాగమం చేసి క్రియలుగా మలచుకున్నారిక్కడివారు.

ఇక్కడి కారకం వింతగానే వుంటుంది—ఉర్దూ జాతీయాలను, పలుకుబళ్లను తెలుగులో అనువదించి

యథేచ్ఛగా వాడుతారిక్కడ—అవన్నీ ఓపిగ్గా సేక రిస్తే ఓ గ్రంథం తయారు కావచ్చు.

ఉర్దూ సంపర్కం తెలుగు భాషలో కొంత పదజాలం పెంపు చేసిందికాని సాహిత్యంపై చెప్పుకో దగినంత ప్రభావం చూపలేదు.

## కాటమరాజు : పుల్లరి యుద్ధకాలము

శ్రీ అప్పారావుగారు మరల (1966 సం. జూన్) భారతిలో చర్చ సాగించుచు కాటమరాజు 'యుద్ధ మెప్పుడు జరిగినదియు నిప్పటికి గల యాధారములతో నిర్ణయించుటకు వీలుకాదని' పీఠికలో కీర్తిశేషులు మల్లంపల్లిసోమశేఖరశర్మగారు వ్రాసినట్లు పేర్కొనుట ; అప్పటికి సరిపోయినను, ఎప్పటికి సరిపడదని నా విన్నపము.

'పైన నేను సూచించినట్లు యీ శాసనము వీరుల మాహాత్మ్యము తెల్పుటకు పుట్టినది గనుక కాటమరాజు కథ ద్విపదలో రచించిన తర్వాతనే చెక్కి యుండవలెను.' అని శ్రీ అప్పారావుగా రూహించుటకు శాసనమందలి ద్విపద లక్ష్యము తోడ్పడుచున్నది. కాని, శాసన ద్విపద కాలమే కాటమరాజు ద్విపదకాల మేల కారాదు?

కాటమరాజు పుల్లరి యుద్ధకాలము నిర్ణ యించుటకు గుంటూరుజిల్లా నర్సారావుపేట శాస నము చక్కగా తోడ్పడుచున్నది. అందలి నెల్లూరు చోడవంశమూ, కాలము పనికివచ్చును.

తిక్కరాజు
|
మన్మసిద్ధి

|
తిక్కరాజు నలసిద్ధి

మన్మగండ గోపాలుడు క్రీ. శ. 1297

ఈ నెల్లూరు చోడవంశమందలి 'నల్లసిద్ధి'యే కాటమరాజుతో పుల్లరి యుద్ధము కావించినట్లు ద్విపద చరిత్ర సూచించుచున్నది.

'తనర వ్రాయించ్చిరి తిక్కన చాత
విరుషు సంవత్సర కాలము కార్తిక
యాశ్వ విదియు యలమి గురువారము

యిలలోన నలసిద్ధి రాజిచ్చిన కవులు'
(అవుల మేపు. 1—59 తాటియాకు.)

ఈ ద్విపదలో శకవర్షములు చెప్పకపోయినను, శాసనమందలి శా. శ. ౧౨౦౫ అగు, హేమలంబి కాలము కంటే కొంచెము ముందు కాలమనుట కాక్షే పములేదు. కాకతీయ 'ప్రతాపరుద్ర భూపతీ' కాలము నాటిదన వీలున్నది. కాబట్టి, నెల్లూరి పుల్లరి కవులు శా. శ. 1203 అగు విషు సంవత్సర కార్తిక శు 2 గురువారమూ—అనగా 16—10—1281 తేది నెల్లూరు కరణము తిక్కన వ్రాసినట్లు స్పష్టమగు చున్నది. క్రీ. శ. 1281 నాటికి నెల్లూరు చోడరాజు నల్లసిద్ధి రాజ్యము సాగినట్లున్నది. క్రీ. శ. 1282 చిత్రభానులో పుల్లరి యుద్ధమూ పరిసమాప్తమయి నట్లు ద్విపద కాల చరిత్ర తెల్పుచున్నది.

చిత్రభాను సంవత్సరము చెలగి కార్తిక
చెతుర్దశి దినమున శనివారము నాడు
ఆ రాత్రి వేగిన అవుల పబ్బమూ.'
(అవుల మేపు 1—32 తాటియాకు.)

శా. శ. 1204 అగు చిత్రభాను సంవత్స రము కార్తిక బ 14 శనివారము 17—3—1282 తేదీతో సమకాలమగుచున్నది.

ఇట్లు ద్విపదకాలములు నర్సారావుపేట శాసన చోడవంశ కాలముతో సరిపోవుచున్నను, కాటమరాజు యుద్ధకాలము నిర్ణయము కాలేదనుట చిత్రమే కద!

'కాటమరాజు (ద్విపద)కథలో చెప్పిన కాలము, మాఘ బహుళ అమావాస్య మంగళవారము' శా. శ. 1204 అగు చిత్రభాను కార్తిక బ 14 శనివారము నకు తర్వాత సుమారు మూడు మాసములకు సరి పడునో, లేదో చూడవలసియున్నది. చిత్రభానులో అవుల పబ్బము తర్వాత యుద్ధము జరిగినది. కాళయుక్తి పుల్లరి యుద్ధకాలము కానేకాదు.

క్రీ. శ. 1282 ప్రాంతములో కాటమరాజు పుల్లరి యుద్ధము కాగా, క్రీ. శ. 1438 కాళయుక్తిలో శాసన ద్విపద రచింపబడినదనుట కాల సమన్వయము. అది 'కాకతాళీయము—దానికి

ప్రబలాధారమేలేదు. వారి తలంపే దానికి ఆధారముగా కన్పట్టుచున్నది.' అని శ్రీ అప్పారావుగారు వ్రాయుటలో న్యాయమున్నదో, లేదో? ఆలోచింప వేడుకోలు.

అట్లగుచో కాలదోషమున్న శాసనములన్నియు పనికిమాలిన రాళ్లగును కదా!

—దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి.

## కీర్తిశేషుడు శ్రీ దేవరకొండ బాలగంగాధర తిలక్

కొందరిపై మనం ఎన్నో ఆశలు పెట్టుకుంటాము - వారి చురుకుదనంచూచి. ఆ ఆశలను ఆ దుర్విదగ్ధులే ధ్వంసంచేస్తారు. మరొకప్పుడు దుర్విధి ఆ ఆశలపై ఆశని పడవేస్తుంది అలవోకగా. మన గుండె ప్రిదిలిపోతుంది. అలాటి దుర్విధి విలసితమే శ్రీ దేవరకొండ బాలగంగాధరతిలక్ విషయంలోను సంఘటిల్లింది.

సాహిత్యంలోని అన్ని ప్రక్రియలలోను శ్రీ తిలక్ కైవాడం చూచిన సహృదయులు. 'ఈయన ముందు ముందు అరువనా మోతలేకాక, పూర్తి ఆమెతలు ఇస్తాడనే ఆశించారు. విధి ఎందుకో కన్నెర్ర చేసింది. శ్రీ తిలక్ ఈ నెల మొదటి తేదీన (1—7—66) కాలధర్మం—కాదుకాదు అకాల ధర్మం చెందారు. పట్టుమని పదిఐదుల ప్రాయమన్నాకాలేదు.

శ్రీ దేవరకొండ బాలగంగాధరతిలక్ 1921 ఆగస్టులో పశ్చిమ గోదావరిజిల్లాలో జన్మించారు. మద్రాసులో విద్యాభ్యాసం చేశారు. తణుకులో స్థిరపడ్డారు. ఇష్టమైన వృత్తి సాహిత్యంకాని, జీవితపు వృత్తి గుడ్డల వ్యాపారం.

శ్రీ తిలక్ తెలుగు సాహిత్యంలోని సృజనాత్మక ప్రక్రియలన్నిటిలోను ఎంతోకాలంగా వున్న వారినందరినీ తీసుకుని ముందుకువచ్చి, ఔననిపించుకున్నారు. ముఖ్యంగా పద్యగంధి వచనం—వచనగీతం పాతవారినికూడా లోగొన్నది. ఇటీవల భారతిలో—1966 ఏప్రిల్ పడిన "శిఖరారోహణ" చాలు—ఆయన పద్యగంధి వచన రచనకు తార్కాణ. .

ఆయన కథకుడుగాను గొప్పస్థానం సంపాదించాడు. "ఊరిచివరిఇల్లు"వంటి ఆయన కథలు గొప్ప కథలన్టాయిని అందుకుంటాయనడంలో అతిశయోక్తి వుండదు. సమకాలిక పత్రికలు ఈ రెండు దశాబ్దాలుగా ఆయన వివిధ రచనలతో నిండిపోయాయి. కథ రచించే కమనీయతతోనే పద్య గ్రంథి వచనం, పద్య గంధి వచనం వ్రాసే ఒడుపుతోనే వృత్తరచన, అంతటి అంద చందాలతోనే గేయం, ఇలా అన్నిటినీ పొంకంగా రచించారు.

కళకోసం కళ అనే పద్ధతిలో కాకుండా శ్రీ తిలక్ రచనాకళ మానవతావాదంతో, నేటి మానవుణ్ణి మానవుడుగాచూచే అతి సామాన్యవాదంతో వెల్లివిరిసింది. ఆయన కథలలో దళితులు, పతితులు, భ్రష్టులు, ఏవో అపోహలతో, భ్రమలతో మోసపోయినవారు, తమ హృదయంలో దాగిన మానవత్వం, మినుకు మినుకుమనే మానవత్వం వెలుగులు వెలికిరాగా తమతోపాటు మననూ చకితులనుచేశారు.

ఇలాటివాడు కనీసం షష్టి పూర్తివరకైనా వుంటే, ఇంకా ఎన్ని రచనలు వచ్చేవో, ఇలాటివారు కనుమరుగయినప్పుడల్లా కలిగే వెలితి, వెలితే!

ఏలూరు 'ప్రజాప్రచురణ'లవారు శ్రీ తిలక్ వ్రాసిన—ఊరిచివరి ఇల్లు, సుందరీ—సుబ్బారావు కథానికలు, సుచిత్రపరిణయం, సుశీలపెళ్లి ప్రకటించారు. వీరి అముద్రిత రచనలలో "సుప్తశిల" అనే నాటకం, ఇంకా ఎన్నో కథలు, గేయాలు వున్నాయి. వీరి కొన్ని రచనలు మళయాలం, కన్నడం, హిందీ, బెంగాలీ, ఇంగ్లీషు, రష్యన్‌భాషలలోనికి అనువదింపబడినాయి.

# గ్రంథ విమర్శలు

## కాదంబరీ కల్యాణము

[అనువాదకులు: శిరోమణి శ్రీ సన్నిధానము సూర్య నారాయణశాస్త్రి, ప్రాప్తిస్థానము: గ్రంథకర్త, 44 జీరా, సికింద్రాబాదు. డెమి 1/8 సైజు పుటలు 20+144 వెల రు. 3.]

ఈ గ్రంథమూలము బాణభట్టవిరచిత కాదంబరీ కథ నాధారముగా గ్రహించి సంస్కృతములో నరసింహభట్టు రచించిన నాటకము. మూలకథనే కొలది మార్పులతో మాత్రము అనుసరించెను. మహాశ్వేతా పుండరీక మను నంతర్నాటకము ప్రదర్శించుట అట్టి మార్పులలో నొకటి.

సంస్కృతభాషలో ననేక నాటకములున్నను అభిజ్ఞానశాకుంతలాదులగు కొన్నిటికే ప్రసిద్ధి వచ్చినది. శాకుంతలమువలె మహోన్నతస్థాయిలో లేకున్నను, ప్రచారలోపముచేత తగినంత ప్రసిద్ధి రాని మంచి నాటకము లెన్నో సంస్కృతభాషలో ఉన్నవి. అట్టివానిలో నిది యొకటి. ఆంధ్రకవులు సంస్కృత వాణిని తమ రచనలచే అన్నికాలములందును అలంకరించుచునే ఉన్నారు. ఆంధ్రుడైన ఈ విద్వత్కవి నాటకమును అనువదించుటకు చేపట్టినందులకు ఈ అనువాదకులను ప్రత్యేకముగా అభినందించుచున్నాము.

ఈ అనువాదములో గ్రంథకర్త కొన్ని మంచి సంప్రదాయముల ననుసరించిరి మూలగ్రంథములో స్త్రీలకును అథమ పాత్రలకును సంప్రదాయసిద్ధముగా ప్రాకృతము వాడబడినది. అనువాదములో ఉత్తమ స్త్రీపాత్రలకు గ్రాంథికభాషయు, తక్కిన వారికి వ్యావహారిక భాషయు వాడిరి. ఇది కొంతవరకు సమన్వయ పద్ధతి. ఆంధ్రదేశములో వ్యావహారిక భాషలో గూడ నెన్నో అవాంతర భేదములున్నవి. ప్రాకృత భాషాభేదముల ననుసరించి ఆంధ్ర వ్యావహారిక భాషా భేదములును ఒక వ్యవస్థతో ప్రయోగించుట ఇంతకంటె మంచిదేమో సంస్కృత నాటకముల ననువాదము చేయువారు ఆలోచించదగియున్నది.

వ్యాకరణ శాస్త్రాభిమానులయిన శ్రీ శాస్త్రిగారు వీర గ్రాంథికులు అనుమతింపని ప్రయోగము లెన్నో చేసి, వారి సమన్వయ పద్ధతి ప్రదర్శించిరి. 'వసించెన్నిప్పుడు' వంటి సంధులు,'ఓరి...తీఱె..ధరణి-మెఱుగు' వంటి లఘ్వలఘురేఫల ప్రాస మైత్రి, 'ఏక మొత్తముగా' వంటి వ్యావహారములోనున్న వైరి సమాసములు, 'పరాయి సౌఖ్యములె సరదామెయి' వంటి ప్రయోగములు ఈ గ్రంథకర్త వంటివారు కావలెనని చేయుట నేడు ఆంధ్రభాష జీవద్భాషకు ఎంత సమీపమునకు వచ్చుచు పరిణామము చెందుచున్నదో తెలుపుటకు ప్రబల నిదర్శనము. ఈ నడలింపులు ఎక్కడెక్కడ రచనలో కానరాకుండ కలసిపోవునో, ఎక్కడ కలియవో గ్రంథకర్తలే శ్రవణ సౌఖ్యమును బట్టి ప్రస్తుతము నిర్ణయించుకొనవలసి యున్నది. అందులో నభిప్రాయభేదముల కెంతో అవకాశమున్నది. కాని కొన్ని ప్రయోగములు ఎంత వ్యాకరణయుక్తములైనను చెవికి ఇంపుగా నుండవు. "సలిలదేవత శ్రీత్త దృశ్యత్వమొంది" (పే. 14) వంటివి అట్టివానిలోనివి.

అనువాదములో పద్యరచన ఎక్కువభాగము మధురముగా సాగిపోయినది. కొన్ని మాత్రము కుంటుపడుచున్నవి. మరికొంత శ్రద్ధ చూపినచో అవి కూడ తక్కిన వాని శ్రావ్యధోరణిలో మురుపు కుల్కెడివి.

"తినదాహారము; తొంటిచందమునఁ బ్రీతిన్ వీణఁ
బల్కింప ; దొ
య్యన మాటాడదు; చెల్మికత్తియలతో హాస్యంబులం
బల్క; దా
ననముం గొంగునఁ గప్పి మూసి కనులం దల్పంబునం
బండ రే
యిని వేగించును దొర్లుచున్ హృదయమెంతే దూయ
మానంబుగాన్" (పే. 56)

"పులకల కేసరములతో
మలసిన ఘర్మోదబిందు మకరందముతో

జలితాంగుళి దళములతోఁ
దలిరాకుంబోఁడి కేలుదామర తాఁకెన్'' (పే29)

ఇట్టి మంచిపద్యములు గ్రంథ మందంతట నున్నవి.

ఈ నాటకమునకు ముందు 20 పేజీం 'ఉపక్రమణిక' గ్రంథకర్త వ్రాసిరి. అందులో సంస్కృత నాటకములలో "విష్కంభము, ప్రవేశకము, అంకాస్యము, జనాంతికము, ఆకాశభాషితము'' మొదలగు వాని సంకేతములను వివరించి, నాటకములోని పంచసంధులను గూడ సమన్వయము చేసి ఆంధ్ర పాఠక లోకమునకు ఎంతయు ఉపకరించునట్లు చేసిరి. రెండు తావులందు సందర్భము లేకపోయినను బలవంతముగాతెచ్చి "వ్యాకరణ శిరోమణి, బ్రాహ్మీ పుత్ర చెలిమిచెర్ల రంగాచార్యులవారు జనాంతికమని చెప్పక "మెల్లగా'' అని Stage direction చేసిరి. ఇది శుద్ధతప్పు'' అని ఇత్యాదిగా వ్రాయకున్నచో ఎక్కువ ఉదాత్త ధోరణిలో నుండెడిది.

ఈ యనువాదము ముఖ్యముగా నాంధ్ర పాఠకులును విశ్వవిద్యాలయాధికారులును అభిమానింప దగినది. నాటక లక్షణము అను శీర్షిక క్రింద "కావ్య వాఙ్మయము, దృశ్యము, శ్రవ్యము, అని ద్వివిధము.......శ్రవ్యమనఁ బద్యకావ్యము'' అని వ్రాయుటలో కాదంబరివంటి గద్య కావ్యములను శ్రవ్య కావ్యములలో చేరవని సూచించునట్లు నిర్వచించినది, గ్రంథకర్త ఉద్దేశింపక ప్రమాద పతితమైనదిగా భావింతుము.

—నోరి నరసింహశాస్త్రి.

## నీటిమీద దీపాలు

[కథలు. రచయిత : ఇచ్ఛాపురపు జగన్నాథరావు, ప్రచురణ : ప్రభాత్ పబ్లిషింగ్ హౌస్, తెనాలి. పుటలు : 318. వెల : రు. 6.]

పత్రికల్లో లోగడ ప్రచురింపబడిన కథలను రచయిత సంకలితం చేశారు. ఇందులో 'రాగోదయం', 64 పుటల పెద్ద కథ, అన్నిటిలో ఉత్తమంగా ఉన్నది. రచయిత కథ చెప్పటంలో ఒక ప్రత్యేక ధోరణిని రూపొందించుకున్నారు. ఆ ధోరణి సాధించిన ఉత్తమ ఫలితం 'రాగోదయం.' శేఖర్ స్నేహితుడు రామాన్ని చూడటానికి అతని గ్రామానికి వెళ్తాడు. శేఖర్‌కూ అతని భార్యకూ మధ్య ఒక అగాధం ఏర్పడింది. అందుకు ఇదమిత్థమంటూ కారణంలేదు. భార్య పట్ల క్రమంగా శేఖర్ చూపుతూ వచ్చిన నిర్లక్ష్యమే కారణం. తనలోని 'అశాంతి'కి స్నేహితుడి దగ్గరకు వెడితే నివారణోపాయం ఏదైనా దొరకవచ్చుననుకొని వెళ్లాడు శేఖర్. వెళ్లేటప్పటికి రామం అకస్మాత్తుగా మరణించి ఆరురోజులైనట్లు తెలుస్తుంది. రామానికీ అతని భార్య శ్యామలకూ కూడా పరస్పర వైముఖ్యం ఏర్పడి ఉండినట్లూ, అకస్మాత్తుగా రామం మరణించటం మూలాన శ్యామల గతాన్ని తలచుకొని రామాన్ని సరిగా అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నట్లూ గ్రహిస్తాడు శేఖర్. రామం వైవాహిక జీవితంలో ఏర్పడిన పరిస్థితిని అర్థం చేసుకోవడంలో, అనుకోకుండానే, శేఖర్‌లోనూ ఆత్మ పరీక్ష జరుగుతుంది. భార్య రాజేశ్వరిపట్ల అకారణంగా గలించిన ఆసక్తి, మళ్లీ చివురెత్తి అతనిలో రాగోదయం అవుతుంది. శేఖర్‌లో వచ్చే ఈ మార్పుకి రామాపురంలో తారసిల్లిన పార్వతి, వసుంధర, మనోరమ అనే స్త్రీలు కూడా—శ్యామల, రామం, రాజేశ్వరుల పట్ల వరుసగా ఆ ముగ్గురూ చూపే అభిమానం ద్వారా—కారణభూతులౌతారు. ఈ కథని చెప్పడంలో, పరిస్థితిలోని క్లిష్టతని మెలకువతో చిత్రించడంలో, రచయిత వ్యక్తం చేసిన ప్రతిభ మెచ్చుకోదగ్గది. శేఖర్, రామం, యిద్దరూ మధ్యవయస్కులు—వారి సమస్య మధ్యవయస్కుల సమస్య; అనుకోకుండా జీవిత దృక్పథంలో వచ్చే పరిణామం; అంతకుపూర్వం ఆసక్తి కలిగించిన సంగతులూ, వ్యక్తులు ఆసక్తి కలిగించక పోవడం; మనోవైఖరిలో మార్పు; ఏదో అలజడి, అశాంతి, ఏమి చెయ్యాలో తెలీక చీట్లపేక, మద్యపానం, వగైరాలను ఆశ్రయించడం. రామం రచయిత కావడంతో తన సమస్యని నవల రూపంగా తర్కించడం ప్రారంభించాడు. వసుంధర అందుకు దోహదం చేసింది. ఫలితంగా అతని భార్య శ్యామలలో అసూయ, అపోహ రేకెత్తాయి. కాని నవల పూర్తి కాకుండానే రామం మరణించాడు. అతని మరణం కలిగించిన 'షాక్' వల్ల శ్యామల అసూయ అపోహ అనే తెరలు ఒత్తిగించి, రామాన్ని స్పష్టంగా, వస్తుతః అర్థం చేసుకోగలిగింది. శ్యామలను గమనిస్తూ, రామం జీవితంలో ఏర్పడిన సమస్యను అవగాహన చేసుకునే ప్రయత్నంలో, శేఖర్ కూడా తనని తాను

స్పష్టంగా చూసుకోగలిగాడు. రామం శేఖర్‌లు ఎదు ర్కొన్న సమస్య వాళ్లకు అంత పెద్దదిగా కనిపించ డానికి, అలా పెద్దది కావడానికి ముఖ్యకారణం ఒకటున్నది—ఇద్దరికీ పిల్లలులేరు! పిల్లలున్న సంసా రంలోనైతే మధ్యవయస్సులో వచ్చే మానసికమైన మార్పు ఏదైనా, పిల్లల బాధ్యత కారణంగా, విపరీత పరిణామాలకు దారితీయక పోవచ్చునేమో! కాని లోతుగా చూస్తే పిల్లలకూ వాళ్ల 'ప్రపంచం' అంటూ వాళ్లకు వుంటుంది. అందువల్ల భార్యకూ భర్తకూ మధ్యగల 'నిజాన్ని' ధైర్యంగా గుర్తించటం కంటె సరియైన పరిష్కారం మరొకటి యీ సమ స్యకు వుండదు. కథలో పార్వతి అనే అమ్మాయి ద్వారా శేఖర్‌కు ఈ స్ఫురణ కలుగుతుంది. "పార్వతి తన దగ్గర కూర్చున్నప్పుడల్లా తనకి అనిపిస్తుంది. ఆమె తన పిల్ల అయితే ఎంత బాగుండుననని...కాని ఆమెలో చిత్రమైనది ఆమె మరొకర్ని రక్షిస్తున్నా, తానే రక్షితగా కనబడడం" (33) "అతనికి ఆశ్చర్యం అనిపించింది. పార్వతి తననుకొంటూన్న పసిపిల్ల కాదు. ఆమె యువతి. తన వయస్సుని బట్టి ఆమె మీద తన దృష్టిని నిర్ణయించుకున్నాడు తాను. ఆమె మానసిక జీవితాన్ని ఏమాత్రమూ అర్థం చేసు కోలేకపోయాడు." (46) "కాదు.. తనకీ రాజ్యానికీ, మధ్య ఏదో నిజం ఉంది. శ్యామలకీ రామానికీ; రామా నికీ వసుంధరకీ మధ్య ఉన్నట్లే..తాత్కాలికంగా తాను పొరపాటుపడ్డాడు. ఆమె కూడా ఏదో పొరపాటు చేసింది. ఔనా?" "రాజ్యానికి తాను తప్ప ఎవరున్నా రని? ఎవరి మీద ఆశలతో ఆమె బ్రతుకుతుందని? తనకీ ఎవరున్నారు?" (55) ఇదీ రాగోదయం! ఈ కథలో చక్కని ధ్వని—ఎదుటివారిని అర్థం చేసుకుంటేతప్ప ఆత్మజ్ఞానం కలగదు. అనుబంధాన్ని అంగీకరించటం ద్వారానే శాంతి, సౌఖ్యం.

ఈ రచయిత శైలి ఒక్కొక్కసారి వింత పోకడలు పోతుంది. ఉదాహరణ. "ఆ ఆలోచనల మబ్బుల్లో నన్ను వదిలేసి సుడిగాలి మల్లే చివాలున లేచి వెళ్లిపోయావు. నువ్వట్లా చీదరించుకుని వెళ్లి పోతుంటే ఎన్ని మృత్యువులో నన్ను గుచ్చుకున్నాయి... స్తబ్ధుడనైపోయి కదలలేక పోయానుగానీ, ఆలోచన ల్లోనే నీకాళ్లకి చుట్టుకుని నా మనస్సులోని వ్యథల సంకెళ్లువేసి నిన్నా సుందర పరిసరాలలో ప్రతిష్ఠించు కున్నాను.నా కథంతా చెప్పాను.నామనసులోవుండిపోయిన శిథిలాలతో యిల్లుకట్టి నిన్నందులో దాచుకున్నాను." (సాంధ్యరాగంలో సావిత్రి) ఇది ఒక్కొక్కసారి— అరుదుగానే—కేవలం నీడల్ని తరిమే అయోమయత్వం లోకి దిగజారిపోవడం కద్దు. కాని ఈ రచయితలో తరచు ఆలోచనే ఆవేశం మీద అజమాయిషీ చేస్తూ చెప్పదలచింది స్పష్టంగా సూటిగా తికమకలు లేకుండా వ్యక్తం చేస్తూ వుంటుంది.

మగవాళ్ల అనుమానాలూ, ఆడవాళ్ల అబ ద్ధాలూ పరస్పరం ఆధారపడిన బొమ్మ—బొరుసు లాంటివనీ, ఏవి ముందు పుట్టాయో, ఏవి ముందు నశించాలో నిర్ణయించడం కష్టమనీ, ఒకానొక మన స్తత్వ రహస్యాన్ని, చక్కగా చిత్రించిన కథ 'నీటి మీద దీపాలు' నీటి మీద దీపాలకు అవి తప్పించుకో లేని ప్రతిబింబాలు వుంటాయనిఉద్దేశం. వెలుగుతున్న దీపం క్రింద చీకటి వుంటుంది. ప్రేమించినవాడే మోసగింపబడతాడు. మనసిచ్చిన వాడే బాధ పడతాడు. ఈ జీవన ధర్మాన్ని గుర్తించి వెలుగుతో చీకటినీ, ప్రేమతో మోసాన్నీ, మనస్సుతో బాధనీ జయించే నిరంతర ప్రయత్నం చేయాలని సూచిస్తూ చక్కని సన్నివేశంలో తయా రైన కథ 'ప్రేమ—చీకటి'. కథ ముగింపు వాక్యాలు "రేపు దీపావళి.....చిక్కటి చీకట్లని రిక్షా దీపం తరుముతోంది. సాంద్రనిశ్శబ్దాన్ని అతని ఈలపాట భంగం చేస్తోంది." (144)

చక్కని సన్నివేశాలను సృష్టించటంలో ఈ రచయిత అందెవేసిన చెయ్యి. ప్రతి కథలోనూ ద్వంద్వాలను ప్రతిపాదించటం, ఆ రెండింటినీ సమ న్వయపరచే సత్యాన్ని అన్వేషించటం ఈ రచయిత పద్ధతి. ప్రతి అనుభూతిలో, ప్రతి ఆకాంక్షలో, నిత్యజీవితంలోని సన్నివేశాలలో, ఈ ద్వంద్వాల సంఘర్షణ వుంటుంది.

అన్ని సమస్యలకూ (రాగోదయం, నీటిమీద దీపాలు,) ఆపోహలకూ (ఏకరక్తం, నీతిపరులు) ఆశా భంగాలకూ (సాంధ్యరాగంలో సావిత్రి,ప్రేమ—చీకటి) భంగపాట్లకూ, (భర్తలూ—భార్యలూ, నిరూపకమ్. రసభంగం),విభ్రమాలకూ (1+1=0),విషాదాలకూ (బొమ్మలు, తిరిగి వచ్చిన దీపావళి), విపర్యయాలకూ (నీటగలిసిన త్యాగాలు), ఆధారభూతము ద్వంద్వాల విచిత్ర ఖేలనమేనని, ఒకరకం ద్వంద్వాత్మక తర్క

పద్ధతిని (Dialectical method) జీవితంలోని వైచిత్రినీ వైవిధ్యాన్నీ విశ్లేషించి రసవత్తరంగా చిత్రించే ఈ కథలు తప్పక చదువదగినవి.

## అల్ప జీవులు

[కథల సంపుటి. రచన, ప్రచురణ: నవ్య సాహితీ సమితి, విజయవాడ శాఖ. ప్రతులకు: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ—2. పుటలు: 181. వెల: రు. 3.]

"గత ఆగస్టు నెలలో (19?4?) ప్రారంభించ బడిన సమితిశాఖ విజయవంతంగా పనిచేసి...ఈ పుస్తక ప్రచురణను తలపెట్టి నిర్వహించగలిగినందుకు ఎంతో గర్విస్తున్నది....అన్నికథలూ ఉత్తమ తరగతికి చెందిన వని మేము ఆత్యుక్తులు చెప్పబోవటంలేదు. అయినా రచయిత లందరిలోనూ ప్రస్ఫుటమవుతున్న ఉత్సాహాన్ని పాఠకులు అభినందించగలరని ఆశిస్తున్నాము....." (మనవి.) తథాస్తు!

ఈ సంపుటిలో నవ్యసాహితీ సమితి సభ్యులు పదునలుగురు వ్రాసిన పదునాలుగు కథలున్నాయి. 'భ్రష్టయోగి' (పెద్దిబోట్ల సుబ్బరామయ్య) 'శ్రేయోభిలాషులు' (ఆదివిష్ణు) అనే రెండు కథలు మాత్రమే అందులో ఎన్నదగినవిగా ఉన్నాయి. మొదటి కథలో కష్టజీవి ఒంటెద్దు బండి తోలే సుబ్బన్న పాత్ర చిత్రణ హృద్యముగా ఉన్నది. సుబ్బన్న కర్మయోగి. ఒంటరివాడై తన బ్రదుకు తను బ్రదుకుతూ ఊరి వాళ్ళకి చేతనైనంత సాయంచేస్తూ రోజులు వెళ్ల బుచ్చాడు. చిట్టచివర వయసు పైబడుతున్నదని తోచి తను కూడబెట్టిన చిల్లరడబ్బుల మూటతో ఊరికరణంగారి దగ్గరకు వెళ్ళి, దాన్ని గ్రామంలో స్థాపన కాబోతున్న పాఠశాలకు వినియుక్తం చెయ్యమని చెప్పి 'నిబ్బరంగా అడుగులు వేస్తూ మహదానందంతో తేలికపడిన మనస్సుతో నడిచిపోతాడు.' కాని ఆ చిల్లరడబ్బుల మూటలో చాలభాగం 'ఒకనెల రోజుల క్రితం ప్రభుత్వంవారు రద్దుచేసిన పచ్చ బేడలూ అణాలూ, అర్ధణాలూ'! అందువల్లనే కాబోలు రచయిత సుబ్బన్నను 'భ్రష్టయోగి' అంటు న్నట్లు తోస్తున్నది. కథకు ఆపేరు పెట్టడంలో ఉద్దేశం అదే అయితే సుబ్బన్న ఏవిధంగానూ భ్రష్ట యోగి కాలేదనే చెప్పాలి! 'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన' అను సూక్తికి అనుగుణంగా కరణం గారికి డబ్బు ముట్టజెప్పటంతో అతని కర్తవ్యం ముగిసింది. అతనిచ్చిన ఆ కొద్ది డబ్బూ నిజంగా ఉపయోగపడినా ఉపయోగపడకపోయినా అతనికి మాత్రం భ్రష్టత్వం' రాదు! కథకు మరో పేరు పెడితే బాగుండేదేమో! 'శ్రేయోభిలాషులు' కథ ఒక వృద్ధుని పాత్ర చిత్రణ. చక్కగా వుంది. ఎటొచ్చీ రచయిత యిదివరకే తన నవల 'మనిషి—మిథ్య'లో చిత్రించిన వృద్ధుడైన తండ్రికీ, ఈ కథలోని వృద్ధుడైన తాతగారికీ పెద్దగా భేదం లేదు. ఇద్దరూ ఒక మూసతో తయారైన వారే. ఇటువంటిచర్వితచర్వణము (Repeating One self) రచయిత తన సాహిత్య వ్యాసంగంలో జాగరూకతతో పరిహరించుకోవలసిన లక్షణం.

'మనసులోని కోరిక' (కృష్ణమాచార్య) 'అల్ప జీవులు' (అరిగే రామారావు), ఒక మోస్తరు మంచి కథలు. 'నీరజ' (సరస్వతీ బాబూరావు) 'మగువ మనసు' (సింగరాజురామచంద్రమూర్తి) 'గులాబిముళ్లు' (విహారి, శాలివాహన) 'అనూరాధ' (రాధామాధవ్) 'నేను వాళ్లిద్దరు' (ఎన్. రమణమూర్తి) కథల్లో మనస్తత్వ పరిశీలనా ప్రయత్నం కనిపిస్తుంది. యిందులో ఏ ప్రయత్నమూ ఫలించలేదు. కాని ఈ రచయితల సాహిత్య కృషి భవిష్యత్తులో ఫలప్రదం కావచ్చు. ఆమాటే ఇక్కడ పేర్కొనక మిగిలిన అయిదు కథల రచయితల విషయంలోనూ అనడానికి ఏ ఆధారమూ లేదు!

## శాంతల

[నవల. కన్నడ మూలం: కె. వి. అయ్యరు. తెనుగుసేత: తిరుమల రామచంద్ర, ప్రచురణ: కేంద్ర సాహిత్య అకాడెమీ పక్షమున సాహితీకేంద్రం, తెనాలి. పుటలు: 387. వెల: రు. 8/-]

నేటి మైసూరు రాష్ట్రంలోని బేలూరు. హళేబీడు దేవాలయాల్ని నిర్మించిన హొయిసళ ప్రభువు విష్ణువర్ధనుని సాంసారిక గాథ యితివృత్తంగా గల ఈ నవలలో, చారిత్రకమైన కొన్ని ఆధారాలతో రచయిత చేసిన కల్పన, సాధించిన అర్థం, ఉత్కృష్ట మైనది, విశిష్టమైనది. హళేబీడు హొయిసళేశ్వర దేవాలయంలో మహాదేవుని ముందున్న వర్తులాకార

మైన శిలాపీఠం మీద కూర్చుని, రచయిత విష్ణు వర్ధనుని దేవేరి శాంతల భక్తి పరవశురాలై నర్తించిన దృశ్యాన్ని భావించి మననం చెయ్యడం ద్వారా, ఆ రాత్రి కాంచిన ఒక దివ్యస్వప్నం, ఈ కథకు బీజమని పీఠికలో ప్రసక్తమైంది. ఆ స్వప్నమే నవలలో రెండవభాగం, 20 వ అధ్యాయంలో కుమార విష్ణువు కన్న కలగా వర్ణింపబడినదట. నవల ముగింపును సూచించే సాధనంగానేకాదు, నవల అభివ్యక్తం చేస్తున్న విలక్షణమైన దృక్పథానికి సుందర పతాకగా కూడ ఈ స్వప్నం ముఖ్యమైనది. ఈ ఒక్క అధ్యాయమే చాలు ఈ నవలలకు సాహిత్య గౌరవం కలిగించేందుకు.

నవల మొదటిభాగం శాంతలా విష్ణువర్ధనుల వివాహం. ఈ భాగం శాంతల కుటుంబాన్నీ, బాల్యం వర్ణిస్తూ ప్రారంభమౌతుంది. శాంతలతోబాటు ఆమె సహాధ్యాయిని లక్ష్మిని కూడా రాజు పరిణయం కావడాన్ని సమర్థించేందుకు ఈ భాగంలో రచయిత చూపిన కారణాలూ, కల్పించిన పరిస్థితులూ, విమర్శనా దృష్టితో చూచే పాఠకునికి అవిశ్వాసం కలిగించక మానవు. తర్వాత శాంతల పట్టమహిషిగా రూపొందటం గాని ఆమె వ్యక్తిత్వం యొక్క విశిష్టతగాని రచయిత 'నిరూపించ' లేకపోవటంతో పాఠకుని ఉత్సాహం తగ్గి, నవల మొదటి సగం అసంతృప్తి కలిగిస్తూనే వుంటుంది. విష్ణువర్ధనుని దక్షిణ దిగ్విజయయాత్ర ముగియటం, రాజధానికి కలిగిన ముప్పు, కుమార విష్ణువు ధైర్యసాహసాలు—(రెండవ భాగం—8 అధ్యా) ఇక్కడి నుండి కథకు ప్రాణం వస్తుంది. శాంతల వ్యక్తిత్వం 'నిరూపిత' మౌతుంది. చివరకు రచయిత 'స్వప్నం', అక్షరాలా, ఫలిస్తుంది! కాబట్టి నవల మొదటి 160 పుటల్లో రచయిత శిల్పం మరో విధంగా మెరుగులు దిద్దుకొని వుంటే బాగుండేదేమో! నవల సాంతం చదివిన తర్వాత గాని రాజు శాంతలనూ లక్ష్మినీ మొదటిసారి చూచి నప్పుడు లక్ష్మే శాంతల అని అభిప్రాయపడి ఆమె మీద వలపు నిలుపుకోవడంలోని స్వారస్యం గోచరించదు. శాంతల, లక్ష్మి, యిద్దరు కారు! ఒక్కరే: శాంతల ఆత్మ, లక్ష్మి శరీరము—అనే భావాన్ని రచయిత మొదట నొక్కిచెప్పడం కూడా అవిశ్వాసాన్నే కలిగిస్తుంది కాని కథ ముగింపు దృష్ట్యా ఆభావంలోని ఔచిత్యమేకాదు, యాథార్థ్యం, ఊహాతీతమైన రహస్యం, చివరకు గొప్పగా స్ఫురిస్తుంది. ఇలా నవల పూర్వార్ధం అర్థపుష్టి కోసం బొత్తిగా ఉత్తరార్ధం మీద ఆధారపడటం ఒక లోపం. ఉత్తరార్ధం పూర్వార్ధం మీద ఆధారపడటమే కథా శిల్పంలో సొగసు. తద్విరుద్ధంగా జరగటం మూలాన నవల పాఠకుణ్ణి మొదట్లో ఆకట్టుకోలేకపోవడం దురదృష్టమే అని చెప్పాలి.

శాంతలకు సాంసారికంగా, రాచకీయంగా ఒక విషమ సమస్య ఎదురౌతుంది. తనకు సంతానం లేకపోవడంతో రాజ్యానికి ఔరసుడెవరన్న ప్రశ్న రాజు కంటె ఆమెనే ఎక్కువ కలవర పెడుతుంది. పట్టమహిషి కాని దేవేరికి పుత్రుడు కలిగినా వాడు రాజ్యానికి అనర్హుడని సంప్రదాయం. లక్ష్మిని కూడా పట్టమహిషిని చెయ్యరాదా అంటే ఇద్దరు పట్టమహిషిలుండటానికి వీల్లేదు. శాంతల ఆ పదవి నుండి వైదొలగటానికి సిద్ధంగానే వున్నా, ప్రజల్లో ఆమె పదవీ భ్రష్ట కావడం లేనిపోని అపోహలకు తావిస్తుందని, రాజు అలా చెయ్యడానికి యిష్టపడడు. పైగా ఆమె మీద అతనికి ఎనలేని గౌరవమూ, ప్రేమా ఈ సమస్యను పరిష్కారంగా, కుమార విష్ణువును యువరాజును చేయవచ్చునని రాజు, రాణి ఊహిస్తారు. ఇంతలో వారికి తెలియజేయకనే, కుమార విష్ణువు 'గరుడి' అవుతాడు. 'గరుడి' అవడం అంటే రాజు మరణించినప్పుడు తాను కూడా మరణిస్తాననే ప్రతిజ్ఞ బూనటం. ఆ కాలంలో స్వామి భక్తిపరాయణులై వీరులు వహించే దీక్ష అది. శాంతల సమస్య మళ్లీ మొదటికి వచ్చింది. ఈ పరిస్థితిలో శాంతల కుమార విష్ణువు తోడుగా శివగంగ క్షేత్రానికి యాత్ర వెళుతుంది. శివగంగ గిరి మీద గంగాధరేశ్వరుని సేవించి, గిరి శిఖరానికి వెళ్తూ, దారిలో మంచి నీళ్లు తెమ్మని కుమార విష్ణువును పంపించి, తను 'కోడుగల్లు బసవణ్ణ' అనే నందివిగ్రహానికి ప్రదక్షిణ చేస్తూ అక్కడి నుండి పడి ప్రాణాన్ని త్యజిస్తుంది. తిరిగివచ్చిన కుమార విష్ణువు ఆమెతో బాటు దూకి మరణిస్తాడు. ఈ చరిత్రాంశాన్ని వ్యాఖ్యానించడం లోనే రచయిత ప్రతిభ వ్యక్తమైంది. రాణి శాంతల కొండ మీద ప్రదక్షిణ చేస్తూ కాలుజారి పడి మరణించిందో, లేక సమస్యా పరిష్కారం కోసం ఆత్మహత్యే చేసుకొన్నదో ఆమెకు తప్ప అది మరెవరికీ తెలీని

రహస్యం! రచయిత అది ఆమె చేసుకొన్న నిర్ణయమే అని వ్యాఖ్యానించడం ద్వారా, శాంతల వ్యక్తిత్వానికి విశిష్టమైన రూపకల్పన చేశాడు. కాని ఆత్మహత్యను సమర్థించడం సులువుకాదు! ఇక్కడ జరిగినది ఆత్మహత్య—మహాపాతకం—కాదు; ఇది ఒక గొప్ప ఆధ్యాత్మిక విశ్వాసంతో, ప్రేమతో చేసిన త్యాగం; ఆమె విశ్వాసానికీ, ప్రేమకూ తద్వారా తగిన సత్ఫలితమూ లభించింది. ఆమె సాహసాన్ని భగవంతుడు మన్నించాడు. శాంతల, కుబుసం విడిచిన సర్పంలాగా, తన కొఱగాని (సంతానానికి నోచుకోని) దేహాన్ని విసర్జించి, లక్ష్మిమలో ఐక్యం అయి, క్రొత్త శాంతలగా జీవించి రాజ్యానికి ఔరసుణ్ణి కన్నది అని రచయిత వ్యాఖ్యానించడంలో,, నిరూపించడంలో కృతకృత్యుడయ్యాడు. ఇదీ నవల యొక్క ఉత్కృష్టత.

రచయిత నిరూపించిన దృక్పథానికి చారిత్రకంగా మంచి ఉపపత్తి వున్నది. మనిషిగాఢమైన విశ్వాసానికీ, భక్తి భావానికీ లోబడి బ్రదికిన రోజులవి. మేధ కంటె హృదయానికే ప్రాధాన్యం నాటి నాగరకతలో. సందేహాత్మలు మచ్చుకైనా కనిపించరు ఈ నవలలో. సామాన్య సైనికుడు, వార్తావహుడు, రథ చోదకుడు, ఎవరైనా సరే ప్రాణాల్ని తృణప్రాయంగా చూడటమేకాదు, అవకాశం వచ్చినప్పుడు రాజు కోసం, దైవం కోసం, కీర్తికోసం మనస్ఫూర్తిగా బలి కావడం కంటె జీవితానికి వేరు సార్థక్యం లేదన్న విశ్వాసంలో, సంప్రదాయంలో జీవించే వాళ్లే కనిపిస్తారు. శాంతల నిర్ణయం కూడా ఆ సంప్రదాయానికి సంబంధించినదే! "ఈ నవలలో వచ్చే గరుడి, భైరవ, రణబలి, సతి, సల్లేఖన, సిద్ధతలాదులు. అన్నిటికీ శాసనాల నిశ్చితాధారం ఉన్నది.....పూర్వకాలపు ఈ వీరయుగంలో ఈరీతి ప్రాణార్పణం ఒక యోగమనే పరిగణితమయినది" (పు, 387) అని అనువాద కర్తల ఉటంకింపు. ఆకాలంలో శైవం, వైష్ణవం, జైనం ప్రబలంగా వుండటంతో సామాన్య ప్రజలో మూడింటికి సంబంధించిన సిద్ధాంతాలూ, భావాలూ విస్పష్టంగా కాక వారి అభిరుచులకు తగినట్లు సమ్మిశ్రితంగా వుండేవని తోస్తుంది. ప్రాణత్యాగం అనేది ముఖ్యంగా జైన సంప్రదాయానికి సంబంధించినది. యుగధర్మం 'యుద్ధ వీరము' కావడంతో, ఆ విధంగా కూడా ప్రాణాలకు విలువ తక్కువ అవడం సహజమే..నవలలో చివర విష్ణువర్ధనుడు, లక్ష్మిమలో పునర్జీవితురాలైన శాంతలను యిలా ప్రశ్నిస్తాడు. "ప్రపంచంలో చావు బ్రతుకులే ఒక మహారహస్యం, మహా విచిత్రం .ఒక్కొక్క మతమూ ఒక్కొక్కవిధంగా చెబుతున్నది. ఒక్కొక్క మతాచార్యుడూ ఒక్కొక్క రీతిగా అభిప్రాయపడుతున్నారు. అందరూ మహాత్ములే. ఎవరిని నమ్మడం? దేనిని నమ్మడం? నా మనస్సుకూ ఏమేమో భాసిస్తుంది. దేవీ, నీవు ఏమి చూచినావు? నీ అనుభవమేమి?".... శాంతల అంటుంది. "దేవా, నా ఆత్మకు ఏ నొప్పీ, ఏ బాధా కలుగలేదు. దేహం మాత్రం పాడిపాడి అయినది. అప్పుడది ఆత్మనివాసానికి అనర్హమైనది..." లక్ష్మిమతో తను ఐక్యం కావడాన్ని గూర్చి శాంతల వివరణ. "మా యిద్దరి ఆత్మలూ గాలిలో గాలి, నీటిలో నీరు చేరినట్టు చేరిపోయినవి....ఈ అనంతానంతమైన ఆత్మలన్నీ ఒకే పరమాత్మ బహురూపాలని నా నమ్మిక. పరస్పర ప్రేమవిశ్వాసాలే దీనికి ఆధారం....నేనూ, లక్ష్మి మీ ఆత్మ భిన్నరూపాలే. మనందరి ఆత్మ ఒక్కటే కావాలి..ప్రేమ విశ్వాసాల పోషణ మొక్కటే దీనికి సాధన మార్గం. ఆత్మీయతే ధ్రువం.."ఈ మాటలు వట్టి మాటలుగా కాక, శాంతల చరిత్రలో, ఆమె సాధన ద్వారా సాహసం ద్వారా, నిరూపితం కావడమే ఈ నవల ఉత్కృష్టత. విష్ణువర్ధనుని పాత్రచిత్రణం ద్వారా గ్రాహ్యమయ్యే విషయమూ ఒక్కటున్నది—సిద్ధాంతాలూ మతమూ పెద్దగా అవగాహన కాక పోయినా ఆనాటి రాజుల ధర్మదీక్ష గాఢమైన విశ్వాసమే వారిని ఉన్నతుల్ని చేశాయి; మతం విషయంలో, సాధన చేసే తీరిక, అవకాశం వున్న వారి పత్నులే వారి కంటె ఎక్కువ తెలిసినవారేమో! వైవాహిక ధర్మం దృష్ట్యా చూచినా, పత్నులు ఒకరా? నలుగురా? అనే బహిర్విషయం కంటె, పురుషుని యొక్క గాఢశీలత్వం, సంయమనమే ప్రధానంగా ఆనాడు భాసించేది. అదీ నాటికీ నేటికీ గల తేడా అనిపిస్తుంది! ఈ నవల పై రీతిగా ఆనాటి యుగధర్మాన్ని చిత్రించడంలో చక్కని సొగసు దిద్దుకొన్నది. అనువాదం నిర్దుష్టంగా, కథకూ దేశకాల పాత్రములకూ తగిన ఒక వైలక్షణ్యంతో, స్వాదువుగా వున్నది.

—ఆర్. ఎన్.

## అలరాస పుట్టిళ్ళు

(రచయిత్రి : శ్రీమతి కళ్యాణసుందరీ జగన్నాథ్
ప్రేమ్‌చంద్ పబ్లికేషన్సు, 123 పేజీలు, వెల 3రూ)

అమ్మమ్మ వాళ్ళింట్లోనో నాన్నమ్మ వాళ్ళింట్లోనో పడు కుని కథలు వినని పసిపాపలు అరుదు. స్త్రీలు కథలు చెప్పటంలోనూ పౌరాణిక గాథలను గానం చెయ్యటం లోనూ ప్రత్యేకమైన నేర్పు ప్రదర్శిస్తారు. మాట కారులైన మగువల మాటలవింటే శబ్దరత్నాక రాలైనా నిర్మించవచ్చు నంటారు విజ్ఞులు. ఐతేనేం తెలుగు సాహిత్య చరిత్రలో కథానికా రచయిత్రులు తక్కువే. ఈ దశాబ్దంలో రచయిత్రులు కథానికా రచనలో చురుకుదనం వహించారు. శ్రీమతి కళ్యాణ సుందరీ జగన్నాథ్ ఆధునిక కథానికా రచయిత్రులెవ్వరికీ తీసిపోని సామర్థ్యంతో పల్లెటీవన సౌభాగ్యాన్నీ వెలుగు నీడలనూ అజ్ఞానపుటానందంలో మునిగితేలే గతుకుల బ్రతుకులనూ అందమైన వర్ణచిత్రాలుగా వ్రాశారు. ఈ కథలలోని శిల్పం గొప్పది. కథా వస్తువుతో విడదీయులేని యీ శిల్పం పడుగూ పేక లాగ కలిసిపోయి కథలకు పుష్టిని చేకూర్చింది. తెలుగు కథానిక యీ శతాబ్దంలోనే సరియైన రూపాన్ని దిద్దుకుంటున్నది.

చలంగారు కలం విదిల్చేసరికి తెలుగు కథ గడుసుదనం కూర్చుకొన్నది. జీవితపు నిండుదనాన్ని చిన్నకథలుగా మలచటంలోనే శ్రీమతి కళ్యాణసుందరి అసమానమైన నేర్పు ప్రదర్శించారు. పల్లెటూరి భాషనూ, నుడికారపు సొంపునూ రచయిత్రి అవగతం చేసుకున్నట్లు ప్రతి కథా నిరూపిస్తుంది. ప్రతి కథలోనూ శ్రీమతి కళ్యాణసుందరి తనదైన నేర్పు ప్రదర్శించారు. ఈ విషయంలో ఆమెకు కీర్తి శేషులు మల్లాది రామకృష్ణశాస్త్రిగారు గురుదేవులు. మరి రచన సాధన చేస్తున్న రచయిత చేసేవని. చక్కగా మాట్లాడినంత తేలిగ్గా చెప్పటం మహా రచయిత చేసేవని. శ్రీ చలం, మల్లాది, గోపీచంద్‌లు ఈ విషయంలో చెప్పుకోదగిన నేర్పు ప్రదర్శించినవారు. క్రీ. శే. మల్లాది వారన్నట్లేమె "ఆపేక్షా, అంతఃకరణలున్న ఆడకూతురు గనుక చెప్పినవేగాని రచియించినవి కావు. నిరాభరణమైన సౌందర్యమే కవితా సౌందర్యంగా ఆలంకారికులూ భావన చేశారు. ఈమె రచనలలో పల్లెటూరి భాష లోని సహజత్వమే కథలకు పెద్ద అలంకారం. ప్రతి కథా సహజ జీవిత చిత్రమే. కాని వినోదం కోసమో, గాంభీర్యం కోసమో, ప్రబోధం కోసమో వ్రాసినవి కావు. "అలరాస పుట్టిళ్ళు" "అసుర సంధ్య" "ఎండ మావులు" అనే కథలు చదివాక సరసుడైన చదువరి కంటికొలకుల్లో కన్నీళ్ళు నిలుస్తాయి.

జబ్బుతో ఉన్న ముసలబుగారి మూలుగులతో ప్రారంభమైన కథ 'అలరాస పుట్టిళ్ళు.' గత జీవితపు స్మృతులతో వెనక్కి ప్రాకుతుంది. సహజమనిపించి కళ్ళెదుట కనుపించినట్లుండే పల్లెటూరి వాతావర ణంలో కథంతా సాగుతుంది. నిష్కల్మషమూ, నిరుప మానమూ అయిన ప్రేమను తెలుసుకోలేక చెల్లెలు సత్యవతిని తాను ప్రేమించిన చెంగల్వరాయుడికి గాక పరాయి మనువిచ్చి ప్రేమికులను దూరం చేస్తారు. అన్నగారేమీ దుర్మార్గుడు కాడు. కాని మన సంఘం లోని సంప్రదాయాలూ అంతస్థులూ, గొప్పింటి వాళ్ల వియ్యాలూ, ఆవిధంగా చేస్తవి. ప్రేమలేని చోట అత్తింట నిలువలేక చెల్లెలు ప్రేమ ఉన్న చోటికి అలరాస పుట్టింటికి వచ్చేస్తుంది. నిరాదర ణకు గురి అవుతుంది. అన్నలూ వదినెలూ అందరూ ఛీత్కారాలు చేస్తారు.

"పరువు గల అన్నలూ పరుసమైనారా

రాకాసి వదినెలూ రానివ్వరేమో" అంటూ చిలుక సత్యవతిమనస్సులోని మాటలు వెల్లడిస్తుంది. రచయిత్రి 'ఆడకూతురు' కావటం చేతనేమో మగువ మనస్సులోని మాటను మరింత చక్కగా ధ్వనింప జేశారు. ఈ లోకపు కట్టుబాట్లకై చెల్లెలి జీవితాన్ని బుగ్గిజేసినా ఆమెపై ప్రేమతో లహరహము తప్పించి పోయి మరణశయ్యపైనగూడ ఆమెనే తలుస్తూ కన్నుమూసిన సుబ్బరాయుడి కథ కంట నీరు పెట్టిస్తుంది.

'అసురసంధ్య' అనే కథలో తండ్రి చిన్నప్పుడే పోయిన కుర్రాడి బాధలూ, అత్త నిరాదరణా, మేన మామ ఉపేక్షాభావమూ, ఆతగాడు పెద్దవాడయ్యాక మేనమామ తన స్వార్థానికి వినియోగింప జూసుకునే యత్నమూ, తన కొడుకు గొప్ప చదువులు చదివి తన కడుపున పాలుబోస్తాడనుకునే తల్లీ, ఆమె ఆశలను

నిరాశలు జేసి జీవితపు మలుపుల్లో తలవని తలంపుగా 'ఏక్సిడెంటు'కు గురియైన అభాగ్యుని జీవితం అసుర సంధ్యలో అటూ ఇటూ గాకుండా నిలిచిపోతుంది.

తాను సౌభాగ్యవతిగానే జీవితమంతా గడపాలని కోరుకునే సుమంగళి తన కోడలేమైనా పట్టించు కోకుండా, కన్నకొడుకుతో గూడ శత్రువుతోనైనా ప్రవర్తించని విధంగా వర్తిస్తుంది. తానే జబ్బుపడి తీసుకుంటున్నప్పుడు కొడుకు తనను చూడటానికైనా రానప్పుడు నరకయాతన ననుభవిస్తుంది. కొడుకు తన కుమార్తెను 'అమ్మా' అని పిలుస్తూ రోగి ఉన్న గదిలోకి రాగా సంతోషంతో కన్ను మూయడానికి సిద్ధమౌతుంది. అల్పమైన ఆ సంతోషమూ నిలవ కుండానే ఆ పిలుపు తనను కాదని తెలుసుకునే లోగానే కన్నుమూస్తుంది. ఈ విధంగా ఉదాత్తమైన యితి వృత్తంతో సాగింది "సౌభాగ్యవతి" అనే కథ.

సంస్కారవంతుడైన భర్తను అర్థం చేసు కోలేని భార్య అనుక్షణమూ జీవితాన్ని నరకప్రాయంగా చేసుకోవటమూ, అపార్థాలతోనే బ్రతుకంతా గడిపి, అపార్థం చేసుకుంటూనే వెఱ్ఱి ఆవేశంతో ఆత్మహత్య చేసుకోవటమూ "అగ్నిపుష్పం"లోని ఇతివృత్తం. శైలి అత్యుత్తమం. సంకుచితయైన ఇందిర ఆత్మ హత్య చేసుకొని కూడ ఎవ్వరి సానుభూతినీ సంపా దించుకోలేదు. అసలు అల్పజీవులు కొందరు సాను భూతినైనా పొందకుండానే అవసాన సమయంలో ప్రియహస్తస్పర్శనైనా పొందకుండానే ప్రాణం విడుస్తారు.

'రాలిన పూలు' అనే కథలో ప్రాణాపాయ పరి స్థితుల నాధారం చేసుకొని ఒక అబలతో తన కామ తృష్ణను తీర్చుకోజూస్తాడు మురళి. అయినా ఆ తుచ్ఛుడినే ప్రేమించి వివాహిత కాకుండానే విధవ కావటానికి సిద్ధమౌతుంది రాణి. తన తప్పు తెలుసు కున్న మురళి ప్రాయశ్చిత్తం తెలీక విషం మింగి ఆత్మహత్య చేసుకొంటాడు. మృత్యువు సన్నిధిలో రాణి మురళి భార్యనని బొట్టు చెరుపుకుని నిరూపించు కొంటుంది.

'ఎండమావులు' అనే కథ ముమ్మూర్తులా మల్లాది వారి శైలిని పుణికి పుచ్చుకొన్నది. తెనుగు తనాన్ని స్వంతం చేసికొన్నది. పరమ లోభిగా బ్రతికిన రథాంగపాణి హృదయం కరిగి నీళ్లు కూడ అమ్మి ధనం సంపాదించి, ఆ ధనంతోనే పెద్ద తటాకం నిర్మించి, తనపై పగబట్టి చంపటానికి సిద్ధమైన ఊరివారందరికీ ఆదర్శపాత్రుడౌతాడు. రథాంగ పాణిని చంపబోయిన వడ్రంగి చలమయ్యే అతడి విగ్రహాన్ని చెక్కి రథాంగపాణికి శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలను చేకూరుస్తాడు. చేతిలో పని. ఉలి సుత్తి ఉన్నాయి. "ఈ కొయ్య విగ్రహం చలమయ్య చేసిందే—రథాంగపాణిగారిది"— ఇంతే రచయిత్రి వ్రాసిన చివరిమాటలు. ఐతే అవి రథాంగపాణి పట్ల చలమయ్య కున్న అనుబంధాన్ని అందంగా వెల్లడి చేస్తవి.

ఆరు కథలూ ఆణిముత్యాలే. 'రాలినపువ్వులు' అన్న కథే కాస్త తీసికట్టు. తెలుగుదనాన్ని సంత రించుకొని పచ్చని చేలనూ, పల్లెపడుచు నవ్వులనూ, డేగల పరుగులనూ చూడగలిగినరచయిత్రి కృషిని పెంపొందించుకుంటే ఉత్తమ కథానికా రచయితల పంక్తిలో సరియైన చోటునే గడించుకోగలదు.

—రామమోహనరాయ్.

## అంగారతల్పం

(రచన : శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య; శ్రీ సత్యశాయి గ్రంథమండలి, విజయవాడ—3, 100పుటలు, వెల రెండు రూపాయలు.)

ఈ రచన లోగడ 'భారతి'లో పెద్దకథగా ప్రచురితమైంది. ఇప్పుడు పుస్తక రూపంలో వెలువ డింది. మానవ జీవితం చిత్రమైనది. అది కొందరికి పూలబాట అయితే మరికొందరికి అంపశయ్యగా వుంటుంది. ఈ రెండవ దానిలో హెచ్చుతగ్గులు, తర తమ భేదాలు వుంటాయి. ఈ రచనలో శాపం అని చెప్పదగ్గ అత్యంత విషాదకరమైన దుస్థితిని ఒక యువకుడు అనుభవించవలసి వస్తే ఎలా వుంటుందో రచయిత చిత్రీకరించారు. అత నొక అభాగ్యుడు. నా అన్న వారెవరూ లేరు. జనసమ్మర్దం గల నగరంలో వున్నా భయంకరమైన ఒంటరితనం అతన్ని లొంగ దీసుకుంటుంది. అతను దానితో పోరాడుతాడు. కాని క్షణక్షణానికీ దానికి వివశుడై పోతుంటాడు. పైగా కేన్సర్ వ్యాధి పీడితుడు. ఆహారం తీసుకోలేడు. గొంతు మంట. ముద్దముద్దకూ కళ్లు నీళ్లతో నిండి పర మాత్ముడు కనబడుతున్నాడని అతనే ఒకచోట చెప్పు

కుంటాడు. మరి మూడు నాలుగు నెలలు మాత్రమే జీవించగలడని డాక్టరు అతని మిత్రునితో చెప్పాడు. ఆమాట అతను విన్నాడు. అయినా జీవితం మీద విరక్తి పుట్టలేదు. ఆత్మహత్యకు ప్రయత్నించలేదు. ఏదో ఆఫీసులో గుమాస్తా ఉద్యోగం చేస్తూ సరిపడని హోటలు భోజనం చేస్తూ ఎన్నో ఇబ్బందులు పడి బస్సులో పోయివస్తూ ఆ చివరి రోజు కోసం నిరీక్షిస్తూ వుంటాడు. అతను బాగా పాడగలడు. జీవితంలో అతనికి ఆనందమిచ్చేది పాట ఒక్కటే. కాని వ్యాధి వల్ల అది అతనికి దక్కకుండా పోయింది. కొద్దీ గొప్పా మిగిలిన కంఠంతో పాడుకోవాలన్నా, ఇరుగుపొరుగు అభ్యంతరం! వింటామన్న మిత్రుల సమక్షంలో పాడి ప్రాణం మీదికి తెచ్చుకున్నాడు. వీటన్నిటినీ మించి పాదరసంలా ప్రవహిస్తూ ప్రతి అల్పవిషయాన్నిగూర్చీ ఆలోచించే చురుకైన మనసుతో అతనికి శాంతముకూడా కరువైంది. చివరకుఆసుపత్రిలో కన్నుమూయడంతో అతని కథ ముగుస్తుంది.

ఇట్టి వ్యక్తి తన కథను తానే చెప్పుకున్నట్లుగా ఆత్మాశ్రయ ధోరణిలో రచన సాగింది. పాత్ర దైహిక మానసిక స్థితికి తోడు, బాహ్య వాతావరణం తగినంత మేరకు సహజ రీతిలో కల్పించబడింది. పాత్రకు ఆ నగర జీవితంలో తారసిల్లిన ఇతర పాత్రలను రచయిత మనకు క్లుప్తంగా మాత్రమే పరిచయం చేసినా ఆ పాత్రల వైవిధ్యంవల్ల ముఖ్యపాత్ర వ్యక్తిత్వం మరింత బాగా వెలుగులోకి రావడానికి వీలయింది. ముఖ్యపాత్ర జాలి, దయ కలవాడనీ, ధర్మగుణం కలవాడనీ, స్నేహశీలి అనీ, తన యోగ్యతతో పాత్రతతో ఇతరుల సానుభూతినీ ఉపకారాన్నీ పొందగలిగాడనీ తెలుసుకోగలుగుతాము. అంతేకాదు. అతని లోపలి సైతానుకు గల నీచ ఉత్కంఠలను, దుష్టమైన కోర్కెలనూ కూడా వెల్లడించి వాటితో బాహ్యంగా ప్రవర్తించే అతని సౌమ్య వ్యక్తిత్వం ఎలా ఘర్షణ పడేదీ చూపడం వల్ల మానవునిలోవుండే మంచి చెడు వ్యక్తిత్వాల విశ్లేషణ చేసినట్లయింది. తాను దుస్థితిలో జీవిస్తున్నానని తెలిసి కూడా ఎప్పుడూ లావాటి పుస్తకం పట్టుకుని కిటికీ దగ్గరగా కూర్చొని వుండే పెళ్లికాని బ్యాంకి గుమాస్తా కూతుర్ని గూర్చి వేళాకోళంగా తరచు ప్రస్తావిస్తాడంటే అది అతని లోలోపలి వాడే!

ఇతివృత్తాన్ని బట్టీ, పాత్రలను బట్టీ, పరిస్థితులను బట్టీ కథలు అనేక రకాలుగా వుంటాయి. కొన్ని చదువుతూ వుంటే ఆనందం కలుగుతుంది. కొన్ని మానవ ప్రవృత్తిని పెద్దది చేసి చూపెడుతాయి. కొన్ని సామాజిక చైతన్యాన్నీ, సంఘర్షణనూ ప్రతిబింబిస్తాయి. కాని ఈ కథ నిస్సహాయుడైన మానవునికి సంభవించగల దురవస్థనూ, బాధ యొక్క పతాక స్థాయినీ, దానిని అనుభవించే ప్రాణి మనోభావాలనూ వెలుగునీడలనే రంగులలో చిత్రించింది. దీనిని చదవడానికి ఓపిక, సహనం, సాటిప్రాణితో నిమిత్తం వుందన్న భావం వుంటే 'అబ్బా ఎంత విషాదం' అన్న అనుభూతి కలుగుతుంది. వైశిష్ట్యం గల రచన.

వాణీకుమార్.

## సూ ము కా వ ళి

[సంకలనకర్త—శ్రీ మహీధర జగన్మోహనరావు, ప్రచురణ—శ్రీ వెలగల వీర్రెడ్డి, కాలచక్రం ప్రచురణలు, నత్తారామేశ్వరము వయా పెనుమంట్ర ప. గో. జిల్లా. పుటలు-648. వెల—రు. 10-00]

భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే 2000 సంస్కృత శ్లోకాలను అనేక సంస్కృత ఆంధ్ర గ్రంథాల నుండి తీసుకుని వాటికి తాత్పర్యాలతో సమకూర్చిన సంకలన గ్రంథమిది. ఈ గ్రంథము ప్రథమ ముద్రణం 1963లో జరిగి ప్రజాదరణంవల్ల రెండో ముద్రణానికి వచ్చింది. మొదటి కూర్పులో 1250 శ్లోకాలు ఉండగా ఈ రెండో కూర్పులో 2000 అయినవి. ఈ శ్లోకాలను, దేవతాప్రార్థనలు, ఆరోగ్య విద్యావిషయాలు, గృహస్థాశ్రమ ధర్మ విషయాలు అర్థ వ్యవహారాలు మొదలైన భిన్నభిన్న వర్గములుగా సంతరించడం జరిగింది. శ్లోకానుక్రమణిక కూడా ఇవ్వబడినది.

మొదటి కూర్పును 1964 మార్చి నెల 'భారతి'లోపూజ్యశ్రీ నోరి నరసింహశాస్త్రిగారు సమీక్షించారు.

ఈ సంకలనంలో సంగ్రహింపబడిన శ్లోకాదులన్నీ పండిత పామర జనరంజకాలై భారతీయ సంస్కృతి సామ్రాజ్యంలో సుప్రతిష్ఠితంగా ఉన్నవే. బహుశ్రుతులైన ఈ సంకలనకర్త గారు చక్కని కృషి చేసి బహుజనప్రియోక్తులైన ఈ సూక్తులను ఒకే